# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 20 సంచిక : 3 హైదరాబాద్ 244 మార్చ్ 2022 పేజీలు : 68 రు. 25

- బడ్జెట్ 2022 పై నాలుగు వ్యాసాలు
- హిజాబ్ వివాదం పై మూడు వ్యాసాలు
- మార్కెట్ విలువ పెంపు పర్యవసానాలు
- ఎపి జిల్లాల విభజన సమస్యాత్మకం
- గాలిలో దీపమవుతున్న జీవిత బీమా
- హక్కులను హరిస్తున్న పెగాసస్ స్పైవేర్
- యుక్రెయిన్ యుద్ధ పూర్వాపరాలు

# నివాళి

ఎర్రంరెడ్డి అనసూయమ్మ

ఎండ్లూరి సుధాకర్

గుడిమల్ల భరత్ భూషణ్

అల్లం పద్మ

## ఎనిమిదవ వర్ధంతి సందర్భంగా స్మరించుకుంటూ

కాకాని వెంకటేశ్వరరావు
07.03.2014

కాకాని సక్కుబాయి
06.03.2014

244

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

మార్చ్ 2022
సంపుటి : 20
సంచిక : 03







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** **VEEKSHANAM**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్ : 7330795849
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : నవ్య ప్రింటర్స్
అంబర్‌పేట్, హైదరాబాద్.

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై **'VEEKSHANAM'** అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్-**013911011002175** యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **IFSC code :UBIN0801399** నెంబర్‌తో పాటు మీ పేరు కూడా రాసి వేయాలి.

*వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన వెంకట రమణమూర్తి, హైదరాబాద్ – రు. 2,000; కె. పద్మనాభరెడ్డి, ప్రొద్దుటూరు – రు. 1,000; శ్రేయోభిలాషి, తమిళనాడు – రు. 1,000; తుర్లపాటి లక్ష్మి, నిజామాబాద్ – రు. 5,000; మిత్రులకు కృతజ్ఞతలు – సం.*

ఫిబ్రవరి వీక్షణం సంచిక చదివాను. అందులో ముఖ్యంగా ప్రస్తావించవలసినవి 4 వ్యాసాలు ఉన్నాయి. ముందుగా తిరుపతయ్యగారి వ్యాసం రాష్ట్రంలో ఉన్న వ్యవసాయ రైతుల పరిస్థితిని కళ్లకు కట్టింది. ప్రభుత్వం రైతుబంధు పేరుతోచేస్తున్న సహాయం ఒక కంటి తుడుపు చర్యగా అవగతమవుతుంది. ముఖ్యంగా చిన్న సన్నకారు రైతులకు ఈ సహాయం సరిపోవడం లేదని తెలుస్తోంది. పదుల ఎకరాల భూమి కలిగిన వారికి రైతుబంధు అందడం వల్ల ఒక కొత్త భూస్వామ్య వ్యవస్థకు అనధికారకంగా ప్రభుత్వం తెరలేపుతోంది. ఇంకో కారణం తెలంగాణలో ఎక్కువ సంఖ్యలో కౌలు రైతులున్నారు. వారికి కూడా రైతుబంధును అమలు చేయాలి. అప్పుడే ఈ పథకానికి సంపూర్ణత్వం వస్తుంది. రైతుల పట్ల అంకిత భావంతో పనిచేస్తున్న రైతు స్వరాజ్య వేదికను కించపరిచినట్టు మాట్లాడడం వివేకం కాదు. దేశవ్యాప్తంగా జరిగిన రైతు ఉద్యమాన్ని తెలుగు రాష్ట్రాలలో అవగాహన చేయించడంలో ఈ సంస్థ పాత్ర వెలకట్టలేనిది. కవిత కురుగంటి, ప్రొఫెసర్ డి. నర్సింహారెడ్డి తోను అవగాహన సదస్సులు నిర్వహింపజేయడమే కాకుండా, కన్నెగంటి రవి గారు వివిధ పత్రికలలో నిర్విరామంగా వ్యాసాలు రాస్తూ ప్రజలను చైతన్యం చేస్తున్నారు. అలాగే కిరణ్ విస్సా గారు కూడా కృషి చేస్తున్నారు. ప్రభుత్వానికి రైతులపైనిజమైన ప్రేమ ఉంటే స్వామినాథన్ కమిటీ సిఫారసులు అమలు కోసం కేంద్రంతో పోరాటం చేయాలి. అంతే కాకుండా రైతుబంధు సాయాన్ని కౌలు రైతులకు కూడా వర్తింపజేయాలి. రైతులకు అవసరం అయిన విత్తనాలు, డిఎపి లాంటివి ఉచితంగా అందజేయాలి. అంతే కాని స్వచ్ఛందంగా పని చేస్తున్న సంస్థలపై బురద జల్లడం హాస్యాస్పదం.

ఇక్కడ ప్రస్తావించాల్సింది సుధ భరద్వాజ్ ఇంటర్వ్యూ. ఈ ఇంటర్వ్యూలో ముఖ్యంగా నన్ను ఆకర్షించింది జైలులో ఉండే మహిళల సృజనాత్మకత. సుధ పుట్టిన రోజు నాడు వారు ఆమెపై కురిపించిన ప్రేమాభిమానాలు. అలాగే ఆమె భారతీయ జైళ్లలో ఉన్న అనాగరిక పరిస్థితులను కళ్లకు కడుతున్నారు. కనీసం వారిపైన మోపబడిన నేరం ఏమిటి, అసలు చార్జిషీట్ దాఖలు అయ్యిందా లేదా, విచారణ ఎప్పుడు జరుగుతుంది, వాళ్లకు కేటాయించిన న్యాయవాది ఎవరు అని తెలుసుకోలేని దయనీయ స్థితిలో ఉన్నారంటే చాలా బాధేసింది. న్యాయ సహాయం చేసే న్యాయవాదులకు 3,000 మాత్రమే ఇస్తారని ఆమె చెప్పారు. ఇప్పటి కాలంలో ఇది ఎంత మాత్రం ఆమోదనీయం కాదు. అలాగే జ్యోతి జగతాప్ చేసిన చైతన్య పూర్వక ప్రయత్నం కూడా అభినందించదగ్గది. ఇంకొక విషయం సుధకు చత్తీస్‌గఢ్ పైన ఉన్న ప్రేమ. అణగారిన వర్గాల మీద బాధ్యత.కార్మికుల సమస్యలను పరిష్కరించాలని ఉన్న తాపత్రయం ఆమె మాటలో స్పష్టంగా కనబడ్డాయి.

ప్రభుత్వం ఇప్పటికైనా భీమా కోరేగాం కేసులో అక్రమంగా అరెస్ట్ చేసిన వారందరిని బేషరతుగా విడుదల చేయాలి. ఒడిశాలో జిందాల్ కంపెనీకి చెందిన ప్లాంట్ ఏర్పాటుకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంలో మహిళలు ముందువరుసలో నిలబడి కొట్లాడడం సంతోషకరం. రైతుల మహా ఉద్యమం స్ఫూర్తిగా పెట్టుబడి దళారుల చేతిలో వారి సహజవనరులు పడి జీవితాలు ఛిద్రం కాకుండా బరిగిసి పోరాటం జరుపుతున్న మహిళలకు వందనం.

– **బి. అవినాష్**
*జనగామ*

వీ

Statement about ownership and other particulars of periodical **Veekshanam** as required to be published in the first issue of every year after the last day of February

Form IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(N. Venugopal Rao)*

Date : 1st March, 2022 Signature of the Publisher

కోవిడ్ వల్ల పత్రికలలో సాధారణ వార్తలు రావడం లేదు గనుక అసహజ మరణాల సూచి సమగ్రంగా తయారు చేయడం సాధ్యం కావడం లేదు. కొద్దికాలంగా అసహజ మరణాల సూచి వేయలేకపోతున్నందుకు చింతిస్తున్నాం. సం.

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

# హిజాబ్ వివాదం వెనుక విద్వేష రాజకీయాలు

**ము**స్లిం బాలికల వ్యక్తిగత దుస్తుల ఎంపిక మీద హిందుత్వ శక్తులు లేవదీసిన వివాదం దేశ ప్రజానీకాన్ని, ప్రత్యేకించి కర్ణాటక ప్రజానీకాన్ని, న్యాయవ్యవస్థను అతలాకుతలం చేసి, అటా, ఇటా అని విభజన రేఖ గీస్తున్నది. ఎవరైనా ధరించే దుస్తులు పూర్తిగా వ్యక్తిగతమైన అంశం. దాని మీద వాతావరణం, ఆర్థిక పరిస్థితి, మతం, సంస్కృతి, అలవాట్లు, సౌలభ్యం, ప్రభావాలు వంటి అనేక కారణాలు ఉంటాయి. ఒకానొక సందర్భంలో మతం పాత్ర ప్రధానం కావచ్చు. ఒక మతం నిర్దేశించే విధివిధానాలు కాలం చెల్లినవి అయితే, వాటిని మార్చే కృషి అంతర్గతంగా జరగవలసిందే తప్ప, ఆ మతం మీద దాడి చేయదలచిన మరొక మతస్తులకు అది సాకు కాగూడదు. కాని హిందూత్వవాదులు ఇవాళ హిజాబ్ ను కేవలం ఒక మతచిహ్నంగా మాత్రమే చూపుతూ, ముస్లింల మీద దాడికి దాన్ని ఒక సాధనంగా వాడుకుంటున్నారు. అది మత చిహ్నం అయినా కాకపోయినా వివాదాస్పదం చేయనక్కర లేదు. మరీ ముఖ్యంగా అది ధరిస్తే విద్యాసంస్థలో ప్రవేశించడానికి వీలులేదని ఆంక్షలు విధించడం మతం పట్ల వ్యతిరేకతను మించినది, లేకలేక దొరికిన విద్యావకాశాల్ని నిరాకరించడమే. అంటే సాధారణ హేతుదృష్టితో చూస్తే హిజాబ్ వేసుకోవచ్చునా లేదా అనేది అత్యంత అనవసరమైన వివాదం, కుట్రపూరితంగా సంచలనంగా మార్చిన వివాదం. మతం ప్రాతిపదికగా మనుషులను చీల్చడానికి సృష్టించిన వివాదం. ఇది పార్లమెంటరీ ఎన్నికల రాజకీయాల ఎత్తుగడ. మొత్తంగా ముస్లింల పట్ల విద్వేషాన్ని, ప్రత్యేకించి ముక్కుపచ్చలారని విద్యార్థినుల మీదికి ఎక్కుపెడుతున్న దుర్మార్గం. స్త్రీల హక్కుల రక్షణ పేరుతో, స్త్రీలను పితృస్వామిక బంధనాల నుంచి విముక్తి చేస్తున్నామనే పేరుతో, బహిరంగ సామాజిక స్థలాలలో మత చిహ్నాలు ధరించగూడదనే పేరుతో వాస్తవంగా జరుగుతున్న విద్యా హక్కు నిరాకరణ, అస్తిత్వ విధ్వంసం.

మొట్టమొదట ఈ వివాదం రాజుకున్నది ఉత్తరప్రదేశ్ తదితర రాష్ట్రాల ఎన్నికల సందర్భంలో అనేది గుర్తించాలి. ఎన్నికలు ఎంత బూటకమైనవైనా, ఎన్నికల్లో నిజమైన ప్రజాభిప్రాయం వ్యక్తం కావడం అసాధ్యమే అయినా, ఎన్నికల్లో పోటీపడే పాలకవర్గ ముఠాలు ప్రజాభిప్రాయాన్ని తమకు అనుకూలంగా మార్చుకోవడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తుంటాయి. ఎన్నికలు దగ్గర పడే కొద్దీ ప్రజాభిప్రాయాన్ని మార్చే, భావోద్వేగాలను రెచ్చగొట్టే, తప్పుడు కారణాల మీద వోటు బ్యాంకులను పెంచుకునే కుట్రలూ కుహకాలూ పెరుగుతాయి. అందుకే ప్రతి సార్వత్రిక ఎన్నికల సందర్భంలో సరిహద్దుల్లో ఘర్షణల వార్తలు వెలువడి 'దేశభక్తి' ఏరులై పారుతుంది. సంఘ్ పరివార్ పాలక ముఠాకు సరిహద్దుల్లో ఘర్షణల వార్తలతో పాటు అదనంగా సొంత ఎజెండా మరొకటి ఉంది. అది ముస్లింల పట్ల హిందువులలో విద్వేషాన్ని రెచ్చగొట్టడం, ముస్లింలను భయోత్పాతానికి గురిచేయడం, హిందూ మతం ప్రమాదంలో పడిందని ప్రచారం చేసి రక్షకురాలినని తానేనని హిందువులను నమ్మించి వోటు బ్యాంకును స్థిరపరచుకోవడం. ఆ కార్యక్రమం ఇప్పుడు గెలుపు అనుమానాస్పదంగా మారిన శాసనసభ ఎన్నికల సందర్భంగా పెద్ద ఎత్తున రంగం మీదికి వస్తున్నది. హిజాబ్ వివాదానికి మూలం ఈ ఎన్నికల వ్యూహంలో ఉంది. ముస్లిం విద్యార్థినుల సున్నితమైన మనోభావాలను గాయపరచడం, హిందూ విద్యార్థులలో విద్వేష బీజాలు నాటి, తప్పుడు కారణాలపై వారిని సమీకరించడం, వివాదం న్యాయస్థానాలకు ఎక్కి ఎంతగా సాగితే అంతగా ఎన్నికల ప్రచార అంశంగా వాడుకోవడం – ఇదంతా ఒక పద్ధతి ప్రకారం జరుగుతున్నది.

హిజాబ్, బురా? వంటి వాటిని కేవలం స్త్రీలను బంధనాలలో ఉంచే పితృస్వామ్య, పురుషాధిపత్య చిహ్నాలుగా చూసే ప్రగతిశీల వాదులు కొందరు కూడ ఈ అసలు ఉద్దేశాలను విస్మరించి హిందుత్వ వాదనలను సమర్థించే దగ్గరికి చేరుతున్నారు. హిజాబ్ ను వ్యతిరేకించడంలో హిందుత్వవాదులను నడుపుతున్నది పితృస్వామ్యం మీద విమర్శ ఎంతమాత్రమూ కాదు. మొత్తంగా ముస్లింల మీద విద్వేషం వ్యాపింపజేయడంలో భాగంగా జనామోదం పొందగల అంశాల కోసం వెతుకులాటలో హిందుత్వవాదులు తలాక్, హిజాబ్ వంటి వాటిని తమ అవసరాలకు వాడుకుంటున్నారు. కనుక ఇది రూపంలో స్త్రీల విముక్తి ప్రతీకగా కనబడినా సారాంశంలో అందుకు పూర్తిగా భిన్నమైనది. ఈ పేరు మీద ముస్లిం బాలికలను విద్యాసంస్థలలో అడుగు పెట్టనివ్వకపోవడం నిజానికి ముస్లిం సమాజం లోని పితృస్వామ్యాన్ని, స్త్రీల అవిద్యను ఇంకా పెంచడానికే దోహదం చేస్తుంది. ఇప్పుడిప్పుడే విద్యలోకి ప్రవేశిస్తున్న సమూహపు విద్యాహక్కును నిరాకరించడమే అవుతుంది. మరొక వైపు నుంచి చూస్తే, అసలు లౌకిక స్థలాలలో మత చిహ్నాల బహిరంగ ప్రదర్శన జరగగూడదనే ఆదర్శం, ఈ దేశంలో అమలవుతున్న తలకిందుల లౌకికవిధానం వల్ల ఎప్పుడో విధ్వంసం అయింది. మతం పూర్తిగా వ్యక్తిగత జీవితానికి పరిమితం కావాలని, సామాజిక జీవితంలో, రాజ్యంలో, విద్యలో మతజోక్యం ఉండగూడదని లౌకికవాదం చెపుతుంది. కాని రాజ్య కార్యక్రమాలన్నీ హిందూ మత ఆచారాలతో నడుపుతూ, బహిరంగ స్థలాలలో హిందూ మతచిహ్నాల ప్రదర్శన పెద్ద ఎత్తున జరుగుతూ ఉన్నప్పుడు, కేవల ముస్లిం బాలికల వ్యక్తిగత ఆహార్యం విషయంలో మాత్రమే మతచిహ్నాలు ఉండగూడదనడం కపటత్వం. విద్యాసంస్థలలో అందరూ ఒకేరకమైన దుస్తులు ధరించాలనేది పూర్తిగా అమలవుతున్న దాఖలాలు ఏమీ లేవు. కట్టు, బొట్టు, ఆభరణాలు వంటి మెజారిటీ మత చిహ్నాలు యథేచ్ఛగా రాజ్యం చేస్తూనే ఉన్నాయి.

కనుక ఏ రకంగా చూసినా హిజాబ్ ధరించడం మీద ఆంక్షలు, హిజాబ్ ధరించిన బాలికలు విద్యాసంస్థల్లో ప్రవేశించకుండా తీసుకున్న చర్యలు, న్యాయస్థానాలు కూడా వ్యక్తిగత హక్కులను భంగపరిచే విధంగా నంగిగా, ప్రచ్ఛన్న హిందుత్వతో ప్రవర్తించడం మొత్తంగా హిందుత్వ ఎజెండా అమలు తీరుకు నిదర్శనం. పైకి కనబడే ఈ అంశాలతో పొరపడకుండా, సమస్య లోతుల్లోకి వెళ్లి అర్థం చేసుకోవడం, హిందుత్వవాదుల కుట్రాజకీయాన్ని ప్రతిఘటించడం, ముస్లిం బాలికల విద్యా హక్కును సంపూర్ణంగా సమర్థించడం, అదే సమయంలో అస్తిత్వ వాద పరిమితుల్లో కూరుకుపోకుండా అస్తిత్వంలో కొనసాగుతున్న కాలం చెల్లిన ఆచారాల మీద అంతర్గత విమర్శను ప్రోత్సహించడం ఇవాళ సామాజిక శాంతిని కోరుకునే ప్రగతిశీలవాదుల కర్తవ్యం. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# ఇక డిల్లిల పెద్దరికమే బాకీ...

**అ**బ్బ దిల్ బర్పూరుగున్నది, మస్తు కుషీ అయితాంది. దొరవారు వరుసబెట్టి పువ్వు గుర్తు మీద బాణాలు గొడ్తాంటె శానా సంబురంమైతున్నది. ఎల్లయ్య పుల్లయ్యను గుడ గాదు సూటి బెట్టి ప్రతానమంత్రి మోడీనే చెరిగిపారేస్తాండు దొర. ఇంగ కావల్సిందేమున్నది? వడ్లు కొంటరా లేదా అన్నకాడ మొదలైన చిచ్చు రగిలి రగిలి ఊరినే కాలవెట్టబట్టె. అసలు ఏడేండ్లల్ల మీరు ఊడపొడిశిందేంది అని దొర నిలదీస్తాండు. నోటబట్టరాని మాటలంటాండు. పువ్వు గుర్తోళ్లను ఎల్లగొడితెనే దేశం బాగుపడ్తదంటాండు. గా మాటలన్ని ఇంటాంటె కడ్పు నిండిపాయె. ఇగాకరుకు గా మాటలన్నాక రెండొద్దులకే మోడీతోని కలిశే మోఖ వస్తే జరమొచ్చినదని తప్పిచ్చుకున్నడు. మోడీని మెచ్చుకున్నడని జియ్యర్ స్వామిని గూడ పక్కనబెట్టిండు. గిదంత సీన్మనా నిచ్చెమేనా అని అందరు అఫ్సోసు అయిరి. కత గాడికి ఆగకపాయె. మోడీని, పువ్వు గుర్తును ఓడగొట్టుటానికి నేనే అందర్ని కలుపుత అని దొర పెద్ద లీడర్లకు ఫోన్లు గొట్టిరి, బొంబాయికి గూడ పోయి వచ్చిరి. సీన్మల్ల సుమో బండ్లు ఎగిరిపడ్డట్టు, ఒక్కడు వందల మందిని గొట్టినట్టు, పీనిగె లేశివచ్చినట్టు గమ్మతులు జరుగుతయి గద, గటువంటి టుపాకి ఎంకట్రామని పెగ్గెలన్ని పట్నంల జరుగబట్టె. ఇగ దొర డిల్లికి మకాం మార్చి ఆడ శక్రం దిప్పుతడని గుడ అందరు అనుకోవట్టిరి. అంత మంచిగున్నది. కాని ఇదంతా నిచ్చెమేనా అని? దొరకూ పువ్వు గుర్తోల్లకూ నిజంగ పడిపడకుండొచ్చిందా అని? పువ్వు గుర్తోల్లకంటె తనే ఎక్కువ ఇందువునని దొర ఎన్నోసార్లు జెప్పె. పువ్వు గుర్తోల్లు గుడ జెయ్యని పనులు, ముక్కెమంత్రి కుర్శిల మొదాలు జియ్యర్ సామిని కూసోబెట్టుడు, బొచ్చెడన్ని యాగాలు జేసుడు, బాపనోల్ల కన్న ఎక్కువ పూజలు జేసుడు. పువ్వు గుర్తోల్లు తెచ్చిన ఖానూన్లన్ని అందరికంటె ముందుగాల ఉరికురికి మద్దతిచ్చిరి. ఏడేండ్లల్ల ఏం పొడుగయిందని గిప్పుడు రొకాయిస్తాండ్లు గని, గవన్ని దొర సాత్ ఇచ్చినవేనాయె. మారె, గీ సీన్మ నమ్మెటట్టుగ లేదు. ఇచిత్రం జూసిండ్రా, గిప్పుడు గూడ పువ్వు గుర్తోల్ల మద్దతుదార్లను బైటికి రావయ్యా అని అడుగుతలేడు, ఇదివరుకే పువ్వు గుర్తోల్లకు కిలాఫుగున్నోల్లను, చెయ్యి గుర్తోల్ల తోటి ఉన్నోల్లను కలియబెట్టబట్టె. అంటె చెయ్యి గుర్తోల్ల బలగంల గండిగొట్టి పువ్వు గుర్తోల్లకు లాబం చేసుటానికేనా? ఎటుబొయ్యి ఎటొచ్చినా పువ్వు గుర్తుకు తక్కువబడ్డయి అదలు బదలు ఇచ్చుటానికేనా? లేకపోతె కొడుకును ఈడ పట్నం గద్దె మీద కూసోబెట్టి డిల్లిల శక్రం దిప్పుటానికి కోశీష్ జరుగుతాందా? తెలంగాణ కొట్లాటల ఎంకన్న పాటుండె. 'రావచ్చు పోవచ్చు రొయ్యలమ్ముకోవచ్చు, కని సెక్రటేరియట్ల శక్రం దిప్పుడు చెల్లది' అని. ఆంద్రోల్ల మీద. అవ్వల్ దర్జగున్నదని అందరం సప్పట్లు గొడుతుంటిమి. గదే మాట డిల్లిల అనరా? గిప్పుడు మన దొరకు డిల్లిల శక్రం దిప్పాల్నని కాయిష్ బడ్డదా ఏంది? కుదుర్తదా? ఊదు గాల్తదా పీరి లేస్తదా? మునుపు రామన్న, శెంద్రన్న గుడ గిట్లనే ఢిల్లిల శక్రం దిప్పుతమని ఎగురలేదా? కొసాఖరికి ఏమాయె? పెద్దిరికం ఒగల్లు ఇస్తే రావాలె గాని మనకు మనం తీసుకుంటమంటె నడుత్తదా, నడువనిత్తరా?

వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# వివాదాలకు తావిస్తున్న జిల్లాల విభజన

**ఆం**ధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం ఉన్న 13 జిల్లాలను పునర్విభజించి 26 జిల్లాలు చేసే ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం జనవరి 26న ప్రకటించింది. ఈ ప్రతిపాదన మీద అభ్యంతరాలను, సూచనలను పరిశీలించి మార్చ్ 10న విభజనను ఖరారు చేస్తామని, ఏప్రిల్ 2 నుంచి అమలు చేస్తామని చెపుతున్నది. ఒక పార్లమెంటు నియోజకవర్గం ఒక జిల్లాగా ఉంటే బాగుంటుందని అధికార పార్టీ గతంలో చేసిన ప్రకటన, పొరుగున తెలంగాణలో కొత్త జిల్లాల ఏర్పాటు, నిజంగానే ప్రస్తుతం ఉన్న జిల్లాల జనాభా, విస్తీర్ణాలతో ఉన్న ఇబ్బందులు ఈ కొత్త నిర్ణయానికి కారణాలు కావచ్చు. అలాగే రాష్ట్రంలో అప్పటికి కొనసాగుతున్న, ఉధృతమవుతున్న ఉద్యోగుల, ఉపాధ్యాయుల ఉద్యమం నుంచి ప్రజల దృష్టిని మళ్లించడం తక్షణ కారణం కావచ్చు. కాని జిల్లాల విభజన, కొత్త జిల్లాల ఏర్పాటు అనే నిర్ణయాలు అంత అలవోకగా, తొందరపాటుతో తీసుకునేవి కావు. జిల్లాలకు భౌగోళిక, చారిత్రక, రాజకీయార్థిక ప్రాతిపదికలెన్నో ఉంటాయి. జిల్లా కేంద్రంలో ఉన్న వసతులు, సౌకర్యాలు, జిల్లాలోని అన్ని ప్రాంతాల నుంచి కేంద్రానికి రవాణా సౌకర్యాలు, జిల్లా ప్రజల మనోభావాలు వంటి అనేక కారణాలతో జిల్లాలను జాగ్రత్తగా ఏర్పాటు చేయవలసి ఉంటుంది. జనవరి 26 ప్రకటన తర్వాత రాష్ట్రవ్యాప్తంగా జరుగుతున్న చర్చలు, వివాదాలు, ఆందోళనలు చూస్తే ఆ నిర్ణయం తగినంత ఆలోచనతో జరగలేదని అర్థమవుతున్నది. మొట్టమొదట, 25 పార్లమెంటు నియోజకవర్గాలుండగా 26 జిల్లాలు చేయడం తామే పెట్టుకున్న ప్రాతిపదికను ఉల్లంఘించడమే. రెండవది, కొత్త జిల్లాల ఏర్పాటుకు భౌగోళిక, రవాణా, విస్తీర్ణం, జనాభా వంటి ఏ ప్రాతిపదికలూ సక్రమంగా లేవు. అతి తక్కువ 928 చకిమీ విస్తీర్ణంతో ఒక జిల్లా ఉండగా, పన్నెండు రెట్లు ఎక్కువగా 14,322 చకిమీ విస్తీర్ణంతో మరొక జిల్లా ఉంది. తొమ్మిది లక్షల జనాభా ఉన్న జిల్లా, 24 లక్షల జనాభా ఉన్న జిల్లా కూడ ఉన్నాయి. మూడవది, జిల్లాలకు పెట్టిన పేర్లు వివాదానికి దారితీసేలా ఉన్నాయి. అల్లూరి సీతారామరాజు, ఎన్ టి రామారావు, అన్నమయ్య వంటి పేర్లు ఆమోదయోగ్యమే కావచ్చు గాని వివాదాలకు పేరుమోసిన సత్యసాయిబాబా పేరు మీద జిల్లా ఉండడం అవమానకరం. ఇటువంటి ఎన్నో అసంగతాల వల్లనే కావచ్చు, మార్పులను సూచిస్తూ దాదాపు రెండువేల సలహాలు ప్రభుత్వానికి అందాయి. తమకు కొత్త జిల్లా ఏర్పాటు చేయాలని, తమను సమీపంలో ఉన్న జిల్లాకు మార్చాలని, తమ జిల్లాకు ఒక వ్యక్తి పేరు పెట్టాలని ఈ సూచనలు కోరుతున్నాయి. ఇవన్నీ అలా ఉండగా పాత జిల్లాల ఆస్తులను, ఉద్యోగులను పంపిణీ చేయడంలో మరెన్నో వివాదాలు తలెత్తుతాయి. ప్రభుత్వం చెప్పే సమర్థనలు ఎలా ఉన్నప్పటికీ, అసలు ఇంత పెద్ద ఎత్తున జిల్లాల పునర్వ్యవస్థీకరణ ప్రజలకు మెరుగైన పాలనను అందించడానికి దారి తీస్తుందా, లేక కొత్త జిల్లా కేంద్రాలలో రియల్ ఎస్టేట్ వ్యాపారం ఇబ్బడి ముబ్బడి కావడానికీ, తద్వారా మరిన్ని ఆధిపత్య శక్తులు బలపడడానికీ, మరింత పెద్ద ఎత్తున దోపిడీ పీడనలకూ దారి తీస్తుందా అనే ప్రశ్నలు మిగిలే ఉంటాయి. జిల్లాల విభజనతో పాలనా సౌలభ్యం అనే ఆదర్శం నెరవేరలేదు సరిగదా, రాజకీయ, వ్యాపార రంగాలలో అవాంఛనీయమైన ధోరణులు పెరిగిపోవడానికి అది దారితీసిందని పొరుగున ఉన్న తెలంగాణ చూపుతున్నది. ఆంధ్రప్రదేశ్ ఆ అనుభవం నుంచి ఏమైనా గుణపాఠం నేర్చుకుంటుందా?

వీ

# ఏడేళ్ల అంతర్యుద్ధంలో యెమెన్ అతలాకుతలం

- ఎ. నర్సింహారెడ్డి

అరబ్ ప్రపంచంలోని అత్యంత పేద దేశాల్లో ఒకటైన యెమెన్ అంతర్యుద్ధంతో అతలాకుతలమైంది. చరిత్రలో యెమెన్ 19వ శతాబ్దం నుండి ఉత్తర, దక్షిణ యెమెన్‌లుగా విభజించబడి ఉంది. ఉత్తరాన అమెరికా – సౌదీ మద్దతు గల యెమెన్ అరబ్ రిపబ్లిక్, దక్షిణాన సోవియట్ మద్దతు గల పీపుల్స్ డెమోక్రటిక్ రిపబ్లిక్ ఆఫ్ యెమెన్‌ల ఏకీకరణతో 1990లో రిపబ్లిక్ ఆఫ్ యెమెన్ ఏర్పడింది. 1978 నుంచి ఉత్తర యెమెన్‌ను పాలించిన సైనిక అధికారి అలీ అబ్దుల్లా సలేహ్ ఏకీకృత యెమెన్ అధ్యక్షుడు అయ్యాడు. రెండు యెమెన్‌లు విలీనమైనప్పటికీ రెండు ప్రాంతాల ప్రజల మధ్య భావ సమైక్యత ఏర్పడలేదు. తరచూ ఘర్షణలు జరుగుతూ ఉండేవి. అందుకు కారణం ఒకప్పటి పాలకులైన జైదీలు ఇప్పుడు మైనారిటీలో ఉన్నారు. ఫెడరల్ ప్రభుత్వానికి నేతృత్వం వహిస్తున్న పాలకులు తమను వివక్షకు గురిచేస్తున్నారంటూ ఆందోళన ప్రారంభించారు. ఇస్లామిక్ ప్రపంచంలో షియాలు మైనారిటీ కమ్యూనిటీ, జైదీలు షియాలలో మైనారిటీ. హౌతీలు అంటే జైదీ షియాలు. అధ్యక్షుడు అలీ అబ్దుల్లా సలేహ్ అవినీతికి వ్యతిరేకంగా హుస్సేన్ అబ్దుల్ మాలిక్ బద్రెద్దీన్ అల్ హౌతీ నాయకత్వంలో హౌతీ జిహాదీ గ్రూప్ 1990లో ఏర్పడింది. హౌతీ ఉద్యమాన్ని అధికారికంగా అన్సార్ అల్లా (దేవుని మద్దతుదారులు) అని పిలుస్తారు. హౌతీ భావజాలం "దేవుడు గొప్పవాడు, అమెరికాకు మరణం, ఇజ్రాయెల్‌కు మరణం, యూదులపై శాపం, ఇస్లాంకు విజయం". హౌతీల సంకల్పం జైదీ పునరుజ్జీవనం, ఇస్లామిక్ విప్లవం, సామాజిక న్యాయం. షియా సున్నీ ఐక్యత, సామ్రాజ్యవాద వ్యతిరేకత, యెమెన్ జాతీయవాదం, జియోనిజానికి వ్యతిరేకత.

హౌతీలు 2004 నుంచి హుస్సేన్ బద్రెద్దీన్ అల్ హౌతీ నేతృత్వంలో ప్రభుత్వంపై పోరాటాన్ని ప్రారంభించారు. తాము అధిక సంఖ్యలో ఉన్న ప్రాంతాలకు మరింత స్వాతంత్ర్యం కావాలని డిమాండ్ చేశారు. 2004 సెప్టెంబర్ 10న హుస్సేన్ బద్రెద్దీన్ అల్ హౌతీని భద్రతా దళాలు హత్య చేశాయి. అరబ్ వసంతం తర్వాత హౌతీల నిరసన ప్రదర్శనలు పతాక స్థాయికి చేరాయి. దేశ రాజధాని సనా గవర్నేట్స్‌లలో హౌతీలు పట్టు సాధించారు. ఈ సుదీర్ఘ పోరాటంలో ప్రభుత్వ సైన్యం, సౌదీ విమానాలు కలిసి పనిచేశాయి. అమెరికా సౌదీకి 6500 లక్షల డాలర్లు, యుఎఇకి 2900 లక్షల డాలర్లు అందించింది. 2015 నుంచి ప్రభుత్వ సైన్యం, సౌదీ సంకీర్ణ దళాలకు హౌతీలకు మధ్య సాయుధ పోరాటమే జరుగుతోంది. యెమెన్‌లోని అల్ మహ్రపై సౌదీ, సోకోట్రా దీవిపై యుఎఇ నియంత్రణ నెలకొల్పారు. అమెరికా, సౌదీ, యుఎఇలు తమ స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి అడ్డుగా ఉన్నారన్నది హౌతీల ధృఢ అభిప్రాయం. ఏడేళ్ల అంతర్యుద్ధంలో మొత్తం 2,23,000 మంది మరణించారు. వీరిలో 1,31,000 మంది ఆహారం, వైద్యం అందక చనిపోయారు. లక్షలాది మంది నిరాశ్రయులయ్యారు. జనవరిలో హౌతీ దళాలు అబుదాబి విమానాశ్రయం సమీపంలో చమురు క్షేత్రాలపై డ్రోన్ దాడులు జరిపాయి. ఇద్దరు ఇండియన్లు, ఒక పాకిస్తానీ చనిపోయారు. మరో ఆరుగురు గాయపడ్డారు. ప్రతీకారంగా సౌదీ సంకీర్ణ దళాలు మరుసటి రోజు హౌతీ తీవ్రవాదుల స్థావరాలపై అగ్ని వర్షం కురిపించాయి. యెమెన్ సుస్థిరతకు తీసుకోవాల్సిన రాజకీయ ప్రక్రియ వైఫల్యంలో ఈ సంఘర్షణలకు మూలాలు ఉన్నాయి. వీ



# మిత్రులకు నివాళి

వీక్షణం గత సంచిక (ఫిబ్రవరి 2022) ప్రెస్ కు వెళ్లినప్పటి నుంచి ఈ సంచిక (మార్చ్ 2022) ప్రెస్ కు వెళ్తున్నప్పటి వరకు గడిచిన నెలరోజుల్లో వీక్షణం చాల మంది మిత్రుల మరణవార్తల విషాదాన్ని అనుభవించింది. మరణించిన మిత్రులందరికీ వీక్షణం కలెక్టివ్ నివాళి అర్పిస్తున్నది. వారందరూ విస్తారమైన సామాజిక ఆచరణ ఉన్నవాళ్లు, సామాజిక చైతన్య విస్తరణలో భాగమైన వాళ్లు, తోటివారికి ఏదో ఒక రకమైన సహాయం చేస్తూ ఆదర్శప్రాయమైన జీవితం గడిపినవాళ్లు. వారి మరణం సమాజానికి ఏదో ఒకస్థాయిలో పూడ్చలేని లోటే. వారు భౌతికంగా మననుంచి దూరమైనప్పటికీ, వారి జ్ఞాపకాలు, వారు చేసిన ఆలోచనలు, కృషి సమాజానికి ఎల్లప్పుడూ స్ఫూర్తిని ఇస్తూనే ఉంటాయని నమ్ముతూ, వీక్షణం కలెక్టివ్ వారందరికీ నివాళి అర్పిస్తున్నది. వారి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తున్నది.

కవి, కథా రచయిత, సాహిత్య విమర్శకుడు, అధ్యాపకుడు, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ తెలుగు ప్రొఫెసర్ ఎండ్లూరి సుధాకర్ (63) కొంతకాలంగా హృద్రోగంతో, మధుమేహ వ్యాధితో బాధపడుతూ, చికిత్స తీసుకుంటూ, జనవరి 28న హైదరాబాద్ లో మరణించారు. వర్తమానం, కొత్తగబ్బిలం, నల్లద్రాక్ష పందిరి, పుష్కర కవితలు, వర్గీకరణీయం, గోసంగి వంటి కవిత్వ సంపుటాలు, మల్లెమొగ్గల గొడుగు కథలు, అనేక సాహిత్య విమర్శ పుస్తకాలు ప్రచురించారు.

చిత్రకారులు, వ్యంగ్య చిత్రకారులు, రచయిత, 'బుజ్జాయి' అనే కలం పేరుతో సుప్రసిద్ధులు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి (91) చెన్నైలో జనవరి 28న మరణించారు. భావకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి కొడుకైన బుజ్జాయి పాఠశాల విద్య కూడ నియత పద్ధతిలో చదవలేదు. తండ్రి వెంట సభలకు, సమావేశాలకు తిరగడంలో చదువుకోలేదని ఆయనే రాసుకున్నారు. కాని తెలుగు, ఇంగ్లిష్ రెండు భాషలలోనూ అద్భుతమైన కార్టూన్లు, కార్టూన్ సిరీస్ లు వేసిన వ్యంగ్య చిత్రకారులుగా, చిత్రకారులుగా అపారమైన ఖ్యాతి గడించారు. తండ్రితో అనుభవాలను 'నాన్న-నేను' అని పుస్తకంగా రాశారు.

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటపు ప్రధాన కేంద్రం కడివెండికి చెందిన ఎర్రంరెడ్డి అనసూయమ్మ (99) జనవరి 30న హైదరాబాద్ లో మరణించారు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం నాటి నుంచి ఇటీవల వృద్ధాప్యంతో అనారోగ్యానికి గురైన దాకా ఆమె ప్రజా ప్రత్యామ్నాయ రాజకీయాలకు గట్టి సానుభూతిపరులుగా ఉన్నారు. ఆమె 1999 డిసెంబర్ లో బూటకపు ఎన్ కౌంటర్ లో హత్యకు గురైన అప్పటి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు) (పీపుల్స్ వార్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కార్యదర్శి ఎర్రంరెడ్డి సంతోష్ రెడ్డికీ, వీక్షణం కలెక్టివ్ లో కీలక సభ్యులు, ఉపాధ్యాయ ఉద్యమ నేత ఎ. నరసింహారెడ్డి గారికీ తల్లి,

తెలంగాణ జనజీవనాన్ని తన ఫొటోగ్రఫీలో, చిత్రకళలో అద్భుతంగా చిత్రించిన గుడిమల్ల భరత్ భూషణ్ (66) జనవరి 31న హైదరాబాద్ లో కన్ను మూశారు. వరంగల్ సి కె ఎం కాలేజీ విద్యార్థిగా 1970ల మధ్య భాగంలో ప్రగతిశీల భావాలవైపు ఆకర్షితుడైన భరత్ భూషణ్ హైదరాబాద్‌లో ఫైన్ ఆర్ట్స్ చదివి, ఫొటోగ్రాఫర్ గా స్థిరపడ్డారు. తెలంగాణ సంస్కృతిని ప్రతిబింబించే అనేక ఫొటోగ్రాఫులు, తెలంగాణ ప్రముఖుల ఫొటోగ్రాఫులు వేలాదిగా తీశారు. చిత్రకళలో కూడ విస్తారమైన కృషి చేశారు.

శ్రీకాకుళ సాహితి వ్యవస్థాపక అధ్యక్షుడు, జానపద వైద్యుడు, వృక్షశాస్త్ర అధ్యాపకుడు, పర్యావరణ చైతన్య ప్రచారకుడు బివిఎ రామారావు నాయుడు ఫిబ్రవరి 3న శ్రీకాకుళంలో మరణించారు. ప్రస్తుతం ప్రజలు ఎదుర్కొంటున్న అనేక అనారోగ్యాలకు వృక్ష, జానపద, ఆదివాసి పద్ధతులలో చికిత్సలు ఉన్నాయని ఆయన నాలుగు దశాబ్దాలుగా ప్రచారం చేస్తున్నారు. ప్రత్యేకించి ఉత్తరాంధ్ర ప్రాంతంలో సామాజిక, సాహిత్య చైతన్య వ్యాప్తిలో ఆయన అపారమైన కృషి చేశారు.

కొడవటిగంటి కుటుంబరావు గారి సహచరి, కొడవటిగంటి రోహిణీప్రసాద్, ఆర్ శాంతసుందరిల తల్లి, సాహిత్యాభిమాని కొడవటిగంటి వరూధిని (97) ఫిబ్రవరి 9న హైదరాబాద్‌లో మరణించారు. స్వయంగా ఏమీ రచనలు చేయకపోయినా రెండువైపులా సాహిత్యకారుల కుటుంబాలు కావడం వల్ల ఆమె సాహిత్యం మీద, సమాజం మీద చాల నిశితమైన, కచ్చితమైన అభిప్రాయాలు ప్రకటిస్తుండేవారు.

కవి, తెలంగాణ జర్నలిస్టు ఉద్యమ నాయకుడు, తెలంగాణ ప్రెస్ అకాడమీ అధ్యక్షుడు అల్లం నారాయణ సహచరి అల్లం పద్మ (55) కొంతకాలంగా మూత్రపిండాలకు సంబంధించిన అనారోగ్యంతో బాధపడుతూ, ఫిబ్రవరి 22న మరణించారు. కరీంనగర్ లో రాడికల్ విద్యార్థి సంఘం తొలితరం నాయకుడైన కనకయ్య సోదరిగా ఆమె 1980ల తొలినాళ్లకే ప్రగతిశీల భావాల ప్రభావం లోకి వచ్చారు. కొంతకాలం మీడియా సంస్థలలో ఉద్యోగం చేసినా, స్వయం ఉపాధి కోసం ప్రయత్నించినా, తెలంగాణ ఉద్యమ కాలంలో పోలీసు నిర్బంధంలో, హాస్టళ్ల మూసివేతలో ఇబ్బందులు పడుతున్న విద్యార్థులకు సహాయం అందించడానికి అమ్మల సంఘం ఏర్పాటు చేసి ఆమె చేసిన కృషి చిరస్మరణీయమైనది. వీ

# పేదలను విస్మరించిన కేంద్ర బడ్జెట్

*మామూలుగా అంకెల గారడీగా ఉండే బడ్జెట్, ఈ సంవత్సరం అదనంగా మాటల గారడీగా కూడా మారిపోయిందని విశ్లేషిస్తున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

కేంద్ర ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ ఫిబ్రవరి 1వ తేదీన పార్లమెంటులో ప్రవేశపెట్టిన 2022-23 వార్షిక బడ్జెట్ కార్పొరేట్, బడా బిజినెస్ హౌస్‌ల పట్ల ప్రభుత్వ విధేయతను మరోసారి చాలా బలంగా పునరుద్ఘాటించింది. అసాంతం కార్పొరేట్లకు మేలు చేసే అంశాలే తప్ప ప్రజాహిత పథకాలు వినిపించలేదు. మోడీ ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థ ఎవరివైపు మొగ్గు చూపిందో కూడా స్పష్టం చేసింది. చాలా దుందుడుకుగా కొనసాగుతున్న ప్రపంచీకరణ ఆర్థిక విధానాలపై ఆధారపడిన 'అమృత్ కాల్' లేదా రాబోయే 25 ఏళ్ల కాలానికి గాను నిర్దేశించిన పథకంలో సంపన్న వర్గాలకు మేలు చేసే విధానపరమైన మార్గదర్శకాలే బడ్జెట్ సారాంశంగా కనిపిస్తోంది.

కరోనా కారణంగా ప్రజల కొనుగోలు శక్తి, జీవన ప్రమాణాలు క్షీణిస్తున్న గడ్డు పరిస్థితులలో ప్రజావసరాలను గుర్తించకపోవడం ప్రజల ఆత్మస్థైర్యాన్ని దెబ్బతీయడం తప్ప మరొకటి కాదు. వ్యవసాయ రంగం సంక్షోభ ఘంటికలు మోగిస్తున్నా, ఒక పక్క ఆకాశాన్నంటుతున్న ధరలు, మరోపక్క తగ్గుతున్న ఆదాయాలు సామాన్యుని నడ్డి విరుస్తున్నా, మధ్యతరగతి కుంచించుకుపోతున్నా, నిరుద్యోగం విలయ తాండవం చేస్తున్నా, మోడీ సర్కార్‌కు చీమ కుట్టినట్లు కూడ లేదు. ప్రైవేటురంగ అభివృద్ధికి భారీ ఊతాన్ని ఇవ్వడం ప్రభుత్వ రంగాన్ని, సామాజిక సంక్షేమ రంగాలను పూర్తిగా నిర్లక్ష్యం చేయటం ఈ బడ్జెట్ ముఖ్య లక్షణం. మోడీ ప్రభుత్వ ప్రాధాన్యతలో కార్పొరేట్లు తప్ప ప్రజలు లేరని స్పష్టమవుతున్నది. అందువల్ల ఈ బడ్జెట్‌లో ప్రభుత్వ రాజకీయాలను పరిశీలించాలి, ఈ ప్రభుత్వం సేవ చేయాలనుకుంటుంది ఎవరికీ అనే విషయాన్ని అర్థం చేసుకోవాలి.

**2022-23 బడ్జెట్ సమగ్ర స్వరూపం :**

| వివరం రూ.కోట్లలో | 2021-22 (బ.అం) | 2021-22 (స.అం) | 2022-23 అంచనాలు |
|---|---|---|---|
| 1. రెవెన్యూ వసూళ్లు | 17,88,424 | 20,78,936 | 22,04,422 |
| ఎ) పన్ను ఆదాయం | 15,45,396 | 17,65,145 | 19,34,771 |
| బి) పన్నేతర ఆదాయం | 2,43,028 | 3,13,791 | 2,69,651 |
| 2. మూలధన వసూళ్లు | 16,94,812 | 16,91,064 | 17,40,487 |
| ఎ) రుణ వసూళ్లు | 13,000 | 21,975 | 14,291 |
| బి) ఇతర వసూళ్లు | 1,75,000 | 78,000 | 65,000 |
| సి) రుణాలు | 15,06,812 | 15,91,089 | 16,61,196 |
| 3. మొత్తం వసూళ్లు | 34,83,236 | 37,70,000 | **39,44,909** |
| 4) పథకాలకు వ్యయం | 29,29,000 | 31,67,289 | **31,94,663** |
| 5) పథకేతర వ్యయం | 5,54,236 | 6,02,711 | 7,50,246 |
| 6) మొత్తం వ్యయం | 34,83,236 | 37,70,000 | 39,44,909 |
| 7) రెవెన్యూ లోటు | 11,40,576 | 10,88,352 | 9,90,241 |
| 8) ద్రవ్య లోటు | 15,06,812 | 15,91,089 | 16,61,196 |

2022-23 సంవత్సరానికి బడ్జెట్ మొత్తం వ్యయాన్ని రు. 39,44,909 కోట్లుగా చూపింది. ఇది 2021-22 సంవత్సరపు బడ్జెట్ ప్రతిపాదనల కంటే 13 శాతం అధికం, సవరించిన అంచనాల కన్నా 4.6 శాతం ఎక్కువగా ఉంది. పెరిగిన బడ్జెట్ ప్రస్తుత ద్రవ్యోల్బణం రేట్ 6.9 కన్నా తక్కువ. అంటే వచ్చే ఏడాది వ్యయం నిజవిలువ ఈ యేడాది బడ్జెట్ కన్నా తక్కువగా ఉంటుందన్నది యథార్థం. అందువల్ల ప్రభుత్వం చెబుతున్న 8.5 శాతం వృద్ధిరేట్ సాధించడం కూడ అసాధ్యమే. నిజానికి ప్రభుత్వ వ్యయం పెరిగితేనే ప్రజల కొనుగోలు శక్తి పెరిగి వినియోగం పెరుగుతుంది. వినియోగం పెరిగితే మార్కెట్‌లో డిమాండు పెరిగి ఆర్థిక వ్యవస్థ పుంజుకుంటుంది. అయితే ప్రభుత్వ వ్యయాన్ని పెంచితే ద్రవ్యోల్బణం పెరుగుతుందని ప్రభుత్వం భావిస్తోంది. ప్రభుత్వానికి అసలు భయం ద్రవ్య పెట్టుబడి నుంచి ఉంది. అది ద్రవ్యలోటును అంగీకరించదు. నిజానికి 1929లో ఏర్పడిన మాంద్యం (1929-1941) ప్రభుత్వ వ్యయం పెరగడం ద్వారానే కుదుటబడింది.

ఇక ఈ బడ్జెట్‌లో చూపిన మొత్తం ఆదాయ వనరులు రు. 22,04,422 కోట్లు కాగా మూలధన వసూళ్లు రు. 17,40,487 కోట్లు చూపింది. రెవెన్యూ ఖర్చులకు రు. 31,94.633 కోట్లు కాగా మూలధన ఖర్చులకు రు. 7,50,246 కోట్లు. రెవెన్యూలోటు రు. 9,90,221 కోట్లు. ద్రవ్యలోటు రు. 16,61,196 కోట్లు. ద్రవ్యలోటు భర్తీ చేసుకోవడానికి 11 లక్షల కోట్లు రుణాల ద్వారా సేకరించనుంది. వ్యయ పద్దులో 20శాతం వడ్డీ చెల్లింపులకే పోతుంది. ద్రవ్యలోటు 6.4 శాతంగా మదింపు వేసింది. మోడీ అధికారం చేపట్టే నాటికి (2015 మార్చి) దేశం అప్పు రూ.62,42,220 కోట్లుకాగా 2022 మార్చి నాటికి రు. 1,35,86,975 కోట్లకు చేరింది. సమ్మిళిత అభివృద్ధికి ప్రభుత్వం కంకణబద్ధమైందంటూ ఊదరగొట్టినా బడ్జెట్ రూపకల్పనలో ఆ హామీలు దెబ్బతిన్నాయి. నిరుద్యోగులకు నిర్దిష్ట హామీ లేదు! మధ్యతరగతి ముచ్చట లేదు! ఇక పేదలు, అణగారిన వర్గాలు సహా సామాన్యుల సంబోధన అసలే లేదు! కరోనా కాలంలో కొలువులు కోల్పోయిన విద్యావంతుల ఊసే లేదు. ప్రధానంగా కీలక రంగాలు, సామాజిక భద్రతా పథకాల కేటాయింపులను బిగబట్టడమే విస్తు గొలుపుతోంది.

ప్రధాని గతిశక్తి యోజన, సమ్మిళిత అభివృద్ధి, అభివృద్ధి ఆధారిత పెట్టుబడులు, పరిశ్రమలకు ఆర్థిక ఊతం లక్ష్యంగా ఈసారి బడ్జెట్‌ను రూపొందించామని ఆర్థిక మంత్రి తన ప్రసంగంలో తెలిపారు. ప్రధాని గతిశక్తి దేశ ఆర్థిక వృద్ధిని సమూలంగా మారుస్తుందని, ప్రగతి రథాన్ని పరుగులు పెట్టించేందుకు ఏడు చోదకశక్తులను ఆర్థిక మంత్రి ప్రసంగంలో ప్రస్తావించారు. రహదారులు, రైల్వే, విమానాశ్రయాలు, ఓడ రేవులు, ప్రజా రవాణా, జల మార్గాలు, రవాణా మౌలిక సదుపాయాలు వీటిలో ప్రధానమైనవి. కానీ బడ్జెట్ కంటే ముందే 'నేషనల్ ఎసెట్ మానిటైజేషన్ పైప్‌లైన్' పథకం పేరుతో రాబోయే నాలుగు సంవత్సరాల కాలంలో ఆరు లక్షల కోట్ల ఆస్తులను లీజు రూపంలో కారు చౌకగా కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టేందుకు ప్రభుత్వం కార్యాచరణ పథకాన్ని రూపొందించింది.

వ్యవసాయ అనుబంధ రంగాలకు సంబంధించిన 27 పథకాలను 7 పథకాలలో విలీనం చేశారు. ప్రకృతి వ్యవసాయం గురించి స్వయంగా ప్రధాని మాట్లాడినా బడ్జెట్లో కేటాయింపులు లేవు! పాల ఉత్పత్తి సహకార సంఘాలకు ఇస్తున్న కొన్ని పథకాలను రద్దు చేశారు. రాబోయే మూడేళ్లలో 400 వందే భారత్ రైళ్లను, ఒక డిజిటల్ యూనివర్సిటీ, పాఠశాల విద్యార్థుల కోసం 'వన్ క్లాస్ - వన్ టివి' తీసుకు వస్తామని తెలిపారు. ఇప్పుడున్న 12 ఛానళ్లను 200 చానళ్లకు పెంచుతున్నామన్నారు. అలాగే పెట్టుబడుల ఉపసంహరణ అంచనాలను సవరించారు. వీటిని గమనిస్తే ఎల్ఐసి ప్రైవేటీకరణే కాక మరిన్ని సంస్థలలో ఐపివో ఉంటుందని అర్థమవుతున్నది. జాతీయ సంపద, వనరుల అమ్మకం (జాతీయ నగదీకరణ) మరింత వేగవంతం చేసే ఉద్దేశం కనపడింది.

ఈ బడ్జెట్లో ప్రభుత్వ రంగ సంస్థల వాటాల అమ్మకం ద్వారా రు. 65 వేల కోట్లు సమీకరించటం లక్ష్యంగా నిర్దేశించుకుంది. లాభాల్లో ఉన్న సంస్థల్లోనూ దీని అమలు వేగం పెరుగుతుందనే సంకేతాలు బడ్జెట్ ద్వారా వచ్చాయి. ఇది కేవలం ప్రభుత్వానికి ఆదాయం సమకూర్చడం కోసమేనని స్పష్టమవుతోంది. ఎల్ఐసి ఐపివోతో రు. 45 వేల కోట్ల నుంచి రు. లక్ష కోట్ల వరకు సమీకరించే అవకాశం ఉన్నట్టు అంచనాలున్నాయి. భారత్ పెట్రోలియం, షిప్పింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా ప్రైవేటీకరణ, రెండు ప్రభుత్వ రంగ బ్యాంకులు, ఒక ప్రభుత్వ బీమా కంపెనీ సంబంధించిన విక్రయాలు వేగవంతం కానున్నాయి.

ఇవాళ దేశంలో 10 శాతం మంది వ్యక్తుల వద్దే 57 శాతం సంపద పోగుపడి, 50 శాతం ప్రజల వద్ద 6 శాతం సంపద మాత్రమే ఉందంటే మోడీ ప్రభుత్వం ప్రవేశపెడుతున్న బడ్జెట్లు ఏ వర్గ ప్రయోజనాలను కాపాడుతున్నాయో సులభంగానే అర్థం చేసుకోవచ్చు. ప్రజల కష్టాలు రోజురోజుకూ పెరుగుతున్నాయి. మోడీ ప్రభుత్వ దృష్టి లోపం కారణంగా వాటిని గుర్తించలేకపోతున్నది. ఇలా గుర్తించలేకపోవడం వల్ల రాబోయే కాలంలో మరింత ప్రమాదకర పరిణామాలు సంభవించవచ్చు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు ఆదాయ అంతరాలను పెంచుతున్నాయని, ప్రైవేట్ వ్యక్తులు సంపన్నులవుతున్నారని, ఉపాధి రహిత వృద్ధి జరుగుతోందని పలు అంతర్జాతీయ నివేదికలు స్పష్టం చేశాయి. అయినా మోడీ ప్రభుత్వం ప్రజల ప్రాధాన్యతలను విస్మరించి, కార్పొరేట్ అనుకూల సంస్కరణలకు పెద్దపీట వేయడం శోచనీయం.

ప్రభుత్వం బడ్జెట్లో ప్రకటించిన ప్రధానమంత్రి గతిశక్తి పెద్ద ఎత్తున అవస్థాపన సౌకర్యాల (మౌలిక సదుపాయాల కల్పన) పేరిట ప్రభుత్వరంగ సంస్థలను వేగంగా ప్రైవేటీకరించడం, పెట్టుబడుల ఉపసంహరణ లాంటి నిర్ణయాలు కార్పొరేటు సంస్థలకు సంతోషం కలిగిస్తున్నాయి. డిజిటల్ కరెన్సీని ప్రవేశపెట్టడం కూడ ప్రైవేట్ కార్పొరేటు సంస్థల వ్యాపార లావాదేవీలకు అనుకూలమైనదే. ప్రాథమిక సదుపాయాల రంగానికి గత రెండేళ్లుగా ప్రభుత్వం ప్రాధాన్యతనిస్తోంది. మౌలిక సదుపాయాలంటే సంపన్న వర్గాలకు ఉపయోగపడే విమానాశ్రయాలు, ఓడరేవులు, విశాలమైన రోడ్లు నిర్మించడమే కాదు ప్రజల జీవితాలను మెరుగుపరిచే అందరికి విద్య, ఆరోగ్యం, గృహ వసతి, శుభ్రమైన పరిసరాలు, ఆహార భద్రత వంటి మౌలికాంశాలను మొదట ప్రభుత్వం చేపట్టాల్సి ఉంది. నిజానికి సంపన్నుల అనుకూల మౌలిక సదుపాయాల కంటే పేదల అనుకూల మౌలిక సదుపాయాల మెరుగుదలకు ప్రభుత్వం మరింతగా పెట్టుబడులు పెట్టాలి. అందుకు ప్రజలు సంఘటితపడి పాలకులపై ఒత్తిడి తేవాలి.

**వ్యవసాయ, అనుబంధ రంగాలకు నిధుల కోత :**

నరేంద్రమోడీ నేతృత్వంలోని కేంద్ర ప్రభుత్వం బడుగు బలహీన వర్గాలను పూర్తిగా విస్మరించింది. కరోనా రక్కసి విజృంభణతో వారు పడిన, పడుతున్న కష్టాలు ప్రభుత్వానికి లెక్కలో లేనివన్నట్లు వ్యవహరించింది. కన్నీళ్లు తుడవాల్సిన చేతులతో అరకొరగా ఉన్న సబ్సిడీలలో కోతలు పెట్టింది. ఎరువుల రాయితీలో 25 శాతం, ఆహార సబ్సిడీలో 28 శాతం, పెట్రోలియం సబ్సిడీలో 11 శాతం కోతలు విధించి ప్రజలపై మరింత భారం మోపింది. గత సంవత్సరపు సవరించిన అంచనాల కంటే ఈ సంవత్సరానికి సబ్సిడీలు 26.6 శాతం తగ్గించారు. భారత ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా వ్యవసాయం మీద, దాని అనుబంధ పారిశ్రామిక కార్యకలాపాలమీద ఆధారపడి ఉంది. వ్యవసాయ రంగం స్థూల విలువ 2020-21లో 20.2 శాతం ఉండగా, 2021-22 నాటికి 18.8 శాతానికి క్షీణించింది.

భారత ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయ రంగం కీలకమైంది. ఈ రంగం 58 శాతం మందికి ఉపాధి కల్పిస్తున్నది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ సజావుగా పనిచేయాలన్నా దేశానికి ఆహార భద్రత ఇవ్వాలన్నా, వ్యవసాయరంగంలో భారీగా పెట్టుబడులు పెట్టాల్సిన అవసరం ఉంది. కానీ అందుకు విరుద్ధంగా అత్యధిక గ్రామీణ జనాభాకు ఉపాధి కల్పిస్తున్న వ్యవసాయం, దాని అనుబంధ కార్యకలాపాలకు కేటాయింపులను అతి తక్కువగా చేశారు. కేంద్ర బడ్జెట్లో వ్యవసాయ, అనుబంధ రంగానికి 2021-22 సవరించిన అంచనాలలో 3.97 శాతం ఉండగా, 2022-23 సంవత్సరానికి 3.51 శాతానికి తగ్గించారు. అంటే 2021-22 బడ్జెట్లో సవరించిన కేటాయింపులు రు. 4,74,750 కోట్లు ఉండగా 2022-23 బడ్జెట్లో రు. 3,70,303 కోట్లకు కుదించారు. వ్యవసాయ రంగ మౌలిక సదుపాయాల కోసం 2020 మేలో ఆత్మనిర్భర్ భారత్లో భాగంగా 4 సంవత్సరాలలో లక్ష కోట్లు ఖర్చు చేస్తామని ఆర్భాటం చేసిన ప్రభుత్వం గడిచిన రెండేళ్లలో రు. 6,627 కోట్లు విడుదల చేసి రు. 2,654 కోట్లు మాత్రమే ఖర్చు చేసింది.

పెట్రో ఉత్పత్తుల ధరల ధాటికి దేశం అతలాకుతలమవుతుంటే 700 కోట్ల రూపాయల సబ్సిడీకి కోత పెట్టింది. కార్పొరేట్ పన్నుపై సర్చార్జ్ మాత్రం 12 శాతం నుంచి 7 శాతం తగ్గించింది. పెట్రోలియం, ఎరువులపై రాయితీ తగ్గింపు వల్ల సాగు ఖర్చులు పెరిగి రైతులకు మరింత భారంగా మారే ప్రమాదం ఉంది. రైతు సంఘాలు లేవనెత్తిన అనేక కీలక డిమాండ్లను రేఖా మాత్రంగా కూడ బడ్జెట్లో ప్రస్తావించలేదు. మొత్తంగా చూస్తే 2021-22లో సబ్సిడీలకు సవరించిన అంచనాల ప్రకారం రు. 7,07,707 కోట్లు ఉండగా 2022-23 సంవత్సరానికి రు. 4,33,108 కోట్లు కేటాయించారు. అది కూడ మరింత తగ్గి రు. 3,17,866 కోట్లకు పరిమితం కావచ్చని బడ్జెట్లో పేర్కొనడం విడ్డూరంగా ఉంది.

ఏడాది పాటు ఢిల్లీ సరిహద్దుల్లో ఆందోళన సాగించి 700 మందికి పైగా సహచరులను కోల్పోయిన దేశ రైతాంగం మీద కక్షతోనే ఈ బడ్జెట్లో వ్యవసాయానికి భారీ కోతలు పెట్టారని రైతు ఉద్యమ నాయకులు

భావిస్తున్నారు. 2022 నాటికి రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తామని 2016లో చేసిన వాగ్దానం ప్రస్తావన గానీ, ప్రధానమంత్రి ఫసల్ భీమా యోజన వంటి పథకాలపై అభిప్రాయ ప్రకటన గానీ బడ్జెట్‌లో లేకపోవడం శోచనీయం. మద్దతు ధరకు చట్టబద్ధత కల్పించడానికి ప్రభుత్వం ససేమిరా అంటోంది. ఉద్యమించిన రైతుల చేతుల్లో చవిచూసిన ఓటమిని జీర్ణించుకోలేక పోతున్నది. రైతుల ఒత్తిడి వల్ల ప్రభుత్వం తప్పని పరిస్థితుల్లో మూడు వ్యవసాయ చట్టాలను వెనక్కి తీసుకోవలసి వచ్చింది.దానికి ప్రతీకారంగానే గ్రామీణ ఆర్థిక వ్యవస్థను దెబ్బతీసే విధంగా ఈ బడ్జెట్‌లో ప్రతిస్పందించింది. ప్రజలకు ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వం ఈ విధమైన ద్వేషపూరిత ప్రతీకార చర్యలకు పాల్పడటం క్షంతవ్యం కాదు. కరోనా ఉధృతి ఉన్న సమయంలో దేశంలోని అన్ని రంగాలు చతికిలపడిపోగా వ్యవసాయరంగం మాత్రమే మంచి ఫలితాలతో దేశాన్ని ఆదుకుంది.

వ్యవసాయ రంగంలో డ్రోన్‌లను ప్రవేశపెట్టడమనే యోచన ఏ విధంగా రైతులకు ఉపయోగపడుతుందనేది కీలక ప్రశ్న. అందులోనూ అత్యధికంగా పేద, మధ్య తరగతి రైతులే ఎక్కువగా ఉన్న దేశంలో డ్రోన్లను ఉపయోగించి ఎరువులు, పురుగు మందులు చల్లుకొనే వారెందరుంటారు? అంతేకాదు, వ్యవసాయ రంగంలో డ్రోన్ల వినియోగం గ్రామీణ భారతంలో చెప్పనలవికాని విషాన్ని కుమ్మరిస్తుంది. పంటల మీద ఎరువులు, పురుగు మందులు ఇతర రసాయనాలు చల్లే పిచికారీ పనికి ఇప్పుడు వ్యవసాయ కార్మికులను వినియోగిస్తున్నారు. డ్రోన్‌ల ప్రవేశంతో వారి ఉపాధి తీవ్రంగా దెబ్బతింటుంది. కరోనా మహమ్మారి కారణంగా తీవ్రంగా నష్టపోయిన గ్రామీణ వ్యవసాయ కార్మికులు, పట్టణ కార్మికులు ప్రధానంగా దళితులు, ఇతర అణగారిన వర్గాలకు ఈ బడ్జెట్ వల్ల ఎలాంటి ఉపశమనం కలుగలేదు.

రైతులకు ఇచ్చే స్వల్పకాలిక రుణాల మీద వడ్డీ రాయితీ పోయిన ఏడాది రు. 19,468 కోట్లు కేటాయించగా అది ఇప్పుడు పూర్తిగా ఎత్తివేశారు! పంటల సేకరణను అన్ని పంటలకూ విస్తరించి, లబ్ధిదారుల సంఖ్యను పెంచాలనే రైతుల కోరికకు భిన్నంగా, పంటల సేకరణకు కేటాయించిన మొత్తాన్ని 2021-2022 బడ్జెట్‌లోని 2.48 లక్షల కోట్ల నుంచి ప్రస్తుతం 2.37 లక్షల కోట్లకు తగ్గించారు. పంటల సేకరణ తాలూకు లబ్ధిదారుల సంఖ్యను గతేడాదిలోని 1.97 కోట్ల నుంచి 1.63 కోట్లకు కుదించారు. ప్రకృతి వ్యవసాయం గురించి స్వయంగా ప్రధాని మాట్లాడినా బడ్జెట్లో కేటాయింపులు లేవు! సేంద్రియ, ప్రకృతి వ్యవసాయాన్ని ప్రోత్సహించడానికి ఉద్దేశించిన పరంపరాగత్ కృషి వికాస్ యోజనా (పికెవివై) కోసం 2021-22లో రు. 450 కోట్లు కేటాయించినప్పటికీ, కేవలం 100 కోట్లు మాత్రమే ఖర్చు చేశారు. అదే విధంగా రాష్ట్రీయ కృషి వికాస్ యోజన (ఆర్‌కెవివై) పథకానికి కూడా 2021-22లో రు. 3,712 కోట్లు కేటాయించినా సవరించిన అంచనా ప్రకారం అది రు. 2,000 కోట్లకు పడిపోయింది. అలాగే పాల ఉత్పత్తి సహకార సంఘాలకు ఇస్తున్న కొన్ని పథకాలను రద్దు చేశారు.

**సామాజిక సంక్షేమ రంగాలకు కోతలు :**

దేశంలో వినియోగదారుల డిమాండ్ పెరగకపోవటం వల్ల ప్రైవేట్ పెట్టుబడులు భారీగా ప్రవహించటం లేదు. అందుకే ప్రభుత్వం మూలధన పెట్టుబడులను ఈసారి గణనీయంగా పెంచింది. దీంతో దేశంలో ఉద్యోగాలు పెరిగిపోతాయని ఆశ చూపిస్తోంది. కానీ అదే సమయంలో సంక్షేమ రాజ్య భావనకు వ్యతిరేకంగా కేటాయింపులను దిగ్గోసింది. ఈ బడ్జెట్‌లో నిరుపేదలకిచ్చే ఆహార సబ్సిడీని 2.86 లక్షల కోట్ల నుండి 2.06 కోట్లకు తగ్గించింది. ప్రపంచ ఆకలి నివేదికలోని మొత్తం 116 దేశాలలో భారత్ 101 స్థానం అలంకరించి అలమటిస్తున్నది. పొరుగునున్న బంగ్లాదేశ్, నేపాల్, పాకిస్తాన్‌ల కంటే వెనుకబడి ఉంది. గ్రామీణాభివృద్ధికి గతయేడాది రు. 1,55,042 కోట్లు కేటాయించగా 2022-23 సంవత్సరానికి రు. 1,38,203 కోట్లు కేటాయించారు. అంటే గ్రామీణ అభివృద్ధికి సంబంధించిన బడ్జెట్ వాటా 5.59 శాతం నుండి 5.23 శాతానికి తగ్గించేశారు.

మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం కరోనా సమయంలో లక్షలాది మంది ప్రజలకు బాసటగా నిలిచింది. 2021 జూన్‌లో ఈ పథకం కింద 4.59 కోట్ల మంది ఉపాధి పొందారు. ఈ బడ్జెట్‌లో గ్రామీణ ఉపాధి పథకం కేటాయింపుల్లో కోత విధించటం మెరుగైన ఆర్థిక వ్యవస్థకు సంకేతం కాదు. పూర్తిగా ఉద్యోగాలు లేకుండా బాధపడుతున్న, పేదరికంతో బాధపడుతున్న కోట్లాదిమంది ప్రజలపట్ల, ఇది నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే చర్య, ఉపాధి హామీ పథకం కింద 2021-22లో సవరించిన అంచనాలు రు. 98,000 కోట్లు కాగా 2022-23 బడ్జెట్‌లో రు. 73,000 కోట్లకు తగ్గించారు. కార్పొరేట్లకు సేవ చేయటంలోనే ఈ ప్రభుత్వం అనుకూలతలు వెతుక్కుంటూ సంపదను సృష్టించే నిజమైన సృష్టికర్తలైన కార్మిక, కర్షక, శ్రామిక వర్గాన్ని సున్నితంగా పక్కకు నెట్టేస్తున్నది. సంపన్నుల హృదయాలు గాయపడకుండా చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తోంది. ప్రభుత్వానికి, బిజెపికి అవసరాలు తీర్చే పెట్టుబడిదారీ స్నేహితుల పట్ల చాలా గౌరవంగా వ్యవహరిస్తోంది. దేశంలో సంపదను పునఃపంపిణీ చేసే ఆలోచన, అలాంటి విధానం కనుచూపు మేరలో ఎక్కడా కనిపించటం లేదు.

విద్యా రంగానికి కేటాయింపులు గతేడాది సవరించిన అంచనాల కన్నా 18.5 శాతం అధికంగా పెంచామని చెపుతున్నారు నిజమే. అయితే, అందులో అధిక భాగం డిజిటల్ చదువుల కోసం కేటాయించారు. అంతేగాక, జిడిపితో పోల్చితే గతేడాది ఎంత శాతం విద్య కోసం కేటాయించారో, ఈ ఏడాది అంతే శాతం, అంటే 3.1 శాతం మాత్రమే కేటాయించారు. గత రెండేళ్లుగా పిల్లల చదువులు పూర్తిగా దెబ్బతిన్నాయి. 2018లో 6-14 మధ్య వయసు గల 2.5 శాతం పిల్లలు ఏ పాఠశాలలోనూ చేరకుండా ఉండిపోతే వారి సంఖ్య 2022 నాటికి 4.6 శాతానికి పెరిగిందని వార్షిక విద్యానివేదిక వెల్లడించింది. ఈ నేపథ్యంలో విద్యారంగానికి బడ్జెట్ కోత ఈ ప్రభుత్వ ఘనకార్యం. ఇది విద్యాహక్కుని ధ్వంసం చేయటమే. బిజెపి హయాంలో దేశ భవిష్యత్తు ఏ మాత్రం ఉజ్వలంగా కనిపించటం లేదు. రాజకీయ ప్రయోజనాలు పొందడం కోసం ప్రధానమంత్రి నరేంద్ర మోడీ అన్ని మాయోపాయాలు ఉపయోగించారు. కానీ సామాజిక న్యాయం ఆయన ప్రభుత్వ లక్షణాల్లో ఎక్కడా లేదు.

దేశంలో విద్యారంగాన్ని ఉద్ధరించకపోగా ప్రభుత్వం ఎలాంటి పర్యవేక్షణ లేకుండా విదేశీ విశ్వవిద్యాలయాలను దేశంలో క్యాంపస్‌లు తెరవాలని భావిస్తోంది. ఈ యూనివర్సిటీ వల్ల సంపన్నులు, అతి సంపన్నులకే మేలు

కలుగుతుంది. ఈ విధంగా కార్పొరేట్ అనుకూల ఎజెండాను బడ్జెట్‌లో ప్రభుత్వం అమలు చేసింది. అట్టడుగు వర్గాలకు కేటాయింపులు పెంచలేదు. సామాజిక న్యాయం, దివ్యాంగులు, సాధికారత శాఖ, మహిళా శిశు అభివృద్ధి, మైనారిటీ వ్యవహారాలు, ఎస్‌సి, ట్రైబల్ విభాగాలకు కేటాయింపులు చాలా హీనంగా ఉన్నాయి. నీతి ఆయోగ్ ఏదో దయతలచినట్టు ప్రవర్తిస్తోంది. అట్టడుగు వర్గాల వారు రాజ్యాంగం ప్రకారం గౌరవంగా జీవించే హక్కులేకుండా చేశారు. ఆర్థికమంత్రి 60 లక్షల ఉద్యోగాలు ఇస్తామని, 80 లక్షల గృహాలు నిర్మిస్తామని హామీ ఇచ్చారు. ఈ గంభీర వాగ్దానాలన్నీ వైఫల్యాలే. ఈ ప్రభుత్వం చెప్పింది చేయదు. అన్ని వర్గాలకు ప్రభుత్వం ద్రోహం చేసింది.

ప్రజా ఆరోగ్యంలో కేంద్రం మళ్లీ కొత్త కొత్త పదాలతో పథకాలు ప్రారంభించింది. నేషనల్ డిజిటల్ హెల్త్ మిషన్‌కు రు. 15,163 కోట్లు కేటాయించింది. గతంలో ప్రకటించిన 1.5 లక్షల హెల్త్ వెల్‌నెస్ కేంద్రాల ఏర్పాటు ఎంతవరకు వచ్చిందో కేంద్రం చెప్పటం లేదు. ప్రైమరీ, సెకండరీ స్థాయిలో ఆరోగ్య సేవలను ఇది ఎంతవరకు భర్తీ చేస్తామన్నది చెప్పలేదు. దీనిపై ఆరోగ్య నిపుణుడు డాక్టర్ కె. శ్రీనాథ్ రెడ్డి మాట్లాడుతూ, 'దేశవ్యాప్తంగా ప్రజా ఆరోగ్య వ్యవస్థలో ఆరోగ్య సిబ్బంది కొరత తీవ్ర స్థాయిలో ఉంది. దీనిని పరిష్కరించకుండా డిజిటల్ హెల్త్ మిషన్ లక్ష్యం నెరవేరదు. ప్రాథమిక ఆరోగ్య రంగం అత్యంత కీలకమైంది. నాణ్యమైన ఆరోగ్య సేవలు అందరికీ సమానంగా అందజేయాలంటే ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలే కీలకం. అయితే బడ్జెట్‌లో దీనికి ప్రాధాన్యత ఇవ్వలేదు' అని చెప్పారు. కరోనా కాలంలో దేశంలో ప్రజారోగ్య మౌలిక సదుపాయాలు దెబ్బతిన్నాయి. అసమానతలు భరించలేని స్థితికి చేరాయి. ప్రైవేటు ఆరోగ్య రంగం జవాబుదారీ లేకుండా వ్యవహరించింది. దానిపై ఆధారపడటం మూర్ఖత్వం అనే విషయం తెలుసుకొని కరోనా సమయంలో కూడ వైద్యానికి నిధులు పెంచలేదు. మౌలిక వసతుల కల్పన పూర్తిగా విస్మరించింది. ప్రజా ఆరోగ్యాన్ని పూర్తిగా ప్రైవేట్ చేతుల్లోకి నెట్టేసింది. ప్రస్తుత సంవత్సరపు కేటాయింపుల కన్న కేవలం రు. 200 కోట్లు పెంచుతూ ఈసారి ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం కోసం రు. 85,200 కోట్లు కేటాయించింది. కరోనా మూడో తరంగం సమయంలో కూడా ప్రభుత్వం ప్రజారోగ్య వ్యవస్థను చక్కదిద్దే విషయంలో గుణపాఠాలు నేర్చుకోవడానికి నిరాకరిస్తోంది.

మనదేశంలో మహిళలు, చిన్నారుల్లో పోషకాహార లోపం తీవ్రస్థాయిలో ఉందని అనేక అధ్యయనాలు చెబుతున్నాయి. కేంద్రం చెబుతున్న లెక్క ప్రకారమే, మార్చి 2016-2021 మధ్యకాలంలో అంగన్‌వాడీల ద్వారా పోషకాహారం అందుకుంటున్న లబ్ధిదారుల సంఖ్య 8.29 కోట్ల నుంచి 6.75 కోట్లకు తగ్గింది. పాఠశాల విద్య పొందుతున్న మూడు నుంచి ఆరేండ్ల వయస్సున్న చిన్నారుల సంఖ్య 3.4 కోట్ల నుంచి 2.3 కోట్లకు తగ్గింది. పరిస్థితి ఓ వైపు ఇలా ఉంటే, మధ్యాహ్న భోజనం పథకానికి బడ్జెట్‌లో రు. 1267 కోట్లు కోత పెట్టారు. పోషకాహారం, శిశు సంక్షేమానికి సంబంధించి పథకాల పేర్లన్నీ మార్చేస్తోంది. మళ్లీ పాతవాటినే కలగలిపి కొత్త పథకాలు తీసుకొస్తోంది. దాంతో ప్రభుత్వ వ్యయం ఏ రంగానికి ఏ మేరకు ఉందన్నది తెలుసుకోకుండా పాలకులు జిమ్మిక్కులు చేస్తున్నారు.

**ముగింపు :**

ప్రపంచ ఆర్థిక వేదికపై ఇటీవల వెల్లడించిన ఆక్స్‌ఫామ్ అంతర్జాతీయ నివేదిక భారతదేశంలో పెరుగుతున్న అసమానతలను తేటతెల్లం చేసింది. 2020లో 102 మందిగా ఉన్న భారతదేశ సంపన్నుల సంఖ్య 2021లో 142కు చేరుకున్నది. కరోనా ఆవరించుకున్న ఘోరమైన పరిస్థితుల సమయంలో ఈ సంపన్నులు భారత్‌లో సంపద పోగు చేసుకున్నారు. వారి సంఖ్య గణనీయంగా పెరిగింది. అదే సమయంలో దేశంలో 50 శాతం అట్టడుగువర్గ ప్రజల సంపద కేవలం 6 శాతంగా మాత్రమే ఉంది. అతి సంపన్నులు, సంపన్నులపై పన్ను విధించి పేదల కడగండ్లు తీర్చాలని కూడా నివేదిక సలహా ఇచ్చింది. ఇలా చేయటం వల్ల కొంత ఉపశమనం కలుగుతుందని తెలిపింది.

నిజానికి బడ్జెట్ ఒక సామాజిక ప్రయోజనం కలిగి ఉండాలి. వర్తమానంలో ఉన్న ఆర్థిక అంతరాలను నిర్మూలించే సాధనం కావాలి. దేశసంపదను, వనరులను, ఉత్పత్తి సాధనాలను కేంద్రీకృతం కాకుండా కాపాడుతూ, విస్తృత ప్రజా ప్రయోజనాలకు వినియోగించాలని రాజ్యాంగం స్పష్టంగా నిర్దేశించింది. అయితే వర్గదృక్పథం గల పాలకులు సంపదను, ఉత్పత్తి సాధనాలను, సహజ వనరులను క్రమేణా ప్రజల సమిష్టి యాజమాన్యం నుండి వ్యక్తుల చేతుల్లోకి జారిపోయేలా విధానాలు రూపొందించి అమలు చేస్తున్నారు. మోడీ ప్రభుత్వం మరింత దూకుడుగా కార్పొరేట్ల కోసమే బడ్జెట్ అన్నట్లుగా బరితెగించింది. సామాజిక సంక్షేమాన్ని పూర్తిగా గాలికొదిలేసింది. దేశ ఆర్థిక వ్యవస్థకు, స్వావలంబనకు వెన్నెముకగా నిలిచిన ప్రభుత్వ రంగ ఆర్థిక సంస్థలను కార్పొరేట్లకు కారుచౌకగా అప్పగించడానికి సిద్ధపడింది.

బడ్జెట్ గణాంకాలు స్పష్టం చేస్తున్న వాస్తవాలు గమనిస్తే మోడీ సర్కార్ మాటలకు చేతలకు పొంతన లేదని విదితమవుతుంది. ఒక పక్క డిజిటల్ ఇండియా భజన చేస్తూ మరోపక్క 5-జి సేవలను ప్రైవేట్ టెలికాం సంస్థల ద్వారా ప్రజలకు అందించబోతున్నామని ఆర్థిక మంత్రి స్పష్టంగానే ప్రకటించింది. అస్మదీయ కార్పొరేట్ సంస్థల పట్ల అపార ప్రేమ, ప్రభుత్వ రంగ సంస్థలపై సవతి తల్లి ప్రేమ దేశ ప్రజలకు అర్థం కాదన్న నమ్మకం కాబోలు అన్ని రంగాలకు గతం కంటే తగ్గించారు. అధ్వాన్న ఆర్థిక నిర్వహణ దుష్ఫలితాలు కొట్టొచ్చినట్లుగా కళ్లముందు కనిపిస్తుంటే 'అమృత్ కాల్' అనే కొత్త పాట ఎవరికి సాంత్వననిస్తుంది? ఏతా వాతా 2022-23 బడ్జెట్ గణాంకాల గారడీ నుంచి దిగజారి మాటల గారడీగా మారింది. అతిశయోక్తులు, అర్భాటపు ప్రకటనలలో, తెంపరితనంతో సాగింది. 'అరచేతిలో వైకుంఠం, భవిష్యత్తులో అమృతకాలం' అంటూ ప్రజలను ఏమార్చే ప్రయత్నం చేసినా, వాస్తవాలను మరుగునపర్చడం సాధ్యం కాలేదు. కనుకనే బడ్జెట్ పట్ల అన్ని వర్గాల ప్రజలు నిరసనలు తెలియజేస్తున్నారు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)*

# అంకెల గారడీలో అభివృద్ధి భారతం

*విద్యా, ఆరోగ్య, సంక్షేమ రంగాల కేటాయింపులు తగ్గించడం, కార్పొరేట్ల రాయితీలు పెంచడం వంటి చర్యల ద్వారా బడ్జెట్ ఏ దిశలో ఉందో చర్చిస్తున్నారు* **డా. ఎ. పున్నయ్య**

సామ్రాజ్య వలసవాద బ్రిటిష్ పాలనాకాలంలో ఈదేశ సహజవనరుల, ఉత్పత్తివర్గాల శ్రమదోపిడి యథేచ్ఛగా కొనసాగింది. అనేక పోరాటాల అనంతరం అధికారమార్పిడి జరిగి ఏర్పడిన భారత పాలకవర్గాలు సైతం గత ఏడున్నర దశాబ్దాలుగా బ్రిటిష్ వలసవాద విధానాలనే కొనసాగిస్తున్నారు. ఈ దేశ సహజ వనరులను కొల్లగొట్టడానికి, రెక్కలు ముక్కలు చేసుకుంటున్న శ్రామిక వర్గాల చెమటతో పోగుబడుతున్న సంపద దోపిడీకి, సంపన్నవర్గాలకు పాలకులు కొమ్ముకాస్తునే ఉన్నారు. ఉత్పత్తివర్గాల, శ్రామికుల, వివిధ వనరుల మార్గాల ద్వారా సమకూరుతున్న ఈ దేశ సంపద దేశంలోని అన్ని ప్రాంతాలకు అన్నివర్గాలకు సమంగా పంచి సంతులిత అభివృద్ధి లక్ష్యంగా మార్గం వేయాల్సిన పాలకవర్గాలు ప్రారంభ దశాబ్దంలో కొంత ప్రయత్నించినా అనంతర కాలంలో ప్రణాళిక బద్ధ విధ్వంసానికి ఉపిరిపోయడం ప్రారంభించారు. ప్రజల మౌలిక అవసరాలకు, జీవనోపాధికి వారి జీవన ప్రమాణాల పెరుగుదలకు క్రమంగా వినియోగించాల్సిన ఆదాయం పిడికెడు మంది కార్పొరేట్ల చేతిలో కేంద్రీకృతమయ్యేలా వ్యవహరించడం కావాలని జరిగిన పరిణామమే. తమ అధికారపీఠం పదిలపర్చుకోవడానికి తమదికాని దేశసంపదను కార్పొరేట్ల గేట్లముందు కుమ్మరించే విధానాలను అమలుచేస్తూ వారిముందు మోకరిల్లడం పరిపాటిగా మారింది. ఈ నేపథ్యంలో దశాబ్దాలుగా పాలకులు కార్పొరేటుశక్తుల అనుకూల విధానాల రూపకల్పనకు నిస్సిగ్గుగా వ్యవహరిస్తున్నారు. ప్రజలు తమ నెత్తురు చెమటతో కూడగట్టుకున్న ఆస్తులన్నీ బూర్జువా పెట్టుబడిదారుల పాదాక్రాంతం చేయడానికి, వారికి దోచిపెట్టడానికి కావల్సిన ఆర్థిక ప్రణాళికలు రచిస్తున్నారు. ఫలితంగా పాలకులు పేదల పొట్టగొట్టి పెద్దలకు పంచుతూ దేశ మౌలిక సమస్యలు పరిష్కరించడంలో విఫలమైనారు. పాలకవర్గాల విధానాలవల్ల ప్రతిపాదిత బడ్జెట్ ఈ నాటికీ లక్ష్య సాధనకు ఇంకా కుంటుతూనే ఉన్నాయి. ఫలితంగా వలస పాలనలో ఉన్న సమస్యలు తగ్గకపోగా అవి మరింత జటిలమైనాయి.

**బడ్జెట్ లక్ష్యం:**

ఈ దేశంలో పార్లమెంట్ అనుమతి లేనిదే నయాపైసా వసూలు చేయడానికి, ఖర్చుపెట్టడానికి ప్రభుత్వాలకు అధికారంలేదని రాజ్యాంగంలోని 112 అధికరణ చెబుతుంది. పాలకులు ప్రతి యేటా ఆర్థిక వనరులను సమీకరించుకొని, ఆర్థిక సవాళ్లను పరిష్కరించు కోవటానికి రాబడులను, ఖర్చులను హేతుబద్ధంగా లెక్క గట్టి పార్లమెంట్ నుండి అనుమతి పొందే ప్రక్రియ బడ్జెట్ పేరుతో కొనసాగుతుంది. దీనికోసం ఒక తంతుగానైనా కేంద్ర కార్యనిర్వహణ శాఖ రాబోయే సంవత్సరంలో చేసే వ్యయాన్ని, పన్నులు, వడ్డీలు, రుణాలు, తదితర వనరుల ద్వారా పొందే ఆదాయాన్ని కచ్చితంగా పార్లమెంట్ అనుమతి పొందాలి. ఆర్థికాభివృద్ధితో పాటు సమాజంలో వ్యవస్థీకృతమైన అసమానతల పునాదులను కూకటివేళ్లతో తొలగించడమే బడ్జెట్ విశాలమైన లక్ష్యం. అధిక ఆదాయ వర్గాల నుంచి పన్నుల రూపంలో వసూలు చేసి పేద వర్గాల జీవనోపాధికి, వారి అభివృద్ధికి అవకాశాలు సృష్టించాలి. వచ్చిన ఆదాయాన్ని మౌలిక వసతుల కల్పనకు ఖర్చుపెట్టడం, ఫలితంగా ఆర్థికాభివృద్ధితో పాటు వ్యక్తుల మధ్య ఆర్థిక అంతరాలు తగ్గించి సమసమాజ స్థాపనకు దారులు వేయడం బడ్జెట్ లక్ష్యం. ఈ దేశ బడ్జెట్ సమాఖ్య వ్యవస్థ స్ఫూర్తికనుగుణంగా రాష్ట్రాల సమగ్రాభివృద్ధికి అడుగులు వేయాలి. ప్రాంతాల మధ్య అసమానతలు రూపుమాపడానికి బడ్జెట్ దోహదకారియై స్థూలంగా ప్రజలందరి సర్వతోముఖాభివృద్ధికి కృషిచేయాలి.

**బడ్జెట్ లక్ష్యంలో మారిన ప్రాధాన్యతలు:**

వలస పాలన తర్వాత అధికారంలోకి వచ్చిన పాలకులు బడ్జెట్‌లో కేటాయించకుండా పైసా కూడా ఖర్చు చేసేవారు కాదు. రాజ్యాంగ లక్ష్యాలకు అనుగుణంగా రాజకీయపార్టీలు తమ మ్యానిఫెస్టోను అమలుపరచడానికి బడ్జెట్ తీర్మానంలోని అంశాలు ఆ ఆర్థిక సంవత్సరమంతా పాటించేవారు. అత్యవసరమైతే కొన్ని పద్దులు బడ్జెట్ కేటాయింపుకు 10 శాతం మేరకు సవరింపుతో వాస్తవ ఖర్చులుండేవి. పార్లమెంటు ఆమోదం తర్వాత బడ్జెట్ చట్టంలోని రాయితీలు, పన్నులు, సెస్‌లు ఆ సంవత్సరమంతా అమల్లో ఉండేవి. నూతన ఆర్థిక సంస్కరణల అనంతరం బడ్జెట్ ప్రక్రియలో అనేక మార్పుల జరిగాయి. 1991 ఆర్థిక సంస్కరణల అనంతరం ఆర్థిక అసమానతలు బాగా పెరిగినాయి. ఈ ఆర్థిక సంస్కరణలు ఆదాయ అంతరాలను పెంచుతూ, సంపద కేంద్రీకరణకు దారి తీశాయి. ప్రభుత్వాల చర్యల ఫలితంగా సామాన్యులు పేదరికంలోకి నెట్టబడగా, కార్పొరేట్ శక్తులు, సంపన్న వర్గాలు సంపదను ఇబ్బడిముబ్బడిగా పోగుచేసుకున్నాయి. ఇటీవలి ప్రభుత్వాలు బడ్జెట్ ఆమోదంతో ప్రమేయం లేకుండానే వేల కోట్ల రూపాయల పథకాలు ప్రకటిస్తున్నారు. నేడు బడ్జెట్ తీర్మానాలకు ఆర్థిక వ్యవస్థలో కొనసాగే కార్యకలాపాలకు

పొంతనలేకపోవడం బడ్జెట్ స్ఫూర్తికి విఘాతం కలిగింది. బడ్జెట్ ప్రక్రియలో వచ్చిన ఈ మార్పు సామాన్యులకు నష్టం కాగా కార్పొరేటు దిగ్గజాలను అగ్రభాగాన నిలబెట్టింది. ఇప్పుడు బడ్జెట్ వార్తా పత్రికల విశ్లేషణలకు, టి.వి. ఛానల్స్‌లో చర్చలకు మాత్రం పరిమితమైంది.

**కార్పొరేట్ల అభివృద్ధి లక్ష్యంగా ప్రభుత్వ ప్రతిపాదనలు:**

2022-2023 సంవత్సరానికి కేంద్ర ఆర్థిక శాఖ మంత్రి నిర్మల సీతారామన్ ప్రవేశపెట్టిన బడ్జెట్ విలువ రు. 39.45 లక్షల కోట్లు. వనరుల సమీకరణలో గత ఆర్థిక సంవత్సరం నిర్దేశిత లక్ష్యాన్ని చేరుకోవడంలో విఫలమైన పాలకులు బడ్జెట్లో పెరుగుదలను చూపిస్తూ ఈ సంవత్సరం గతంకంటే 8.5 శాతం అధికంగా కేటాయించారు. ఈ కేటాయింపులో కూడా సామాన్య ప్రజల ప్రాధాన్యతలను విస్మరించి, కార్పొరేట్లకు రెడ్ కార్పెట్ పరిచారు. ఈ ఏడాది ద్రవ్యలోటు 6.9 శాతంగా ఉంటుందని, 2023లో ద్రవ్యలోటు 6.4గా ఉండనుందని చెబుతూ విచిత్రంగా మరో మూడేళ్లలో ద్రవ్యలోటును 4.9 శాతానికి తగ్గిచేందుకు అంచనా వేశారు. గత రెండు సంవత్సరాలుగా కరోనా నేపథ్యంలో సంక్షోభంలో ఉన్న ఆర్థిక వ్యవస్థను గట్టెకించలేకపోయిన ప్రభుత్వం ఒక వైపు ద్రవ్యలోటును భారీగా చూపిస్తూ మరొక వైపు ద్రవ్య సమీకరణకు అప్పులను ఆదాయమార్గంగా ఎంచుకొని ద్రవ్యలోటును ఇదమిద్ధమైన కాలానికి తగ్గిస్తామని చెప్పకుండా తన దగ్గర అల్లావుద్దీన్ అద్భుత దీపం ఏదో ఉన్నట్లు రాబోయే మూడేళ్లలో ద్రవ్యలోటును 4.9 శాతానికి తగ్గిస్తామనడం ప్రహసన మవుతుంది. ద్రవ్యలోటుపై స్పష్టతలేని ప్రభుత్వం వాస్తవాలకు దూరంగా మాటలతో కోటలు కట్టాలని చూస్తోంది. ప్రభుత్వ ఆర్థిక సలహాదారు వాస్తవ వృద్ధిరేటు 8 శాతం ఉంటుందని పేర్కొన్నప్పటికీ స్థూల దేశీయోత్పత్తి నామమాత్ర వృద్ధిరేటు 11.1 శాతంగా ఉండగలదని ప్రభుత్వం అంచనా వేసింది. నిత్యావసరాల ధరలు ఆకాశాన్ని దాటి అంతరిక్షం తాకుతుంటే ద్రవ్యోల్బణం 3 శాతం నియంత్రించడం సాధ్యమౌతుందా? ప్రభుత్వానికి వివిధ ఆదాయ మార్గాల ద్వారా సుమారు రు. 22.84 లక్షల కోట్ల మేర ఆదాయం వస్తుందని అంచనా వేశారు. ప్రతిపాదిత బడ్జెట్‌కి, ప్రభుత్వం ఎంచుకున్న వివిధ మార్గాల ద్వారా వచ్చే ఆదాయ అంచనాకి, రు. 16.64 లక్షల కోట్ల ఆర్థికలోటు వ్యత్యాసాన్ని గమనిస్తే ప్రభుత్వం అంచనా వేసిన బడ్జెట్ డొల్లతనం బయటపడుతుంది.

**ప్రజల కొనుగోలు శక్తి పెంచే చర్యలు లేవు:**

దేశ ప్రజల జీవనప్రమాణాల పెరుగుదలతో కూడినదే నిజమైన ఆర్థికాభివృద్ధి. కరోనా కారణంగా ప్రస్తుత తరుణంలో కొనుగోలు శక్తి తగ్గడంతో ప్రజల జీవన ప్రమాణ స్థాయి భారీగా క్షీణించింది. దీనికోసం ప్రజల కొనుగోలు శక్తి పెంచే చర్యలు చేపట్టాల్సిన ప్రభుత్వం దీనికి భిన్నంగా బడ్జెట్లో కోతలు పెట్టింది. పేదలకు ప్రధానమైన ఉపాధి హామీకి 25 వేల కోట్లు, మధ్యాహ్న భోజన పథకానికి రు. 1,269 కోట్లు తగ్గించారు. ఎరువుల రాయితీలో 25 శాతం, ఆహార సబ్సిడీలో 28 శాతం, పెట్రోలియం సబ్సిడీలో 11 శాతం కోతల వాతలు పెట్టారు. తద్వారా ప్రజలపై మరింత భారం మోపి కొనుగోలు శక్తిని హరించారు. టోకు ధరల సూచి ప్రకారం ప్రైస్ ఇండెక్స్ 13.56 శాతం, వినియోగ ధరల సూచి ప్రకారం 5.6 ఉన్న ద్రవ్యోల్బణం స్థాయిని భవిష్యత్తులో 2.6 స్థాయికి కట్టడిచేయడం ఆచరణ సాధ్యం కాని అంశం. నిత్యావసర వస్తువుల ధరల నియంత్రణకు, పెట్రోల్, డీజిల్, గ్యాస్ ధరల భారాలు తగ్గించడానికి, ధరల స్థిరీకరణ నిధి ఏర్పాటు వంటి కనీస ప్రత్యామ్నాయాలకు బడ్జెట్లో స్థానమేలేదు. పేదల పలుకే లేకుండా, మధ్యతరగతి మాటే రాకుండా, రాబోయే 25 సంవత్సరాలకు జరిగే ఆర్థికాభివృద్ధికి ఈ బడ్జెట్ పునాది వేస్తుందని ఆర్థిక మంత్రి పేర్కొనటం నేలవిడిచి సాము చేయడమే.

**విద్యా రంగాన్నీ విస్మరించిన బడ్జెట్:**

ప్రభుత్వం హెల్త్ అండ్ ఎడ్యుకేషన్ సెస్ పేరుతో వేల కోట్ల రూపాయలు ప్రతి సంవత్సరం ప్రజల నుంచి ముక్కు పిండి వసూలు చేస్తోంది. ప్రభుత్వ పన్ను ఆదాయాలు ఈ పద్దుకు ఏటికేడాది పెరుగుతూనే ఉన్నాయి. అయితే విద్యార్థుల అభ్యున్నతికై కేటాయింపులు మాత్రం ఆ మేరకి పెరగకపోవడం బాధాకరం. 1964లో కొఠారి సూచనలు మొదలుకొని నేటి నూతన జాతీయ విద్యా విధానం 2020లో పేర్కొన్నట్లు విద్యారంగానికి దేశ జీ.డీ.పీ.లో కనీసం 6 శాతం నిధులను కేటాయించాలి. అత్యంత ఆర్భాటంగా నూతన జాతీయ విద్యా విధానాన్ని ముందుకు తీసుకొస్తున్న ప్రభుత్వం దానికి భిన్నంగా కేవలం 2.25 శాతం కేటాయించింది. కరోనా మహమ్మారి కారణంగా గత రెండు సంవత్సరాలుగా విద్యావ్యవస్థ కోలుకోలేనంత దెబ్బతిన్నది. గ్రామీణ మారుమూల ప్రాంత విద్యార్థులు పాఠశాలకు దూరమయ్యారు. ఈ బడ్జెట్‌లో ప్రతి తరగతికి ఒక టీవీ ఛానెల్ ద్వారా పాఠాలు, ప్రాంతీయ భాషల్లో పాఠాలు, ప్రస్తుతం 12 విద్యా టీవీ ఛానెల్స్ ఉండగా వీటిని 200కి పెంచినారు. డిజిటల్ విధానంలో గణనీయమైన మార్పులుంటాయని ప్రకటించారు. కానీ ఇవి క్షేత్ర స్థాయిలో ఫలితాలు ఇవ్వవు. మారుమూల భారతంలో ఇంకా సరైన సిగ్నల్ వ్యవస్థకే దిక్కులేనప్పుడు డిజిటల్ విధానం, ఛానెల్స్ పెంపు ఏ విధంగా విద్యారంగ సమస్యలకు పరిష్కారం చూపుతుందో ప్రభుత్వానికి తెలియాలి. ముందుగా పాఠశాలల్లో మౌలిక వసతులు, టీచర్లు, తరగతి గదులు, మంచి నీళ్లు, మరుగుదొడ్లు, ఆటస్థలాలు, గ్రంథాలయాలు సమకూర్చాలి. ఇవేమి అందుబాటులోకి లేకుండా ప్రభుత్వం ప్రతిపాదిస్తున్న నూతన జాతీయ విద్యా విధానాన్ని ఎలా ముందుకు తీసుకువెళ్లనుందో అందుకు కావాల్సిన మార్గాన్వేషణ నిధుల కేటాయింపుపై స్పష్టత లేదు. మొత్తం మీద ప్రస్తుతం విద్యా రంగానికి కేటాయించిన బడ్జెట్ ఆశించిన మొత్తంలో లేకపోవడం విచారకరం. ప్రభుత్వం ఒకవైపు ప్రైవేటు విద్యారంగానికి విదేశీ దారులు తెరిచి, స్వదేశంలో కార్పొరేటు విద్యకు చేయూతనిస్తూ మరొక వైపు ప్రభుత్వ విద్యారంగాన్ని తీర్చి దిద్దుతామని చెబుతున్న డొల్లమాటలను ఇప్పటికైనా పక్కకు పెట్టి కనీసం సామాజిక అభివృద్ధి సాధనలో విద్యారంగానికి మౌలిక సదుపాయాలు పెంపొందించ వలసిన అవసరం ఉన్నది.

**రైతుల ఆదాయం రెట్టింపు మాటే లేదు:**

దేశానికి వెన్నెముక రైతేనని రైతును రాజుగా చేయడమే ఈ ప్రభుత్వ లక్ష్యం అని విచిత్రంగా 2016 - 17 ఆర్థిక సంవత్సరం మొదలు వరుసగా ఆరు బడ్జెట్ ప్రసంగాలలో 2022 కల్లా రైతుల ఆదాయాలను రెట్టింపు చేస్తామని ఊదరకొడుతూ వచ్చింది. ఇచ్చిన హామీని మరిచి తీరా ఈ బడ్జెట్‌లో రైతుల ఆదాయం రెట్టింపు గురించి కనీసం మాట్లాడక పోవడం రైతులపట్ల ఈ ప్రభుత్వానికి ఉన్న నిజాయితీని బయటపెట్టుకుంది. స్వామినాథన్ కమిటీ సిఫార్సుల అమలుకు కనీస ప్రయత్నం కానరాలేదు. మారుతున్న కాలంలో వ్యవసాయ రంగానికి డిజిటల్ ప్రాముఖ్యత గురించి గొప్పగా చెప్పిన పాలకులు 2016 బడ్జెట్ ప్రసంగంలోనే పేర్కొన్నట్లు దేశంలోని సమస్త (సుమారు 22,000) వ్యవసాయ మార్కెట్ యార్డులని ఎలక్ట్రానిక్ మార్కెట్లుగా అనుసంధానం చేస్తామని చెప్పి మరి ఆరేళ్ల తరువాత సైతం కేవలం వెయ్యి మార్కెట్లు మాత్రమే అనుసంధానం చేసి చేతులు దులుపుకున్నారు. ఇక ఈ బడ్జెట్లో దేశవ్యాప్త సేంద్రియ సాగుకు ప్రాధాన్యత అంటూనే ప్రోత్సాహానికి నిధులు కేటాయించలేదు. నూనె గింజల ఉత్పత్తిలో రైతుల స్వయం సమృద్ధికి సహకరిస్తామన్నారు. ఆర్గానిక్ ఫార్మింగ్ కారిడార్ నిర్మాణానికి ప్రోత్సహిస్తామని రసాయన ఎరువుల పిచికారీకి డ్రోన్ టెక్నాలజీని వినియోగించేందుకు అనుమతిస్తామన్నారు. అందుకు మేకిన్ ఇండియాలో స్టార్టప్‌లకు సబ్సిడీలను కొనసాగిస్తామని ఊదరగొట్టిన ఈ ప్రభుత్వం బడ్జెట్లో ఇటీవల రాజీలేని పోరాటం చేసి రైతు వ్యతిరేక చట్టాలను రద్దుచేయించుకున్న రైతాంగ సంక్షేమానికి అప్పుబడి ఉన్న కనీస మద్దతు ధర గురించిన కేటాయింపుల ప్రస్తావన మచ్చుకైనా లేకపోవడం రైతులపట్ల ఈ ప్రభుత్వానికి ఉన్న కపట ప్రేమ వెల్లడౌతోంది.

**వ్యవసాయం, అనుబంధ రంగాలకు తగ్గిన నిధులు:**

భారత ఆర్థిక వ్యవస్థలో జీవనోపాధికి ఇప్పటికి వ్యవసాయమే పెద్ద దిక్కుగా ఉంది. లాక్‌డౌన్ సమయంలో మనదేశంలో అన్నిరంగాలు స్తంభించినాయి. దశాబ్దాలుగా వ్యవసాయ రంగం పట్ల నిర్లక్ష్యం కొనసాగుతున్నప్పటికీ, ఈ రంగమే సంక్షోభ సమయంలో మొత్తం దేశాన్ని రక్షించింది. కనుక వ్యవసాయానికి మద్దతు ఇవ్వడం భద్రత కల్పించడం అంటేనే ఆకలి, పోషకాహార లోపం నుంచి దేశాన్ని రక్షించడమేనని ప్రభుత్వాలు గుర్తించాలి. బడ్జెట్ మొత్తం నిధులలో వ్యవసాయం, అనుబంధ రంగాలకు గతంలో 3.97 శాతం కేటాయించగా ప్రస్తుత బడ్జెట్లో దానిని తగ్గించి 3.51 శాతం కేటాయించారు. దీనితో ప్రస్తుతం అమలులో ఉన్న పలు వ్యవసాయ అభివృద్ధి పథకాలు కూడా నిలిచిపోనున్నాయి. ప్రధానంగా వ్యవసాయాన్ని ఆదుకునేందుకు ఎలాంటి ప్రత్యక్ష చర్యలు లేవు. ఈ బడ్జెట్లో చెప్పిన హామీలన్నీ నమ్మదగినవిగా లేవు. ఎందుకంటే రైతులకు ఎరువులపై ఇచ్చే సబ్సిడీ 2021-22 బడ్జట్‌లో రు. 140,000 కోట్లు ఉంటే ఈ 2022-23 బడ్జెట్‌లో రు. 35,000 కోట్లు తగ్గించి రు. 1,05,000 మాత్రమే కేటాయించడం జరిగింది. దీనితో ప్రభుత్వానికి వ్యవసాయం పట్ల ఉన్న చిత్తశుద్ధి అర్థమవుతుంది. వరి, గోధుమ పంటలకు బదులుగా ప్రభుత్వం ప్రత్యామ్నాయ పంటలను వేయాలని సూచించింది. కానీ వాటిని ప్రోత్సహించడానికి మద్దతు ధరను ప్రస్తావించలేదు. ఈ మిషన్ పామాయిల్ విస్తీర్ణాన్ని 6 లక్షల హెక్టార్లకు పెంచేందుకు కృషిచేస్తున్నామని చెప్పారు. లక్షల కోట్లతో వ్యవసాయ మౌలిక నిధిని ఏర్పాటు చేసినట్లు తెలిపారు. ఏడేండ్లలో బయో ఫోర్టిఫైడ్ రకాలను రూపొందించామని ఆహార, పౌష్టికాహార భద్రతపై దృష్టి పెట్టినట్లు ప్రకటించారు. సాగులో ఆధునికతను పెంచేందుకు రైతులకు సరైన సహకారం బడ్జెట్లో లేదు. దేశంలో 80 శాతం మంది సన్నకారురైతులే ఉన్నారు. వారి ప్రయోజనాలను కాపాడే కనీస ప్రయత్నం బడ్జెట్లో కన్పించలేదు. ఒకవైపు దేశంలో170 జిల్లాల్లో కరువు పరిస్థితులున్నాయని గుర్తిస్తూనే నివారణ చర్యలు లేకపోవడం విచారకరం.

**భారీగా పెరిగిన పేదరికం:**

ప్రపంచంలో ఘనచరిత్ర కల్గిన పెద్ద ప్రజాస్వామ్యం, అధిక యువశక్తి, వైవిధ్య సంస్కృతులు, భిన్నకులాలు, విభిన్న మతాల కలయికలతో తులతూగుతున్నామని చెప్పుకుంటున్న ఈ దేశంలో ఇంకా కూటి కోసం, గుడ్డ కోసం అనుక్షణం కాలంతో పోరాటం చేస్తూ పూరి గుడిసెలలో, రైల్వే ప్లాట్‌ఫామ్‌లో, అండర్ పాస్‌ల కింద జీవించే ప్రజలున్నారంటే ఆశ్చర్యం కల్గుతుంది. ఆకాశాన్ని అందుకునే అద్దాల మేడలు, భవంతులు కలిగిన ఈ దేశంలో పేదోడు ఇంకా పేదోడుగా మారుతున్నాడు. ధనవంతులు ఇంకా ధనవంతులై పోతున్నారు. ఈ బడ్జెట్ ఈ అంతరాలను మరింత పెంచేదిగా ఉంది. ఆక్స్‌ఫామ్ ప్రకటించిన గణాంకాలను బట్టి, దేశంలో గత ఒక్క ఏడాదిలోనే 16 కోట్ల మంది కొత్తగా పేదరికంలోకి నెట్టబడ్డారు. ఈ ఏడాదిలో 84 శాతం ప్రజల ఆదాయాలు తగ్గు ముఖం పట్టాయి. ఈ దేశంలోని 50 శాతం ప్రజల పేదరికానికి అత్యంత ధనికులైన ఒక శాతం ప్రజలే బాధ్యులు అని ఆక్స్‌ఫామ్ నివేదిక తెలిపింది.

**శరవేగంగా పెరిగిన కార్పొరేట్ సంపద:**

పాలకులు అనుసరిస్తున్న కార్పొరేట్ అనుకూల విధానాల ఫలితంగా గ్లోబలైజేషన్ తర్వాత సంపద శరవేగంగా పెరుగుతుంది. కానీ ఉత్పత్తిలో మెజారిటీ ప్రజలు పాల్గొని అనంతరం ఆదాయంలో అందరికి అవకాశాలుండే సమ్మిళితవృద్ధి దేశానికి మేలు చేస్తుంది. దీనికి భిన్నంగా ఈ దేశ సంపద కార్పొరేట్ల దగ్గర కేంద్రీకృతమైంది. అభివృద్ధి అంటే సంపద పెరగటంతో పాటు ప్రజల మధ్య పంపిణీ జరగాలి. అభివృద్ధి అంటే దేశ ప్రజలందరి ముందడుగు కావాలి. కానీ నిజానికి కార్పొరేట్ల సంపద పెరిగింది. గత సంవత్సరం ప్రారంభంలో భారతదేశంలోని శతకోటీశ్వరులు 102 మంది ఉండగా సంవత్సరాంతానికి ఆ సంఖ్య 142కు చేరింది. శతకోటీశ్వరుల సంపద రు. 23.14 లక్షల కోట్లు ఉండగా సంవత్సరాంతంలో 53.16 లక్షల కోట్లకు పెరిగింది. 10 శాతం ధనికులు దేశంలోని 45 శాతం సంపదను కలిగి ఉన్నారు. ఆర్థికంగా దిగువనున్న 50 శాతం ప్రజలు కేవలం ఆరు శాతం మాత్రమే కలిగి ఉన్నారు. అత్యంత ధనికులైన

98 మంది దగ్గర 55.5 లక్షల కోట్ల సంపద ఉన్నది. ధనవంతులైన 100 మంది దగ్గర 57.3 లక్షల కోట్ల రూపాయలు ఉన్నాయి. అత్యంత ధనవంతులైన 10 మంది దగ్గర ఉన్న సంపద 25 సంవత్సరాల పాటు దేశంలో విద్యను అందించేందుకు సరిపోతుందని చెప్పిన నివేదికలు చూస్తే ఈ దేశంలో బడ్జెట్లు ఎవరి బాగుకోసం బాటలు వేస్తున్నాయో అర్థమౌతుంది. పెరిగిన పేదరికానికి కారకులు పాలకులేనని, తమ సానుకూలత కోసం పాలకవర్గాల మెడలు వంచుతున్న కార్పొరేట్లేనని స్పష్టమౌతుంది.

**ఉద్యోగరహిత అభివృద్ధి:**

ఆర్థిక వృద్ధికి ఉద్యోగకల్పనకు అవినాభావ సంబంధముంది. ఏడు శాతానికి మించిన వృద్ధి రేటుతో ఆర్థిక వ్యవస్థ పురోగమిస్తుందని తాజా ప్రభుత్వ గణాంకాలు వెల్లడిస్తున్నాయి. అదే వేగంతో ఉద్యోగాల కల్పన సాధ్యం కావడం లేదనేది విశ్లేషకులకు విస్మయం కలిగించే అంశం. యాంత్రీకరణ, పెద్ద సంఖ్యలో బయటకు వస్తున్న పట్టభద్రులకు సరైన ఉపాధి నైపుణ్యాలు కొరవడటంతో పాటు ప్రభావం చూపని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల విధానాల మూలంగా ఆదాయ అసమానతలతో కూడిన ఉద్యోగ రహిత వృద్ధి ప్రస్తుతం దేశానికి అత్యంత కీలక సవాలుగా మారింది. దేశంలో అమల్లో ఉన్న కార్పొరేట్ అనుకూల విధానాలతో నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలు లేక నేడు కోట్లాది మంది యువత డిగ్రీలు, పిజిలు చేసి ఉద్యోగం దొరకక పొట్టచేతపట్టుకొని తిరుగుతున్నారు. కోట్లాది మంది ఉద్యోగాల నోటిఫికేషన్ల కొరకు ఎదురుచూస్తున్నారు. సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ 2021 డిసెంబర్ సర్వే ప్రకారం దేశంలో 5.3 కోట్ల మంది నిరుద్యోగులున్నారు. 3.5 కోట్ల మంది పనికోసం తీవ్రంగా వెతుకుతున్నారు. పనిచేయడానికి సిద్ధంగా ఉన్నా పని దొరకనివారు 1.7 కోట్ల మంది ఉన్నారు. దేశంలో నిరుద్యోగరేటులో 7.9 శాతంగా ఉన్న వీరికి తక్షణమే ఉపాధి కల్పించాల్సిన అవసరం ప్రభుత్వం మీద ఉంది.

**నిరుద్యోగం నిర్మూలనకు చర్యలేవి?**

దార్శనికత లేని పాలకుల చర్యల ఫలితంగా భారతదేశానికి తీవ్ర సవాళ్లు విసురుతున్న మరో కఠోర సమస్య పెరుగుతున్న నిరుద్యోగం. నిరుద్యోగ సమస్య నివారణకు ఏడాదికి రెండు కోట్ల ఉద్యోగాలు సృష్టిస్తానని 2014 సార్వత్రిక ఎన్నికల ప్రచారంలో అధికారంలో ఉన్న ఈ పాలకులే పదే పదే హామీ ఇచ్చారు. ఆశపడ్డ యువ ఓటర్లు పూర్తిగా మద్దతునిచ్చారు. అయితే అధికారంలోకి వచ్చిన తరువాత పాలకుల వైఖరి మారిపోయింది. పలు వేదికల మీద పకోడీలు అమ్మడం కూడా ఒక ఉద్యోగమేనని ఉద్ఘాటించడం యువకులకు విస్మయాన్ని గురిచేసింది. గతించిన ఏడు సంవత్సరాలలో నిరుద్యోగం గరిష్టంగా పెరిగిపోయింది. నిరుద్యోగిత రేటు ప్రస్తుతం పట్టణాలలో 8 శాతంగా, పల్లె ప్రాంతాలలో 6 శాతంగా ఉంది. కరోనా సృష్టించిన ఉత్పాతంతో 60 లక్షల ఎమ్ఎస్ఎమ్ఇ (సూక్ష్మ, చిన్న, మధ్య, తరహా వ్యాపార సంస్థలు) మూతపడ్డాయి. లక్షలాది కార్మికులు ఉద్యోగాలు కోల్పోయారు. ఈ నేపథ్యంలో రాబోయే ఐదు సంవత్సరాలలో 60 లక్షల ఉద్యోగాలు సృష్టిస్తామని 2022 – 23 ఆర్థిక సంవత్సర కేంద్ర బడ్జెట్ హామీ ఇచ్చింది. సగటున ఏడాదికి 12 లక్షల ఉద్యోగాలు సృష్టిస్తారన్న మాట! ఏటా కార్మిక శ్రేణుల్లో కొత్తగా ప్రవేశిస్తున్న వారి సంఖ్య 47.5 శాతం. పాలకులు మేనిఫెస్టోలో పెట్టిన ఏటా రెండు కోట్ల ఉద్యోగాల మాట ఏమైందో గుర్తుకులేకపోవడం గమనార్హం.

**వేతన జీవులను మరోసారి నిరాశ పరిచిన కేంద్ర బడ్జెట్ :**

ప్రభుత్వ ఆదాయం పెద్ద ఎత్తున వృద్ధి చెందడానికి ప్రధాన కారణం తీవ్రమైన పన్ను వసూళ్లే. మొత్తం పన్నుల రూపంలో ఆదాయం 64.9 శాతం మేరకు, వ్యక్తిగత ఆదాయపు పన్ను 47.2 శాతం మేరకు, జిఎస్‌టి వసూళ్లు 61.4 శాతంకు పెరిగాయి. అయినప్పటికీ వ్యక్తిగత ఆదాయపు పన్ను స్లాబులో ఎలాంటి మార్పు ప్రకటించకుండా వేతన జీవులకు ఈ బడ్జెట్ మరోసారి నిరాశను మిగిల్చింది. సంవత్సరాలుగా ఆదాయ పన్ను రాయితీలు కల్పిస్తారని ఉద్యోగులు ఎదురుచూస్తున్నారు. ఇటీవల వేతన సవరణతో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల జీతభత్యాలు పెరిగిన నేపథ్యంలో గత కొంత కాలంగా ఏవిధమైన పన్ను మినహాయింపులు ప్రకటించని కేంద్రం ఈ సంవత్సరం తప్పక రాయితీని ప్రకటిస్తుందని ఆశించిన ఉద్యోగులకు మరోసారి మొండి చెయ్యి చూపింది. ఆదాయ పన్ను స్లాబులు గానీ, స్టాండర్డ్ డిడక్షన్ గానీ, 80సి పరిమితి గానీ మార్చకుండా యథాతథంగా కొనసాగించడం నిరాశకు గురిచేసింది. ఏడేళ్ల కింద నిర్ణయించిన కనీస ఆదాయ పరిమితిని ఇంకా కొనసాగించడం హేతుబద్ధంగా లేదు. వార్షిక వేతనాభివృద్ధి అనుపాతంతో సమానంగా పన్ను రాయితీని ప్రభుత్వం ప్రకటించాలి. కానీ స్లాబ్ విధానంలో మార్పులుంటాయని చకోర పక్షుల్లా ఆశగా ఎదురు చూసిన ఉద్యోగ వర్గాలు, పన్ను చెల్లింపుదారుల ఆశల మీద ఈ బడ్జెట్ నీళ్లు చల్లింది. దేశవ్యాప్తంగా అనేక నిత్యావసర, అత్యవసర వస్తూత్పత్తుల మీద, సర్వీసుల మీద జీఎస్టి భారాన్ని తగ్గించాలన్న డిమాండును పరిగణనలోకి తీసుకోలేదు. దీనికి భిన్నంగా కోట్లలో లాభాలు గడించే కంపెనీలకి కార్పొరేట్ టాక్స్‌ను 12 శాతం నుంచి 7 శాతానికి తగ్గించిన ప్రభుత్వం సాధారణ ఉద్యోగులకు మాత్రం 10 లక్షల ఆదాయం దాటగానే 30 శాతం పన్ను వసూలు చేయడం ఈ బడ్జెట్ కార్పొరేట్లకు కొమ్ముకాయడమే అవుతుంది.

**ఆస్తుల అమ్మకమే ప్రభుత్వ హిడెన్ ఎజెండా:**

జాతీయ సంపద, వనరుల అమ్మకం మరింత వేగవంతం చేసే ఉద్దేశం కనపడింది. ఈ నేపథ్యంలో ఎయిర్ ఇండియా వ్యూహాత్మక అమ్మకపు ప్రక్రియ టాటా గ్రూపు యాజమాన్యానికి బదిలీ చేయడం ద్వారా ముగిసింది. రక్షణ రంగానికి అత్యవసరమైన టెక్నాలజీలను అందిస్తున్న సెంట్రల్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్‌ను అమ్మబోతున్నారు. నేషనల్ ఇస్పాత్ నిగమ్ లిమిటెడ్‌ను అమ్మారు. 1991 అనంతరం

వచ్చిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ, సరళీకరణ ఆర్థిక విధానాలు స్వదేశంలో విదేశీ పెట్టుబడులకు తలుపులు బార్లా తెరిచిన నేపథ్యంలో దేశాభివృద్ధికి, ఆర్థిక వృద్ధికి జీవన రేఖగా సేవలందిస్తున్న భారతీయ జీవిత బీమా సంస్థ (ఎల్ఐసి)ని, ఐపిఓని ప్రైవేట్ పరం చేసి రు. 45 వేల కోట్ల నుంచి లక్ష కోట్ల వరకు సమీకరించడానికి అంచనా వేశారు. బిపిసిఎల్, షిపింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా వంటి ప్రభుత్వ రంగ సంస్థలను అమ్మడానికి అడుగులు వేస్తున్నారు. సంస్కరణల పేరుతో ప్రభుత్వరంగ సంస్థల వాటాలను, ఆస్తులను కారుచౌకగా కార్పొరేట్లకు కట్టబెట్టి వచ్చే ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వరంగ సంస్థల నుంచి పెట్టుబడుల ఉపసంహరణ లక్ష్యాన్ని 65 వేల కోట్లుగా నిర్దేశించారు.

**సమాఖ్య వ్యవస్థకు విఘాతం :**

కేంద్రం రాష్ట్రాల ఆర్థిక హక్కులను హరించి, సమైక్య స్ఫూర్తికి విఘాతం కల్గించి రాష్ట్రాల మధ్య వివక్షకు తెరలేపింది. కేంద్ర ప్రభుత్వ అనుకూల రాష్ట్రాలకు అపరిమితంగా పథకాలను కేటాయించింది. ప్రతిపక్ష రాష్ట్రాలపై శీతకన్ను వేసింది. జిఎస్‌టి ద్వారా రాష్ట్రాల ఆదాయాలను కొల్లగొడుతూ ఆ మేరకు కొంతైనా ప్రత్యక్ష గ్రాంట్ల ద్వారా ఆదుకునే ప్రయత్నం చేయకుండా రాష్ట్రాల ఆర్థికాభివృద్ధికి వడ్డీ రహిత రుణ పరిమితిని రు. 15 వేల కోట్ల నుంచి రు. లక్ష కోట్లు కేటాయిస్తామని పొల్లుమాటలకు తెగబడింది. రాష్ట్రాలకు 50 ఏళ్ల పాటు వడ్డీ రహిత రుణాలు అనేవి ఆత్మనిర్భర్ భారత్‌లోని అంశాలే.

**ముగింపు :**

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల కొనసాగింపు నేపథ్యంలో ప్రభుత్వ నివేదికల గణాంకాల విశ్వసనీయతే కాదు, బడ్జెట్‌కు ప్రధాన భూమికైన ఆర్థిక సర్వే విశ్వసనీయత కూడా ప్రశ్నార్థకంగా మారింది. ఆర్థిక సర్వే నివేదికలో ప్రజలు ఎదుర్కొంటున్న ఇబ్బందులను ప్రస్తావించకుండా ఆర్థిక వ్యవస్థ రికవరీ గ్రోత్ గురించి ప్రస్తావించడం అర్థరహితంగా ఉంది. గడిచిన సంవత్సరంలో ఆర్థిక వ్యవస్థను పట్టిపీడించిన రుగ్మతలకు పరిష్కారాలు లేవు. నిజానికి కోవిడ్ కారణంగా ఉద్యోగాల సృష్టి నిలిచిపోయి, పెరుగుదల మందగించిన ఆర్థిక వ్యవస్థను తక్షణం కాపాడాలి. అందుకు ప్రజల్లో కొనుగోలు శక్తిని పెంచడానికి నగదు బదిలీ, పరోక్ష పన్నుల తగ్గింపు ద్వారా పేదలు, మధ్యతరగతి ప్రజల చేతుల్లో మరింత డబ్బును ఉంచాలి. దీనిద్వారా కొనుగోలు సామర్థ్యం మెరుగుపడి మార్కెట్లో వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. కోవిడ్ కారణంగా మూతపడిన సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలను పునరుద్ధరించాలి. ఈ పునరుద్ధరణతో, నష్టపోయిన లక్షలాది ఉద్యోగాలను మళ్లీ వెనక్కి తీసుకురావడం సాధ్యమవుతుంది. ఈ సంక్షోభ సమయంలో దేశంలో సంక్షేమంపై మరింత ఎక్కువగా ఖర్చుచేయాలి. దేశ జనాభాలో పై స్థాయిలో ఉన్న పది శాతం మంది జాతీయ ఆదాయంలో 57 శాతాన్ని కలిగి ఉన్నారు. జాతి సంపదలో 77 శాతం వారి చేతుల్లోనే ఉంది. ఈ సంపన్నులకు పన్ను రాయితీలు కాకుండా వారినుండి భారీగా పన్నులు వసూలు చేయాలి. గుప్తంగా సాగుతున్న, ఆదాయ పన్నుశాఖల కళ్లుగప్పి నిర్వహిస్తున్న అనేక వ్యాపార వర్గాల నుండి సక్రమంగా పన్నువసూలుకు మార్గం అన్వేషించాలి. కేవలం వేతన జీవులు పలుకుబడి లేని పారిశ్రామిక ఉత్పత్తి యజమాన్యాల నుంచే గాక తప్పుడు మార్గాల్లో బహిర్గతపరచని సంపాదనపరుల ఆదాయ పన్నుకై ముక్కు పిండాల్సి ఉంది. ఇప్పటికైనా విదేశీ ధనాన్ని ఇండియా రప్పిస్తామన్న, నల్లడబ్బును దేశ ప్రజల ఖాతాల్లో జమచేస్తామన్న మరుగునపడ్డ నినాదాలను నిజం చేయాలి. వ్యాపార సంస్థలు, బ్యాంకులకు సంబంధించినంతవరకు సిబిఐ, ఇడి, ఎస్ఎఫ్ఐఓ మొదలైన వాటిని సమీక్ష చేయాలి. పాలకుల విధానాలను ప్రశ్నించలేని ఈ తరంతో భవిష్యత్ తరానికి భరోసా లేకుండా పోతుంది. దేశార్థికాభివృద్ధిపై నకారాత్మక ప్రభావం పడుతుంది. ప్రజలందరు ఇకనైనా మేల్కొని ప్రజా వ్యతిరేక విధానాలను నిలువరించే మహా ఉద్యమంలో భాగస్వాములం అవ్వాలి.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

**యు**ద్ధం సమస్యలో సాధారణంగా విస్మరించే అతి ముఖ్యమైన విషయం, అవసరమైనదానికన్న తక్కువ శ్రద్ధ చూపే అంశం, అనవసరమైన, పనికిరాని, సోమరి వివాదం చాల చెలరేగుతుండే అంశం యుద్ధపు వర్గ స్వభావం ఏమిటనే సమస్యే అని నాకనిపిస్తున్నది. యుద్ధానికి దారి తీసినదేది, ఏ వర్గాలు యుద్ధం చేస్తున్నాయి, ఏ చారిత్రక, చారిత్రకార్థిక పరిస్థితులు యుద్ధం తలెత్తేలా చేశాయి అనేవే ఆ వర్గ స్వభావానికి చెందిన అంశాలు. బహిరంగ సభలలోనూ, పార్టీ సమావేశాలలోనూ యుద్ధం గురించి చర్చ జరిగేటప్పుడు అంత ఎక్కువగా గందరగోళం ఉండడానికి కారణం అదేనని నేను నిర్ధారణకు వచ్చాను. యుద్ధం అనే సమస్యతో వ్యవహరిస్తున్నప్పుడు మనం తరచుగా పూర్తిగా భిన్నమైన భాషలు మాట్లాడుతుంటాం. మార్క్సిజం దృష్టికోణం నుంచి, అంటే ఆధునిక శాస్త్రీయ సోషలిజం దృష్టికోణం నుంచి, యుద్ధాన్ని ఎలా అంచనావేయాలని, దాని పట్ల ఎటువంటి వైఖరి తీసుకోవాలని సోషలిస్టులు జరిపే ఏ చర్చలోనైనా ప్రధానాంశం: యుద్ధాన్ని ఎందుకోసం నడుపుతున్నారు, ఏ వర్గాలు ఆ యుద్ధాన్ని తలపెట్టాయి, నాయకత్వం వహిస్తున్నాయి అనేదే. మనం మార్క్సిస్టులం అన్ని యుద్ధాలను బేషరతుగా వ్యతిరేకించే తరహా మనుషులం కాము. మనం ఏమంటామంటే: మా లక్ష్యం మానవజాతిని వర్గాలుగా విభజించడాన్ని రద్దు చేసి, మనిషిని మరొక మనిషి, జాతిని మరొక జాతి దోపిడీ చేసే సోషలిస్టు సామాజిక వ్యవస్థను సాధించడం. అది అనివార్యంగా అసలు యుద్ధం వచ్చే అవకాశాన్నే రద్దు చేస్తుంది. కాని ఒక యుద్ధమ్లో మనం సోషలిస్టు సామాజిక వ్యవస్థను గెలుచుకోవాలంటే, వివిధ దేశాల మధ్య యుద్ధంలో ప్రతి నిర్దిష్ట దేశం లోనూ సాగుతున్న వర్గపోరాట పరిస్థితులను ఎదుర్కోవలసి ఉంటుంది. అసలు ఆ యుద్ధమే వర్గపోరాటంతో నిర్ణయమవుతుంది.

**– వి ఐ లెనిన్ ('యుద్ధం – విప్లవం' అనే అంశం పై 1917 మే 14 (27)న చేసిన ఉపన్యాసం నుంచి)**

# మోదీ బడ్జెట్‌లో ఆదివాసుల చోటేది?

*తాజా బడ్జెట్ కేటాయింపులను, పర్యవసానాలను ఆదివాసీ క్షేత్రస్థాయి అనుభవాల నేపథ్యంలో వివరిస్తున్నారు*

**కురుసం శంకర్**

**2011** జనగణన ప్రకారం దేశ జనాభాలో ఆదివాసి జనాభా 8.6 శాతం ఉంది. కాని వీరి కోసం ప్రభుత్వాలు వెచ్చిస్తున్నది అందులో నాల్గవ వంతైనా లేదు. వర్తమాన కేంద్ర బడ్జెట్ లో మూలవాసీ జన జీవితాల కోసం కేటాయించినది 2.26 శాతం నిధులు మాత్రమే. అంటే భారత మూలవాసీ ప్రజలకు జనాభా ప్రాతిపదికన లభించాల్సిన న్యాయమైన వాటాలో మోదీ – నిర్మల బడ్జెట్ రు. 2. 5 లక్షల కోట్లు టోపీ పెట్టింది.

మన దేశంలో అనేక మంత్రిత్వశాఖలు ఉన్నట్టే ఆదివాసీ వ్యవహారాల మంత్రిత్వశాఖ ఉంది. మూలవాసుల అభివృద్ధికి, ఇతర విషయాలలో జోక్యం చేసుకొని ప్రభుత్వాలకు సిఫారసులు చేయడానికి ఓ జాతీయ కమిషన్ కూడ ఉంది. మూలవాసులపై అత్యాచారాలు, దౌర్జన్యాలు, వేధింపులు చోటుచేసుకుంటే శిక్షించడానికి ఎస్సీ, ఎస్టీ అత్యాచారాల నిరోధక చట్టం ఉంది. ఇవన్నీ ఉన్నప్పటికీ దేశంలోని గణనీయమైన ఆదివాసీ ప్రాంతాలు మావోయిస్టు ఉద్యమ ప్రాంతాలుగా ఎరుపు రంగు పులుముకున్నాయన్న చింత పాలకులకు కునుకు పట్టనివ్వడం లేదు. అడవులను తమ చిత్తానుసారం కొల్లగొట్టుక పోనీయకుండా తుపాకులతో మావోయిస్టులు పహరా కాస్తున్నారనే నగ్న సత్యాన్ని వారు భరించలేకపోతున్నారు. ఆ 'బెడద'ను తొలగించుకోవాలని అడవులను రక్తసిక్తం చేస్తున్నారు. అందుకు ఎంతైనా బడ్జెటు కేటాయింపులు జరుగుతున్నాయి. వాటి కోసం నిధులకు, బలగాలకు కొదువ ఉండదని మంత్రివర్యులంతా పదే పదే హామీలు ఇస్తున్నారు.

దుర్భరమైన జీవితాలను అనుభవిస్తున్న మూలవాసుల దైనందిన జీవితాలలో మరిన్ని బాధలను పెంచే దిశలోనే వర్తమాన బడ్జెట్ 2022-2023 రూపుదిద్దుకుంది. ఆ వివరాలు చూద్దాం.

దేశంలోని ఆదివాసుల జీవితాలతో ముడిపెట్టిన మంత్రిత్వశాఖ నుండే బడ్జెట్‌ను పరిశీలిద్దాం. గత సంవత్సరం కేంద్ర బడ్జెట్ లో ఆదివాసీ మంత్రిత్వ శాఖకు మంజూరైన నిధులు రు. 7,484 కోట్లు. వీటిలో ఖర్చయినవి రు. 6,126 కోట్లు. అంటే మంత్రిత్వ శాఖ 19 శాతం నిధులను ఖర్చే చేయలేదన్నమాట! మంత్రిత్వశాఖ ఆదివాసుల విషయంలో ఎంత పట్టింపుతో ఉందో దాని నిర్వాకం ఎట్లుందో చూశాం. ఇపుడు మరో విషయాన్ని చూద్దాం. కొరోనా కాలంలో దేవాలయాలు తెరిచారు. కానీ చాలా చోట్ల స్కూళ్లు తెరువలేదు. ప్రభుత్వాలకు కావలసింది రాబడి. దేవాలయాలతో ఉన్న రాబడి ప్రభుత్వ స్కూళ్లతో ఎక్కడుంటుంది? మన దేశంలోని లక్షలాది దేవాలయాల ద్వారా ప్రభుత్వాలకు పెద్ద ఎత్తున నిధులు లభ్యమవుతుంటాయి. కరోనా కాలంలో స్కూళ్లు మూతపడడంతో ప్రైవేట్ విద్యాసంస్థల వారు రెండు చేతులా సంపాదించుకుంటున్నారు. ఆన్‌లైన్ విద్య ప్రారంభమైంది. అంతర్జాలం గిరాకీ పెరిగింది. మొబైల్ కొనుగోళ్లకు రెక్కలు వచ్చినయి. కానీ, ఆదివాసీ పేద పిల్లలకు అవి అందనంత దూరంలో ఉండడంతో ఆన్లైన్ విద్యచే వంచింపబడిన ఆదివాసీ పిల్లలు కనీసం తమ స్కాలర్ షిప్ డబ్బులతోనైనా ఆన్లైన్ విద్యనభ్యసించడానికి కృషి చేస్తారనుకుంటే గత బడ్జెట్‌లో వారికి కేటాయించిన రూ. 292 కోట్ల స్కాలర్షిప్ డబ్బులైనా అందివ్వలేదు.

వాటి తీరు అలా ఉంటే ఇక రోజుకు ఓ నాలుగు గంటలు ప్రధానంగా విద్వేష సాహిత్యంతో యువత మెదళ్లను మొద్దుబార్చే ఏకలవ్య ఆశ్రమ పాఠశాలలకు రూ. 400 కోట్లు కేంద్రం తన బడ్జెట్‌లో కేటాయించింది. ద్రోణాచార్యుడు అర్జునుడి కోసం ఏకలవ్యుడి వేలు కోసుకోగా రామభక్తులు ఆదివాసీ పిల్లలకు చెందాల్సిన నిధులను కోసుకున్నారు. ఈ దేశంలో బుక్కెడు అన్నం కోసం బడికి పోయే పిల్లలకు కొదువ లేదు. పేద పిల్లలను బడికి ఆకర్షించడానికి పగటి పూట భోజన పథకం ప్రారంభించారు. కానీ, దోచుకునే వాళ్లకు మనిషే సరుకై, మహిళా దేహమే వ్యాపారమవుతున్న ఈ దుష్ట వ్యవస్థలో పిల్లల కడుపు కొట్టడం ఏ లెక్కలోది! ఆదివాసీ పిల్లల మధ్యాహ్న భోజనాలకు కేటాయించిన రు. 300 కోట్లు బడిలో పేద పిల్లలు కడుపాకలితో నకనకలాడినా వాళ్ల పేరు మీద ఉన్న వాళ్ల డబ్బుల్లో నుండే పైసా ఖర్చు చేయలేదు. ఇకపోతే, ఉభయ తెలుగు రాష్ట్రాలలో మూలవాసీ విశ్వ విద్యాలయాలు అన్నారు, రెండు కోట్ల రూపాయల నిధులు కేటాయిస్తామన్నారు. కానీ చివరన 47 లక్షలతోనే సరిపుచ్చారు. ఇక ఈసారైతే రెండు కోట్ల బదులు కోటిన్నరే మంజూరు చేశారు. విద్యా లేదు, విశ్వ విద్యాలయం లేదు. గతకాలపు నలందాను గుర్తుచేసే మోదీ, విద్యను వ్యాపారం చేసి లెక్కకు మిక్కిలి కళాశాలలు, విశ్వ విద్యాలయాలను అనుమతిస్తూ విద్యా స్థాయిని దిగజారుస్తూ బ్రాహ్మణీకరణతో జాతీయ విద్యా విధానానికి ప్రాణం పోశాడు.

ఆదివాసుల జీవన విధానంలో అటవీ ఉత్పత్తుల సేకరణ వారి ఆర్థిక రాబడిలో ఒక ముఖ్య వనరుగా ఉంది. మావోయిస్టు ఉద్యమ ప్రాంతాల ఆదివాసులు మోదీ డీబీటీ (డైరెక్ట్ బెనిఫిట్ ట్రాన్స్‌ఫర్) మాకు

వద్దంటూ పోలీసుల లాఠీలకు, తూటాలకు వెరువకుండా (ఆ ప్రాంతాలలో ఇంటి నుండి బయటకు వస్తే మళ్లీ సురక్షితంగా ఇంటికి చేరే హామీ లేదు) 2020లో పోరాడి నగదు చెల్లింపును సాధించుకున్నారు. మన ప్రభుత్వాలు అర కొర అటవీ ఉత్పత్తులకు కనీస మద్దతు ధరలు ప్రకటిస్తున్నాయి. ఓ మేరకు అది సంతోషమే! అయితే, ఆ ధరలు మార్కెట్ ధరలతో సరితూగుతున్నాయా, లేవా, ఏ ప్రాతిపదిక మీద మద్దతు ధర ప్రకటిస్తున్నారనేది వేరు విషయం.

మహారాష్ట్రలోని గడ్‌చిరోలీ గ్రామసభలు అక్కడ అడవులపై పెసాతో అధికారం సాధించుకున్న ఫలితంగా గత ఐదేండ్లుగా వారు వెదురు అమ్మకాల సమస్య తీవ్రంగా ఎదుర్కొంటున్నారు. ఏ కాంట్రాక్టర్ అక్కడి వెదురు వనాల నుండి వెదురు కొనడానికి గ్రామసభల వద్దకు పెద్దగా వెళ్లడం లేదు. పేపర్ మిల్ (బిల్ట్) వారికి గతంలా అక్కడి వెదురు వనాల నుండి కారుచౌకకు వెదురు దొరకకపోవడంతో వారు ఆ అడవుల అంచులకు కూడ వెళ్లడం లేదు. వెదురు అమ్మాలంటే 300 కి.మీలకు పైగా దూరంలో ఉన్న మా పేపర్‌మిల్లు గేటు వద్దకు తెచ్చివ్వండని షరతు పెడుతున్నారు. అడవులలో వెదురుకు కొదువ లేదు. ఆ వెదురు నరికి అమ్ముకొని జీవిక సంపాదించుకోవాలని ఆదివాసులు కోరుకుంటున్నారు. కానీ కొనే నాథుడే లేడు. అన్నీ అడ్డంకులే! ఇలాంటి పరిస్థితులలో వాళ్లు ప్రభుత్వమే కనీస మద్దతు ధరకు తమ గ్రామసభల ద్వార వెదురు కొనాలని ఐదేండ్లుగా ప్రభుత్వానికి మొర పెట్టుకుంటున్నారు.

మరోవైపు గతేడు కేంద్రం తన బడ్జెట్లో అటవీ ఉత్పత్తుల సేకరణకు రు. 155 కోట్లు కేటాయించింది. ఇలాంటి వెదురు కొనుగోళ్లకు ఆ నిధులను వినియోగించి ప్రజలకు మేలు చేయచ్చు. కానీ, మన ప్రభుత్వాలు అలాంటివి కాదు కదా! ప్రజల బాగోగులు పట్టించుకోని ప్రభుత్వాలు నిధులను పూర్తిగా విడుదలే చేయలేదు. ఇక ఆదివాసుల రక్షకులుగా రాజ్యాంగం గుర్తించిన ఏ రాష్ట్ర గవర్నర్ నిజాయితీగా ఇలాంటి విషయాలలో ప్రజల మేలు కోరి జోక్యం చేసుకొని నిధుల సద్వినియోగం కోసం కృషి చేయడం లేదు. ఫలితంగా గత బడ్జెట్ నుండి కేవలం రు. 115 కోట్లు మాత్రమే అటవీ ఉత్పత్తులకు విడుదల చేశారు. ప్రభుత్వం అనుసరిస్తున్న ఆదివాసీ వ్యతిరేక వైఖరితో, అనివార్య పరిస్థితులలో ఆదివాసీ పేద ప్రజలు తమ అటవీ ఉత్పత్తులను కారుచౌకకు ప్రైవేట్ సాహుకార్లకు అమ్ముకోక తప్పడం లేదు.

ఆదివాసుల అటవీ ఉత్పత్తులకు ఆధునిక నిలువ సౌకర్యాలు లేవు. కానీ, ఇపుడు అడవులు వ్యాపార కేంద్రాలవుతున్నాయి. దానితో, కోల్డ్ స్టోరేజీలు పెట్టే దిశలో ప్రభుత్వాలు తప్పకుండా ముందుకు వస్తాయనడంలో సందేహం లేదు. ఎందుకంటే బస్తర్ అడవుల నుండి యేటా కనీసం లక్ష కోట్ల రూపాయల టర్నోవర్ ఉంటుండవచ్చు. రిటేల్ వ్యాపారాన్ని ప్రోత్సహిస్తున్న మేకిన్ ఇండియా, ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్ జమానాలో రైతుల ఇండ్లలో నుండి గుమ్ములు, గరిసెలు, వెటియా, కుచ్చ, టేడా, టొప్పిస్, డూటీ (ఆదివాసులు వరి గడ్డితో, ఆకులతో చేసే వివిధ రకాల నిలువ చేసుకునే పరికరాలు) కాలం చెల్లిపోతుంది. పెట్టుబడి చౌక శ్రమశక్తిని వెతుక్కుంటూ అడవులలోకి వస్తుంటే ఆదివాసులు కంపెనీలంటూ కూలీ అంటూ పట్టణాల ముఖం పడుతున్న ప్రస్తుత పరిస్థితులలో సంప్రదాయ నిలువలకు కాలం చెల్లిపోతోంది. అడవులలోకి వ్యాపారస్తుల రద్దీ పెరుగుతోంది. అడ్డాకులతో విస్తార్లు, డొప్పలు వ్యాపారం చేస్తున్నారు. కందమూలాలు అమ్మకం సరుకయ్యాయి. అడవిలోని కానుగు పళ్లపుల్ల కూడ సరుకై ధర సంతరించుకుంది. ప్రతీది సరుకు మయం అవుతోంది. పెట్టుబడులు అడవులలోకి, ఆదివాసులు పట్టణాలలోకి పలాయనం జరుగుతున్న ప్రపంచీకరణ ఫలితం ఇది. ఆదివాసీ పరాయీకరణ చెందుతున్న వేళ ఇది.

ఈ ప్రక్రియను ప్రజలు అడ్డుకుంటున్నారు. వారు స్వావలంబన ఆర్థిక విధానాల కోసం, జల్, జంగల్, జమీన్ కోసం నినదిస్తున్నారు. ప్రభుత్వాల దోపిడీ విధానాలను ఆదివాసులు అనుమతించడం లేదు. అందుకే ఖాకీలు అడవులలో నిండుతున్నారు. పెట్టుబడులకు రక్షణ కల్పిస్తున్నారు. అడవులలో ప్రహార్ సైనిక దాడులు తీవ్రమవుతున్నాయి. రక్తసిక్తమవుతున్న అడవులలో ప్రాకృతిక వనరుల తరలింపుకు రహదారులు నిర్మిస్తున్నారు.

ఇక సామాజిక సబ్సిడీల విషయానికి వస్తే, కాస్తో కూస్తో పేదల ఆకలి తీర్చే అవి ప్రధాని మోదీకి రుచించేవి కావు. ఆయన ఆకలి తీర్చేవి మేక్ ఇన్ ఇండియా, సులభ వ్యాపారం (ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్). ఇవి రెండూ ఒకే ఒరలో రెండు కత్తులు పొదగవు అన్న చందంగా ఉన్నవి. సబ్సిడీలను ఎత్తేయాలనే లక్ష్యంతో పని చేస్తున్న ప్రభుత్వం యేటేటా వాటిలో కోత పెడుతూ పేద ప్రజల ఉసురు తింటున్నది. తిండి గింజలు, వైద్యం, సామాజిక భద్రత, వ్యవసాయం, ఎరువులు మున్నగువాటిపై సబ్సిడీలు క్రమక్రమంగా సన్నగిల్లి పోతున్నవి. వర్తమాన బడ్జెట్లో తిండిగింజలపై రు. 80 వేల కోట్లు అంటే 28 శాతం సబ్సిడీ తగ్గించారు. మోదీ గద్దెనెక్కడానికి ముందు మనెగా కాంగ్రెస్ పార్టీ సమాధికి చిహ్నంగా మిగిలిపోతుందని ఎద్దేవా చేసిన మొనగాడు కాబట్టి ఎప్పటికైనా దానికి స్వస్తి పలకడమే మంచిదని ఆయన అంతరాత్మ ఘోషిస్తుంది. అందుకే ఈసారి బడ్జెట్లో ఆయన మనెగా నిధులలో 25 శాతం నిధులు కోత పెట్టాడు. అంటే దాదాపు రు. 25 వేల కోట్లు కొల్లగొట్టాడు. నిజానికి మన దేశంలో 20 శాతం మనెగా శ్రామికులు మూలవాసీలేనన్నది గుర్తుపెట్టుకోవాలి. దేశ జనాభాలో వారి జనాభా ఇందులో సగం కూడ లేదన్నది గమనార్హం. ఆదివాసీ గ్రామీణ ప్రాంతాలలో అనేక కుటుంబాలు వాటితో పొట్టపోసుకోవడం ఒక చేదు నిజం. ఇలాంటి సామాజిక సబ్సిడీల మీద కోత పెట్టడం ద్వారా నిరుపేద ఆదివాసీలు (ఇక ఇపుడు వారిని అతి జాలిగా పేదలలో కెల్ల పేదవారంటు న్నారు. కానీ కీ.శే. బీడీ శర్మగారు క్షమించాలి. ఆదివాసులను పేదలంటే ఆయన సహించేవారు కాదు) ముందరికన్నా అధికంగా తిండికి ముఖం చాటేసుకోవలసిన దుస్థితులు ఎదురు కాకతప్పదు.

ముందే ఆదివాసీ పిల్లలను చూస్తేనే బాణా పొట్టలతో, పీల బద్ద కాళ్లు, చేతులతో ముఖం మీద రక్తం లేకుండా దర్శనమివ్వడం

జగమెరిగిందే. ఇందులో మహారాష్ట్రలోని నందుర్ బార్ జిల్లా పత్రికలలో పతాక శీర్షికను ఆక్రమిస్తుంది. ఆదివాసీ మహిళలు రక్తహీనతతో కొట్టుమిట్టాడుతుంటారు. వారు అనారోగ్యం, రక్తహీనతతో ఎంతో మంది పిల్లలకు తల్లులవుతూ వైద్యం లేకుండా, జీవచ్ఛవాల్లా బతుకులీడుస్తుంటారు. ఇపుడు కొరోనా మహమ్మారి కాటేస్తోంటే ప్రభుత్వం ఆరోగ్య నిధులకు కోత పెట్టింది. ప్రభుత్వ తాజా బడ్జెట్ వారి జీవితాలను మరింత అధ్వాన్నం చేస్తుంది. మన దేశంలోని గోదాములలో పది కోట్ల టన్నుల ఆహార ధాన్యాలు మురిగిపోయి నాశనమవుతున్నాయని అనేక నివేదికలు తెలుపుతున్నాయి. వాటిని పేదలకు ఉచితంగా పంచండంటూ సుప్రీంకోర్టు ఆదేశాలు ఇచ్చినా ప్రభుత్వాలు ఖాతరు చేయడం లేదు. ఇక ఇపుడు 'వన్ నేషన్–వన్ రాషన్ కార్డు' అంటూ మోదీ సబ్ కే సాథ్, సబ్ కా వికాస్, సబ్ కా విశ్వాస్, సబ్ కా ప్రయాస్‌ల సరసన చేరింది. కానీ సబ్ బక్వాస్ అని తేలిపోతోంది.

మోదీ చేపట్టిన వ్యవసాయ సబ్సిడీల కోతతో గ్రామీణ ప్రాంతంలో విపరీతంగా ప్రభావితమయ్యేది ఆదివాసీ జీవితాలేనని విడిగా చెప్పాల్సిన అవసరం లేదు. దేశంలోని వ్యవసాయ కూలీలలో ఆదివాసీలు గణనీయమైన సంఖ్యలోనే ఉన్నారు. సామాజిక సబ్సిడీల కోతతో ఉజ్వల అంటూ ఊదరగొట్టిన గ్యాస్ సిలిండర్లు మూలనపడే దుస్థితులు దాపురించినవి. స్పెషల్ ట్రైబల్ కాంపొనెంట్స్ నుండి గ్యాస్ సిలిండర్ల నిధులు రు. 1,064 కోట్ల నుండి ప్రస్తుత బడ్జెట్‌లో ఏకాఏకి రు.172 కోట్లకు తగ్గించారు. దీనితో కర్రల పొయ్యి ముందు కళ్లు పోగొట్టుకుంటున్న ఆదివాసీ మహిళలు మరింత కన్నీటికి గురికాక తప్పదు. అడవులు నాశనం అవుతున్న పరిస్థితులు ఒకవైపు, మరోవైపు అడవుల నుండి వంటచెరకు తెచ్చుకోనివ్వని అటవీ శాఖ ఉద్యోగుల దౌర్జన్యాలు, అడవులను ఖాళీ చేయాలనే సుప్రీం కోర్టు తాఖీదుల మధ్య మూలవాసీ ప్రజల జీవితాలలోని వెతలు వర్తమాన బడ్జెటుతో పెరిగేవే తప్ప తగ్గేవి కావు.

మోదీ పాలనలో స్పెషల్ ట్రైబల్ కాంపొనెంట్స్ ఆదివాసులను దగా చేస్తున్నది. ఆదివాసులకు చెందాల్సిన నిధులను ఇతరత్రా పద్దులలోకి మళ్లిస్తున్నది. స్పెషల్ ట్రైబల్ కాంపొనెంట్ కేంద్రంలోని దాదాపు 41 విభాగాలు/మంత్రిత్వశాఖలతో అనుసంధానించారు. వీరి దగాను అర్థం చేసుకోవడానికి చిన్న ఉదాహరణ చూద్దాం. జాతీయ రహదారుల నిర్మాణానికి రు. 4,500 కోట్లు మళ్లించి దానిని మూలవాసీలపై ఖర్చుగా చూపుతున్నారు. వాస్తవానికి దేశంలోని 50 శాతం ఆదివాసీ గ్రామాలకు రవాణా సౌకర్యాలే కరువు. అడవులలోని విలువైన వనరుల తరలింపుకు రూపొందుతున్న జాతీయ రహదారులను పాలకులు వారి జీవితాల అభివృద్ధికి అంటూ దగా చేస్తున్నారు. కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ (సీఎస్ఆర్) నిధుల నిర్వాకం చూస్తున్నాం కదా! కిరందూల్ సీఎస్ఆర్ నిధులను రమణ్ సింగ్ ఇతర పద్దులలోకి మళ్లించడం ఛత్తీస్‌గఢ్ బస్తర్ ఆదివాసీ ప్రజలకు తెలువనిది కాదు. ఇలాంటి నిధుల ఘోర మళ్లింపులు అనేకం జగమెరిగినవే. వాటి కోసం పొరపాటున ప్రజలు ఉద్యమిస్తే పాలకుల, ఖాకీల దృష్టిలో వారు మావోయిస్టులు, నేరస్తులు అయిపోతారు!

మోదీ ప్రభుత్వ హయాంలో పెట్రోలియం ఉత్పత్తుల రేట్లు తారాజువ్వలా ఎలా పెరిగి పోతున్నాయో అనుభవిస్తున్నాం. అడవులలోని ఆదివాసీ పల్లెల్లో సాహుకారి కొట్టులో లీటర్ పెట్రోల్ కావాలంటే రు. 150 వసూలు చేస్తున్నారు. మోదీ బడ్జెటులో పన్నుల వడ్డింపులు లేవని మురిపిస్తున్నారు. కానీ, పేదలు వాడే పాదరక్షల మీద ఏ మోతాదులో పన్ను పెరిగిందో గమనించండి. ఈ బడ్జెట్‌లో ధరల తగ్గింపు ప్రసక్తి లేనే లేదు. మరోవైపు ఈ యేడాది 3 నుండి 5 శాతం వినియోగ వస్తువుల ధరలు పెరుగనున్నాయని భవిష్యవాణిలు వినబడుతున్నాయి. వాటి ధరలు 8 నుండి 15 శాతం డిసెంబర్ మొదటి వారం నాటికే పెరిగాయి. పెట్రోలియం ఉత్పత్తులపై గత దశాబ్ద కాలంలో ఎక్సైజ్, కస్టమ్స్ సుంకాలు లక్షా మూడు వేల కోట్ల రూపాయల నుండి 6 లక్షల ముప్పై కోట్లకు పైగా పెరిగాయి. వ్యవసాయ ఉత్పత్తి కాకరాల విషయానికి వస్తే యూరియా ధర 144 శాతం, డీఏపీ ధర 84 శాతం పెరిగి రైతు అవి కొనలేక అరిగోస పడుతున్నారు. విత్తనాల సబ్సిడీలు మాయమవుతున్నయి.

ఒకవైపు రైతు బీమా, రైతు బంధు అంటూ ఏవేవో అన్నదాతను మురిపించే పథకాలు ప్రకటిస్తూనే ఉన్నారు. మరోవైపు తెలంగాణలో గత మూడేళ్లలో 75 వేల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు.

ఇకపోతే, నాల్గవ పారిశ్రామిక విప్లవం అంటూ దావోస్‌లో మంతనాలు జరపడంలో ముందున్న మోదీజీ బడ్జెట్‌లో ఉద్యోగాలు పెంచే పథకాలు కానరావు. అందరినీ దగా, మోసం, వంచన చేసే తియ్యతియ్యని సొల్లు వాగుడు తప్ప మోదీ బడ్జెట్ ద్వారా పేదలకు చేసింది శూన్యం. కార్పొరేట్ వర్గాలకు సేవలందించే మోదీ వారి నుండి మొండి బకాయిలు వసూలు చేయలేకపోయామనీ 10.72 లక్షల కోట్లు గత ఏడేళ్లలో రద్దు చేశాడు. అలాంటి మోదీ నుండి ఆదివాసుల కోసం ఆశించడం లొటపెట పెదవులకు నక్క ఆశపడ్డట్టే ఉంటుంది. కేంద్రం విదిలించే పెన్షన్ రు. 2,000లలో పేద ఆదివాసీ విధవరాళ్ల పెన్షన్లోనైనా నయా పైసా పెంచలేదు. వృద్ధాప్య పెన్షన్లలో పెంపు శూన్యం. కొరోనా ఎక్కువగా కాటువేసేది ఈ వయసువారినే అని బెదరగొడుతూ, ఈ వయసులో అనేక శారీరక రుగ్మతలతో బాధపడే పెన్షన్‌దారులపై శీతకన్ను. ఇక మోదీ మేలు చేసిందెవరికి? మోదీ బడ్జెట్‌లో మా స్థానం ఎక్కడ!

మా అడవులలో నుండి సర్వం కొల్లగొట్టుక పోవడానికి 4, 8 లేన్ల రహదారులు, వాటి కాపలాకు ఖాకీలు, వాటిని వద్దంటే కాల్పులు ఇదీ మోదీ చేస్తున్నది. నిరుటి బడ్జెట్ కన్నా ఈయేటి బడ్జెట్ 16 శాతం పెరిగినప్పటికీ ఆదివాసుల పద్దులు మాత్రం ఎందులోనూ ఈ పెరుగుదల లెక్కన పెరుగలేదు. వారిపై హింసా, అత్యాచారాలు, హత్యలు, దౌర్జన్యాలలో మాత్రం 16 శాతాన్ని మించిపోతాయి. ఇక ఇపుడు మాది మనుగడ కోసం పోరాటంగా మారింది అంటున్నారు పోరాడుతున్న ఆదివాసులు.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# ప్రజా ప్రణాళికలు, వార్షిక పద్దులు

*ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థల మౌలిక స్వభావాన్ని విశ్లేషిస్తూ శ్రామిక శ్రేయో రాజ్యంలో ప్రణాళికలు ఎలా ఉంటాయో వివరిస్తున్నారు* **బి.ఎస్. రాజు**

**ప్లాన్ అంటే:**

ఏదైనా సంస్థ, వ్యవస్థ, సమాజం లేదా దేశం ఏ దిశలో ఎలా పురోగమించాలనుకుంటోందో, ఏ కాలపరిమితిలో ఎటువంటి ఆర్థిక సామాజిక సాంస్కృతిక ప్రగతి సాధించాలనుకుంటుందో, ఆ సాధనకు కావలసిన వివిధ రకాల వనరులను ఎలా సమకూర్చుకుంటుందో శాస్త్రీయంగా అంచనావేసి లెక్కలు కట్టుకోవడాన్ని ప్లాన్, ప్రణాళిక అంటున్నాం. ఈ ప్రణాళికలు స్వల్పకాలానికి లేదా దీర్ఘకాలానికి రచించుకోవచ్చు. ప్రణాళిక ఓ ఏడాదికైతే వార్షిక ప్రణాళిక అని, ఓ ఐదేళ్ళకైతే పంచవర్ష ప్రణాళిక అని పిలుస్తున్నాం.

**ఉత్పత్తి, మారక వ్యవస్థలు:**

ప్రపంచ దేశాల్లో ప్రధానంగా రెండు రకాల ఉత్పత్తి, మారక వ్యవస్థలు ఉన్నాయి. ఒకటి మార్కెట్ ఆధారిత ఆర్థిక వ్యవస్థ అయితే రెండవది ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థ. అన్ని పెట్టుబడిదారీ దేశాల్లోనూ మార్కెట్ ఆధారిత వ్యవస్థ ఉంటుంది. ఒకప్పటి సోవియట్ రష్యా, తూర్పు జర్మనీ, తూర్పు యూరోప్ దేశాల్లో ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థలు ఉండేవి. ఇప్పుడు అవి కూడా మార్కెట్ ఆర్థిక వ్యవస్థలుగా పెట్టుబడిదారీ మార్గాన్ని అనుసరిస్తున్నాయి. ఇండియా కొన్నేళ్లపాటు మిశ్రమ ఆర్థిక విధానాన్ని అంటే ప్రభుత్వ ప్రయివేటు మేళవింపు ఆర్థిక బాటలో నడిచి ఇప్పుడు పూర్తి మార్కెట్ ఆధారిత, ఆశ్రిత పెట్టుబడిదారీ వ్యవస్థగా నడుస్తోంది. అంటే ప్రభుత్వ ఆశ్రిత, అనుకూల పెట్టుబడిదారులకు ప్రభుత్వరంగాన్ని బదిలీచేసే పూర్తి ప్రజావ్యతిరేక, వికృత మార్కెట్ ఆర్థిక వ్యవస్థ అన్నమాట. మూడవది, ఇంకా కొన్ని ఆదిమ జాతులు పాటించే ఉత్పత్తి, వస్తు మార్పిడి వ్యవస్థ. ఈ వ్యవస్థను కూడా పెట్టుబడిదారీ మార్కెట్ వ్యవస్థ దురాక్రమిస్తున్న క్రమాన్ని మన దేశంలో నిత్యం చూస్తున్నాం.

**బడ్జెట్ అంటే:**

ఏదైనా సంస్థ, వ్యవస్థ లేదా దేశం, రాష్ట్రం.. వీటి ఆదాయ వ్యయాల అంచనాలతో కూడిన ముందస్తు పద్దును 'బడ్జెట్' అని అంటున్నాం. ఈ పద్దు ఓ సంవత్సరానికైతే వార్షిక పద్దని పిలుస్తున్నాం. నిర్దిష్ట ప్రణాళికాంశాల సాధనకు కావల్సిన వనరులను ఎలా సమకూర్చుకోవాలో చెప్పేది బడ్జెట్ లేక పద్దు. ప్రణాళిక, పద్దు చట్రాన్ని నిర్ణయిస్తుంది. అంటే పద్దుకు మూలం ప్రణాళిక. ఈ రెండు పరస్పరాధారితాలు.

నెలసరి జీతాలు పొందే కుటుంబాలకు నెలవారీ బడ్జెట్, రోజువారీ కూలితో జీవించే వారికి  దినసరి బడ్జెట్ అనేది ఉంటుంది. అది వారి స్పృహలో ఉండొచ్చు, ఉండకపోవచ్చు. చిరువ్యాపారుల నుండి మేరువ్యాపార సంస్థల వరకు పద్దు, ప్రణాళిక అనేవి వారివారి, వాటివాటి స్థాయిని బట్టి ఉంటాయి. ఈ పద్దుల రచనకు, నిర్వహణకు ప్రత్యేక నిపుణులు, నైపుణ్య సంస్థలు ఉంటాయి. వ్యక్తులకు, వ్యాపారస్తులకు, వ్యాపార దిగ్గజ సంస్థలకు, బ్యాంకులకు, ప్రభుత్వాలకు ఈ పద్దు నైపుణ్యాల సంస్థలు తమ సేవలు అందిస్తూ ఉంటాయి.

ప్రైవేట్ పెట్టుబడి రాజ్యమేలుతున్న ఈ రోజుల్లో, ధనస్వామ్య ఆర్థిక వ్యవస్థల్లో, ఈ నిపుణుల పాత్ర, రథసారథ్యం మెండుగా ఉంటుంది. ఈ నిపుణులు, ఈ నైపుణ్య సంస్థలు పెట్టుబడి కనుసన్నల్లో నడుచుకుంటూ, దాని వృద్ధికి, విస్తృతికి సదా సేవచేస్తూ, దానికి ప్రధాన మేధో సంపత్తిని సమకూరుస్తూ ఉంటాయి.

**గద్దల బడ్జెట్:**

మన రోజువారీ జీవితంలో 'కాకులను కొట్టి గద్దలకు  వేశారు' అనే పదం తరచూ వింటూవుంటాం. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఇప్పటి మన ప్రభుత్వ బడ్జెట్ 'గద్దల బడ్జెట్' లేక 'రాబందుల బడ్జెట్'. అంటే కాకులను ఎలా కొట్టి గద్దలకు, రాబందులకు ఎలా ఆహారంగా వేసి మేపాలి అనేదే గద్దల పద్దు, లేక రాబందుల బడ్జెట్. మరి కాకులు ఎవరో, గద్దలు, రాబందులు ఎవరో ప్రత్యేకంగా చెప్పక్కరలేదనుకుంటా!

**కాకుల గోల:**

కాకులు ఏకమై భరించలేని గోల చేస్తే, కావుకావు మని గోసపెడితే, గద్దలు, రాబందులు పసిగడతాయి, కాకులకు కడుపు మండుతోందని. కాకుల మంట చల్లార్చాలని, లేకపోతే తమపై తిరగబడి ఎగబడి పొడుస్తాయని గ్రహిస్తాయి. అలా జరిగితే మొదటికే మోసమొస్తుందని కాసిని మెతుకులు విసురుతాయి. ఇదిగో చూడండి మీకోసం ఇంతచేస్తి మంతచేస్తిమని పద్దులతో అంకెల గారడీలు చేస్తాయి.

గద్దల పద్దులు గద్దలకోసమే తయారౌతాయి కాబట్టి రాబందులు, గద్దలు తినగా, దోచుకోగా, దాచుకోగా, మిగిలిన కాసిని కొసలు, పొసలు కాకులకు వేస్తాయి. వీటితో సరిపెట్టుకుని తమ శ్రమను, సేవలను కాకులు గద్దల, రాబందులకందిస్తూ ఉండాలి. అలా సరిపెట్టుకోక అతిగా గోలచేస్తే, రాబందులు ప్రత్యేకంగా పెంచి

పోషించే కాటాగోళ్ళ, చురకత్తి ముక్కుల, ముళ్ల రెక్కల గద్దలను కాకులపై విరుచుకుపడమని పంపిస్తాయి. కాకుల నోళ్లను మూయిస్తాయి. ఇదే గద్దల రాబందుల రాజ్యనీతి.

**కాకుల బడ్జెట్:**

కాకులను కొట్టి గద్దలకేయటం అని వింటూ ఉంటాం. కాని, ఉల్టా, గద్దలను కొట్టి కాకులకు వేయడం ఎక్కడా వినం. బ్రిటిష్ రాబందుల నుండి ఇండియా రాబందులకు రాజ్యం బదిలీ అయ్యాక ఆ బదిలీ తంత్రానికి స్వతంత్రం అని ఇండియా గద్దలు పేరుపెట్టుకున్నాయి. అప్పటి నుండి ఈ 75 ఏళ్లలో ఎక్కడా 'అధికారపు గద్దెల' మీద తెల్లగద్దలు కనిపించకుండా నల్లగద్దలే కనిపిస్తుంటే కాకులు పాపం నమ్ముతూనే ఉన్నాయి, ఓహో! ఇది సకల జీవుల సౌతంత్రం కాబోసని. అందుకే ఈ బూటకపు స్వాతంత్రం, రాజ్యాంగం తమకోసమేననే భ్రమలో బతుకుతున్నాయి పలుగాకులు. గద్దల బడ్జెట్‌ను కాదని కాకుల బడ్జెట్ కావాలని, గద్దలను కొట్టి కాకులకు వెయ్యడమే కాకుల బడ్జెట్ అని, అదే పలుగాకుల క్షేమాన్ని సాఫల్యం చేస్తుందని కాకులు కానడంలేదు, కోరడంలేదు.

**బూర్జువాల సమన్యాయం ఓ బూటకం:**

అందరికీ సమన్యాయం చేస్తుంది మా బడ్జెట్ అని ప్రతియేటా 'గద్దెలెక్కిన' గద్దలు సుద్దులు చెబుతూ ఉంటాయి. కాకులు కష్టించి సంపద సృష్టిస్తే గద్దలు, రాబందులు ఈ సంపదలో మెట్టువాటా కొట్టేసి పెట్టుబడుల పర్వత శిఖరాలపై కుబేర విజయ పతాకలు ఎగరేసి అంతా తమ ఘనతేనని గర్వంగా రెక్కలు ఎగరేస్తూ ఉంటాయి. అందరికి సమన్యాయం, అందరికీ మేలు, సబ్‌కా సాత్ సబ్‌కా వికాస్ అనే బూర్జువా సొల్లు పదాల్లో దాగి ఉండే బూటకాన్ని, మోసకారితనాన్ని ఏనాడో ఎన్.ఐ.బుఖారిన్, ఇ.ప్రియోబ్రెజినిస్కీ అనే సోవియట్ మేధావులు 'ఎ బి సి ఆఫ్ కమ్యూనిజం' అనే పత్రంలో ఎంతచక్కగా వివరించారో చూడండి:

శ్రామిక ప్రజాస్వామ్యం, బూర్జువా ప్రజాస్వామ్యం మధ్య తారతమ్యాలను వాటి మధ్య ఉన్న వర్గ వైరుధ్యాలను వివరిస్తూ వారు ఇలా రాశారు...

"వర్గ సమాజంలో అన్ని వర్గాలకు ఒకే రకమైన భావన, ఒకే ఐచ్ఛిక సంకల్పం ఉండదు. సర్వజన ప్రయోజనమంటూ ఉండదు. ఉదాహరణకు శ్రామికులతో ఎక్కువ పనిగంటలు పనిచేయించుకుంటే యజమానికి లాభదాయకం. అదే శ్రామికునికి హాని, నష్టం. విరుద్ధ ప్రయోజనాలు కలిగి ఉండే వర్గాల మధ్య ఒకే నీతి ఉండాలి, ఉంటుంది అనుకోవడమంటే గొర్రెలు తోడేళ్ల మధ్య సామరస్యం ఉండాలని కోరుకోవడమే!

తోడేళ్లు గొర్రెలను తినాలని చూస్తాయి. మరి గొర్రెలు తోడేళ్ల నుండి తమను కాపాడుకోవాలని చూస్తాయి. ఇది వాటి మధ్యనున్న సహజ వైరుధ్యం ఐనప్పుడు ఆ రెంటికీ ఒకే నీతి, ఒకే న్యాయం వర్తిస్తుందా? అది సాధ్యమా? బుర్రున్న వాడెవడైనా చెబుతాడు ఇది అసంబద్ధమని. ఏదో ఒకే నీతి ఉంటుంది. ఉంటే తోడేళ్ల నీతైనా ఉంటుంది లేదా గొర్రెల నీతైనా ఉంటుంది. గొర్రెలను వంచించి దోచుకునే తోడేళ్ల నీతైనా ఉంటుంది లేదా దోచుకుతినే తోడేళ్లను తరిమికొట్టే గొర్రెల నీతైనా ఉంటుంది. అంతేగాని మధ్యే మార్గమంటూ ఉండదు. అలానే పట్టపగటి వెలుగులా కనిపించే సత్యమేమంటే, ఇదే నీతి మానవ సమాజంలోని రెండు ప్రధాన ప్రజా ప్రత్యర్థి వర్గాలకు కూడా వర్తిస్తుంది.

ప్రస్తుత బూర్జువా వ్యవస్థలో శ్రామికులు, బూర్జువాలు ఎదురు బొదురు నిలబడ్డ వర్గాలు. వాటి మధ్య యుద్ధ స్పర్ధ ఉంటుంది. అంచేత బూర్జువా–కార్మిక ఐక్య నీతి అనేది బూర్జువాలు శ్రామికులను నిరంతరం దోచుకునేందుకు వల్లెవేసే ఓ బూటకపు నినాదం, హంబగ్. పెట్టుబడిదారుల పాలన కొనసాగింపుకు వాడుకునే అనువైన నినాదం. పెట్టుబడిదారులు ఎంతమంది? ఓ గుప్పెడు. వీళ్లు శుద్ధ మైనారిటీ మురా. మెజారిటీ ప్రజలను మోసగిస్తూ, మభ్యపెడుతూ తమ పాలన కొనసాగించుకోవాలంటే, తమ స్వపక్షానికి మేలుచేసే నీతిని ప్రజలందరి క్షేమంకోరే సకల సమ్మతి నీతిగా చిత్రిస్తారు.

బూర్జువా ప్రజాస్వామ్య రిపబ్లిక్ లో పెట్టుబడిదారులకు ఈ వంచన కొనసాగింపు ఎలా సాధ్యపడుతుంది అంటే.. మెజారిటీ శ్రామికులు ఆర్థికంగా పెట్టుబడి బానిస బంధనాల్లో ఉంటారు కాబట్టి సామాజికంగా కూడా పెట్టుబడికి బానిసలుగా జీవించాల్సి వస్తుంది. ప్రజాస్వామిక రిపబ్లిక్ దేశాల్లో కూడా పరిశ్రమలు, ఇతర ఉత్పత్తి వ్యవస్థలు పెట్టుబడిదారుల గుప్పెట్లో, పంటభూముల పెద్ద కమతాలు, భూస్వాముల, భూదందాకోరుల స్వాధీనంలో ఉంటాయి. కొన్ని చీలిక పీలికల కమతాలు మట్టుకు పేద రైతుల వద్ద ఉంటాయి. కార్మికునికి, రైతుకు, పనివారికి శ్రమశక్తి తప్ప వేరే వనరు ఉండదు. యాజమాన్య వర్గాలకు తమ శ్రమశక్తిని అమ్ముకుని జీవించడం తప్ప శ్రామికులకు వేరే గత్యంతరం ఉండదు. బూర్జువా ప్రజాస్వామ్య రిపబ్లిక్ లో శ్రామికులకు, రైతులకు కాగితం మీద సవాలక్ష హక్కులు హంగామాలు ఉంటాయి. కానీ అవి అమలుకాని అక్షరాలుగా అలంకారప్రాయంగా మిగిలిపోతాయి. శ్రామికులు నిస్సహాయులుగానే మిగిలిపోతారు. ఎందుకనంటే యావత్ సంపద, శక్తిసంపన్నమైన పెట్టుబడి, రాజ్యాధికారం, ఇవన్నీ కూడా శ్రామిక శత్రువైన పెట్టుబడిదారీ వర్గం చేతిలో ఉంటాయి కాబట్టి. బూర్జువా ప్రజాస్వామ్యపు నిజస్వరూపమిది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఫ్రాన్స్, బ్రిటన్, జర్మనీ, స్విట్జర్లాండ్ ఇత్యాది దేశాలన్నీ బూర్జువా రిపబ్లిక్‌లే. ఈ దేశాల పాలకులెవరు? ఎవరంటే, శ్రామిక ప్రజల కుత్తుకలపై కత్తులు పెట్టి పాలించే నీతినియమాలు లేని, అన్యాయాలకు, అకృత్యాలకు, యుద్ధాలకు తెగబడే సామ్రాజ్యవాదులు, బడా పెట్టుబడిదారులు, రాచరిక ప్రభువులు, బ్యాంకర్లు వగైరా శ్రామిక శత్రుగణం. 1919లో జర్మన్ రిపబ్లిక్‌లో, సోషలిస్టు డెమోక్రటిక్ ప్రభుత్వం అత్యంత ప్రజాస్వామికమైనదిగా పేరు పొందింది. అటువంటి ప్రభుత్వమే జర్మన్ కార్మిక నాయకులు, జర్మన్ కమ్యూనిస్టు పార్టీ స్థాపకులు అయిన కార్ల్ లీబ్‌నెక్ట్, రోజా లక్జెంబర్గ్‌లను హత్యచేసింది".

ఈ తోడేళ్ల, రాబందుల, గద్దల రాజనీతి ఎల్లకాలం సాగుతుందా? కాకుల రాజ్యం, మేకల రాజ్యం అంటూ ఓ కొత్త రాజ్యం వచ్చి తమ సొంత ప్రణాళికలు, పద్దులు, బడ్జెట్లను అంటే తోడేళ్లను, రాబందులను, గెద్దలను కొట్టి కాకులకు, మేకలకు, గొర్రెలకు పంచే ప్రణాళికలు బడ్జెట్లు రావా? అంటే వస్తాయి, తప్పక వస్తాయి. వస్తే అటువంటి జనసామాన్య ప్రణాళికలు, ప్రజా పద్దులు ఎటువంటి రాజకీయార్థిక నీతి కలిగి ఉంటాయి? వాటి రూపు రేఖలు ఎలా ఉంటాయ్? చూద్దాం! పరిశీలిద్దాం!

**శ్రామిక ప్రజల ప్రణాళిక, బడ్జెట్:**

శ్రామిక ప్రజల బడ్జెట్, పద్దు, ప్రణాళిక ఉండాలంటే శ్రామికులకు రాజకీయ అధికారం ఉండాలి. శ్రామిక రాజ్యం అంటూ ఏర్పడాలి. బూర్జువాల అధికారంలో శ్రామికుల బడ్జెట్లు అంటూ ఉండవు. శ్రామికులను మభ్యపెట్టి సంపద కొల్లేయడానికి కొన్ని విదిలింపులు ఉంటాయి. బూర్జువాలకు రాజ్యాధికారం ఉన్నంత కాలం శ్రామికులకు బానిసవేతనమే గాని ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం సమకూరదు.
బూర్జువాలకు అధికారం లేకుండా పోతేనే అది సాధ్యపడుతుంది.

దేశంలో సమస్త ఉత్పత్తి సాధనాలన్నీ (గనులు, పరిశ్రమలు, భూములు ఇత్యాదివన్నీ) ఉత్పత్తిలో పాల్గొంటూ భుక్తిని, సామాజిక అవసరాలను, సంపదను సమకూర్చే కార్మికుల, కర్షకుల, బుద్ధిజీవుల ఐక్య కమిటీలకు చెందాలి. అంటే శ్రామిక ప్రజా సముదాయానికి చెందాలి. అలా చెందినప్పుడే సకల శ్రామిక జనావళికి ప్రణాళికాబద్ధంగా, త్వరితంగా వ్యక్తిగత, సామాజిక అవసరాలు తీరుతూ ఉంటాయి. 'సబ్‌కే సాత్ సబ్‌కా వికాస్' అనేది నిజమౌతుంది. లేకుంటే అది పచ్చి మోసకారి నినాదంగా మిగిలిపోతుంది. ఇప్పుడు నూటికి నూరు శాతం మన దేశంలో జరుగుతున్న రాజకీయ తంతు ఇదే! గత కొన్ని రోజులుగా ఈ బూటకం హైదరాబాద్‌కు అవల సమతామూర్తి పేరున హిమాలయ శిఖరాల తలదన్ని నింగిని నేలను మోతెక్కిస్తోంది. మందిని మత్తులో ముంచెత్తుతోంది.

శ్రామికుల శ్రేయోరాజ్యాం ఏర్పడి, ఉత్పత్తి సాధనాలు శ్రామికుల వశమై వారి కోసం ఏర్పడ్డ ప్రణాళికలు, పద్దులు, పద్ధతులు ఎలా ఉండేవో తెలుసుకుంటే మనం ఏమి కోరుకోవాలో, ఏమి సాధించుకోవాల్సి ఉందో అవగతమౌతుంది.

**గత సోవియట్ రష్యా ఉదాహరణ:**

గత సోవియట్ రష్యా, 1917 నుండి 1953లో స్టాలిన్ మరణించే వరకు మూడున్నర దశాబ్దాల పాటు శ్రామికరాజ్యంగా మనగలిగింది. పుట్టుకనుండి రెండు భీకర ప్రపంచ యుద్ధాలను ఎదుర్కొంది. ఎనలేని మానవ వనరులను, శ్రామికుల కష్టార్జితాన్ని, నిర్మాణాలను నష్టపోయి కూడా అద్భుత శ్రామిక ప్రగతి సాధించింది. అక్కడ, ఆ కాలంలో శ్రామికులు ఓ ఉన్నత మానవులుగా, ఉత్తమ సంఘజీవులుగా, శాస్త్రీయ సాంస్కృతిక విలువలతో గుబాళించే సామాజికులుగా వికసించారు.

అయినప్పటికీ సోషలిస్టు చట్రంలోనే పొంచి ఉండి, నక్కలవలె నక్కి దాగి ఉన్న ద్రోహులు, స్టాలిన్ మరణానంతరం సోవియట్ యూనియన్‌లో అధికారం చేజిక్కించుకున్నారు. వీరు శ్రామికవర్గ ద్రోహులుగా సోషలిజం పేరుతో సోషలిజాన్ని వెన్నుపోటు పొడిచిన కుట్రదారులుగా మారారు. కృశ్చేవ్ నుండి గోర్బచేవ్ వరకు, ఈ ముఠా సోషలిజాన్ని వక్రీకరించి, పక్కదారి పట్టించారు. సోజలిజం, కమ్యూనిజం మూలసూత్రాలకు మంగళం పాడారు. పెట్టుబడిదారీ తిరోగమన మార్గంలో సామ్రాజ్యవాద పెట్టుబడితో కుమ్మక్కై ప్రపంచంలోనే మొట్టమొదటిసారి ఏర్పడ్డ శ్రామికరాజ్యాన్ని పనిగట్టుకు కూల్చివేశారు.

ఇప్పుడిక అది ఉనికిలో లేదు. ఓ మహోన్నత చరిత్రగానే మిగిలి ఉంది. ఈ చరిత్ర అత్యంత విలువైనది. అది ఎన్నో త్యాగపూరిత అనుభవాలను, అద్భుత విలువలను, గుణపాఠాలను, వెలుగుదారిని మన ముందు ఉంచుతుంది. అందులో అత్యంత ప్రధాన మైనది మనిషి-ప్రణాళిక, మేన్ ఎండ్ ద ప్లాన్... అంటే శ్రమజీవి చుట్టూ అల్లబడ్డ ప్రణాళికాబద్ధ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక అభివృద్ధి. అదేమిటో ఇప్పుడు చూద్దాం!

**సోవియట్ పంచవర్ష ప్రణాళికలు:**

రష్యాలో జార్ చక్రవర్తి, అతని అనుచరవర్గ పాలన 1917 నవంబర్ మాసంలో అంతమైంది. రష్యా కార్మికులు, బోల్షెవిక్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో ఈ విప్లవ విజయం సాధించారు. ఈ విజయాన్ని నిలబెట్టుకుని సోషలిస్టు పథంలో పురోగమించి సమసమాజ నిర్మాణం చేయడానికి సోవియట్ ప్రజలు పెనుసవాళ్లను ఎదుర్కోవలసి వచ్చింది. బయటనుండి సామ్రాజ్యవాద శక్తులను, మొదటిప్రపంచ యుద్ధాన్ని, అంతర్గత తిరుగుబాటును, క్షామాన్ని తట్టుకుని, పోరాడి గెలవాల్సి వచ్చింది. ఈ దుర్భర పరిస్థితుల్లో లెనిన్ 'నూతన ఆర్థిక విధానం' ప్రవేశపెట్టి కుప్పకూలుతున్న దేశ ఆర్థిక పరిస్థితిని చక్కదిద్ది తిరిగి రెండుకాళ్లపై నిలబెట్టాడు. 1927 వరకు ఈ నూతన ఆర్థిక విధానం కొనసాగింది. 1928-1933 మొదటి సోవియట్ పంచవర్ష ప్రణాళిక పెట్టుబడిదారీ దేశాల్లో ప్రకంపనలు సృష్టించింది. ప్రపంచ పీడిత ప్రజలకు, ముఖ్యంగా వలస దేశాల ప్రజలకు ఇది ఓ విముక్తి ప్రదాతగా, అనుసరణీయ మార్గంగా అగుపించింది. ఈ ప్రణాళిక సోషలిస్టు నిర్మాణ ప్రక్రియను వేగవంతం చేసింది. పెట్టుబడిదారీ దోపిడీ విధానాన్ని రద్దుచేయగలిగే ప్రత్యామ్నాయ మార్గాన్ని ఆవిష్కరించి కొత్త చరిత్రను సృష్టించింది. రష్యా శ్రామిక ప్రజానాయకుడు లెనిన్ రచించిన 'కోపరేటివ్ ప్లాన్' పై ఆధారపడి ఈ నిర్మాణం జరిగింది. క్లుప్తంగా ఈ ప్లాన్‌లోని ప్రధాన అంశాలు ఇవి:

1. రాజ్యాధికారం సాధించుకునే అనుకూల పరిస్థితులు అందివచ్చినప్పుడు కార్మికులు అటువంటి అవకాశం చేజార్చుకోకూడదు. పెట్టుబడిదారీ వ్యవస్థ పుంజుకుని కోట్లాది చిన్న, మధ్యస్థ ఉత్పత్తిదారులను మింగేసే వరకు వేచిచూడకూడదు.

2. పారిశ్రామిక ఉత్పత్తి సాధనాలను సొంతం చేసుకుని వాటిని ప్రజల ఆస్తిగా మార్చేయాలి.

3. చిన్న, మధ్యస్థ ఉత్పత్తిదారులను క్రమేణా సమష్టి ఉత్పత్తి కేంద్రాల్లోనికి సమీకరించాలి. అంటే పెద్దపెద్ద వ్యవసాయ క్షేత్రాలు, సమష్టి రైతాంగ వ్యవసాయ క్షేత్రాలు స్థాపిస్తూ వీరిని సమీకరించాలి.

4. పారిశ్రామిక రంగాన్ని వేగంగా అభివృద్ధిచేసి ఉన్నత స్థాయికి చేర్చాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను కొనసాగిస్తూ వాటిని బృహత్ వ్యవసాయ క్షేత్రాలుగా పెంపొందించడానికి కావలసిన ట్రాక్టర్లు, వ్యవసాయక యంత్రాలను, సాంకేతిక వ్యవసాయ విజ్ఞానాన్ని ధారాళంగా అందచేయాలి.

5. పట్టణ గ్రామీణ ప్రజల మధ్య, పరిశ్రమలు వ్యవసాయం మధ్య సయోధ్య, పటిష్టమైన ఆర్థిక బంధం ఏర్పడే విధంగా సరుకుల ఉత్పత్తులు, మారక (కొనుగోళ్లు అమ్మకాలు డబ్బుతో మారకం) విధానం కొంత కాలం వరకు కొనసాగించాలి. ఎందుకంటే ఈ మారకం పద్ధతినే ప్రస్తుత స్థితిలో రైతులు బలంగా కోరుకుంటున్నారు కాబట్టి. అలానే సోవియట్ వ్యాపారం, మారకం ప్రజా వ్యవస్థల ద్వారా జరపాలి. ఈ ప్రక్రియను వేగంగాను, పటిష్టంగాను అమలుచేసి వ్యాపార రంగంలో పలువిధాలుగా

పాతుకుపోయిన అన్ని రకాల పెట్టుబడిదారులను, దళారులను తుడిచిపెట్టి వేయాలి. 1928-33 మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆర్థికరంగ పెట్టుబడులు ఇలా ఉన్నాయి:

మొత్తం పెట్టుబడి: 64600 మిలియన్ల అంటే 6460 కోట్ల రూబుళ్లు. ఇందులో 1,950 కోట్ల రూబుళ్లు పారిశ్రామిక అభివృద్ధి, విద్యుత్ ఉత్పాదక రంగాలకు, 1,000 కోట్ల రూబుళ్లు రవాణా రంగానికి, 2,320 కోట్ల రూబుళ్లు వ్యవసాయ రంగానికి కేటాయించారు. ఈ ప్రణాళికా కాలంలో ప్రపంచంలో కనివిని ఎరుగని రీతిలో కార్మికులు, రైతులు, బుద్ధిజీవులు సోషలిస్టు నిర్మాణాన్ని అత్యంత ఉత్తేజితంగా చేబట్టారు. ఈ ప్రణాళికా కాలంలోనే సమష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, భారీ పరిశ్రమలు, ఆనకట్టల నిర్మాణాలు, విస్తృత విద్యుద్దీకరణ, ట్రాక్టర్లు, హార్వెస్టర్లు పెద్ద ఎత్తున అందుబాటులోకి వచ్చాయి. బృహత్ ప్రజా గృహసముదాయాల నిర్మాణం ఊపందుకుంది. విద్య, ప్రజావైద్యం, సాంస్కృతిక వికాసం, మహిళా, శిశు సంరక్షణ, కళలు, వినోదం, విహారం, విరామం, పర్యాటకం మొదలైనవి. నగర, పట్టణ, గ్రామీణ ప్రజలకు, బైళ్ల, సంచార, కొండజాతుల ప్రజలకు అందుబాటులోకి వచ్చాయి.

మొదటి పంచవర్ష ప్రణాళిక మైలురాళ్లు 4 సంవత్సరాల 3 మాసాల్లోనే దిగ్విజయంగా చేరుకున్న తరువాత, 1933 జనవరి మాసంలో, బోల్షెవిక్ పార్టీ కేంద్ర కమిటీ, పార్టీ కేంద్ర పర్యవేక్షక బృంద సమావేశాలకు స్టాలిన్ ఈ ప్రణాళిక విజయాలను ఇలా క్రోడీకరించి వివరించాడు:

1. ఇన్నేళ్లూ వ్యవసాయక దేశంగా ఉన్న సోవియెట్ రష్యా ఇప్పుడు పారిశ్రామిక దేశంగా మారింది. దేశీయ ఉత్పత్తిలో పారిశ్రామిక ఉత్పత్తుల వాటా70 శాతంగా ఉంది.

2. పారిశ్రామిక రంగంలో పెట్టుబడిదారీ శక్తుల ప్రమేయం అంతమై సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ ఒక్కటే ప్రథమ స్థానానికి చేరింది.

3. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ, వ్యవసాయ రంగాన్ని శాసిస్తూ వస్తున్న భూస్వామ్య వర్గ (కులక్కుల) పెత్తనాన్ని నిర్మూలించింది.

4. సమష్టి వ్యవసాయ క్షేత్ర విధానం, గ్రామసీమల నావరించి ఉన్న పేదరికాన్ని, వెనకబాటుతనాన్ని నిర్మూలించింది. కోట్లాది పేద రైతాంగపు బ్రతుకు బండికి మొట్టమొదటిసారిగా భరోసా ఏర్పడింది. వారి జీవన ప్రమాణాలు మెరుగైనాయి.

5. పారిశ్రామిక రంగంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ వేళ్లూనుకుని నిరుద్యోగాన్ని నిర్మూలించగల్గింది. రోజువారీ పని గంటలు ఎక్కడా 8కి మించకుండా చేయగల్గింది. అంతేగాక చాలా పరిశ్రమల్లో రోజువారీ పనిని 7 గంటలకు, ఎక్కువ ఇబ్బందికర శ్రమతో కూడుకున్న పరిశ్రమల్లో 6 గంటలకు కుదించగల్గింది.

6. సోషలిజం విజయవంతమై ఆర్థిక రంగపు అన్ని విభాగాల్లోనూ మనిషిని మనిషి దోచుకునే అవకాశాలను లేకుండా చేసింది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే మొదటి పంచవర్ష ప్రణాళిక సోవియెట్ రష్యాలో కార్మికులను, రైతాంగాన్ని దోపిడీ పీడనల నుండి విముక్తిచేసి సకల శ్రామిక జనావళికి ఉన్నత ఆర్థిక, సంస్కృతీ వికాస ద్వారాలు తెరిచింది. రష్యాలో నివసించే అన్ని జాతులకు అభివృద్ధి ఫలాలను అందించింది.

ఈ ప్రణాళికా రచన ప్రజల వివిధ అవసరాల గణాంకాల క్షేత్రస్థాయి సేకరణతో మొదలై కేంద్ర ప్రణాళికా సంఘం వద్ద ముగుస్తుంది. ఈ క్షేత్ర సమాచారంపై ఆధారపడి నిర్దిష్టకాలంలో ప్రజా అవసరాలు తీరే ప్రణాళికను కేంద్ర ప్రణాళికా సంఘం రచించి తిరిగి కింది స్థాయికి చర్చకు, ఆమోదానికి పంపిస్తుంది. ఈ చర్చల సారాన్ని రాబట్టి ముందుగా తాత్కాలిక ప్రణాళికలు, ఆపై సరిచేసిన నిర్దిష్ట ప్రణాళికలు కేంద్ర ప్రణాళికా సంఘం తయారుచేస్తుంది. ఈ ప్రణాళికల్లో భాగంగా వార్షిక పద్దులు తయారౌతాయి.

**సోవియెట్ వార్షిక పద్దు:**

1952 సోవియెట్ ఆర్థిక పద్దును ఉదాహరణగా తీసు కుని చూస్తే 509,900 మిలియన్ (50,990 కోట్ల) రూబుళ్ల ఆదాయం, 476,900 మిలియన్ (47,690 కోట్ల) రూబుళ్లు వ్యయం కనిపిస్తుంది. 33,000 మిలియన్ (3,300 కోట్ల) రూబుళ్లు మిగులు కనిపిస్తుంది. ఈ ఆదాయం పరిశ్రమలు, రవాణా, వస్తు వ్యాపార సంస్థలు కట్టే పన్నుల నుండి లభిస్తుంది. వ్యక్తిగత ఆదాయపన్ను చాలా స్వల్పంగా ఉంటుంది. 1952లో ఇది వార్షిక ఆదాయంలో 9 శాతం.

ఇక వ్యయం వివరాల్లోకి వెళితే 1952 వార్షిక పద్దులో వ్యయం 476,900 మిలియన్ (47,690 కోట్ల) రూబుళ్లుగా ఉంది. దీనిలో 180,400 మిలియన్ (18,040 కోట్ల) రూబుళ్లు (37.8 శాతం) ఆర్థికవ్యవస్థ అభివృద్ధికి, 124,800 మిలియన్ (12,480 కోట్ల) రూబుళ్లు సామాజిక, సాంస్కృతిక రంగాలకు కేటాయించారు.

12,480 కోట్ల సామాజిక, సాంస్కృతిక కేటాయింపు నుండి ఇంచుమించు సగభాగం 6,000 కోట్ల రూబుళ్లు విద్యాభివృద్ధికి కేటాయించారు. ఆరోగ్య రంగానికి 2,280 కోట్లు, సాంఘిక భద్రత, బీమాలకు 3,750 కోట్లు కేటాయించారు. సైన్యం, భద్రతా రంగానికి 23.9 శాతం కేటాయించారు. పెద్ద సంసారాల తల్లులకు, ఒంటరి తల్లులకు 450 కోట్ల రూబుళ్లు కేటాయించారు. ఈ కేటాయింపులు చూస్తే సోవియెట్ పద్దు ప్రజల యోగక్షేమాలు, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక అభివృద్ధిపై కేంద్రీకరించి, రచించి, అమలు జరుపుతున్నట్టుగా విశదమౌతుంది.

మన దేశంలో కూడా శ్రామిక ప్రజల వికాసం, అభివృద్ధి త్వరితగతిన జరగాలంటే ధనిక, సామాన్య ప్రజల మధ్య అగాథ వ్యత్యాసాలు పోయి సమతుల సమాజం ఏర్పడాలంటే శ్రామిక ప్రజల ప్రణాళికలు, పద్దులు రూపొందాలి. ఇవి రూపొందాలంటే రాబందుల వ్యవస్థను రూపుమాపాల్సి ఉంటుంది.

కాకుల, గొర్రెల శాంతియుత ఉన్నత శ్రామిక జీవనం పెంపొందాలంటే రాబందుల, తోడేళ్ల రాజ్యం అంతం అవ్వాల్సిందే తప్ప వేరే విభూది మంత్రాలతో, కాషాయ కషాయాలతో, సమతా విగ్రహ ప్రతిష్ఠాపనల్తో జరిగేది కాదు. అంబానీలు, ఆదానీలు, ఇతర పెట్టుబడి ముఠాలను పల్లకీల నుండి దించనిదే ప్రజా సంక్షేమ జన సామాన్య ప్రణాళికలు, పద్దులు రావు.

ఈ దేశంలో కష్టజీవులు, సకల పీడిత తాడిత ప్రజలు సమసమాజ ఆకాంక్షను పెంపొందించుకోనిదే, ఆ జ్ఞానాన్ని, శాస్త్రాన్ని సంతరించుకుని తదనుగుణంగా సామాజిక మార్పుకు పూనుకోనిదే ప్రజారాజ్యం, సోషలిజం సాధ్యపడదు. ఇక, కమ్యూనిజం మైలురాయి తరువాతి సంగతి. వీ

*(రచయిత శ్రామికనేస్తం సంపాదకులు)*

# హక్కులను హరిస్తున్న పెగాసస్ స్పైవేర్

*పౌరుల వ్యక్తిగత జీవితాలపై అక్రమ, రహస్య నిఘాకు అవకాశం ఇచ్చే పెగాసస్ స్పైవేర్‌ను భారత ప్రభుత్వం వినియోగించిందా లేదా చర్చిస్తున్నారు* **పబ్బతి వెంకటేశ్వర్లు**

వ్యక్తిగత రహస్యాలను ఛేదించాలనుకోవడం ప్రాథమిక హక్కులకు భంగం కలిగించడమే. వ్యక్తి స్వేచ్ఛను హరించడం అనైతికం, నేరం కూడా. వ్యక్తి స్వేచ్ఛను కట్టడి చేయడానికి నిఘా పెట్టడం, ఫోన్ టాపింగ్ వంటి అనుసరించే ఏ పద్ధతి అయినా అది నేర పూరిత విధానమే. ప్రతిపక్ష నాయకులు, మేధావులు, అభ్యుదయ వాదులు, జర్నలిస్టులు, మేధావి వర్గంపై గూఢచార వ్యవస్థ ద్వారా రహస్య నిఘా పెట్టడమనే అనైతిక విధానాన్ని అధికారంలో ఉన్న పాలక వర్గాలు కొనసాగిసున్నాయి. గతంలో ఇందిరా గాంధీ, రామకృష్ణ హెగ్డే కూడా ఇలాంటి ఆరోపణలు ఎదుర్కొన్న సంఘటనలు దేశ చరిత్రలో కానవస్తాయి. సాంకేతిక పరిజ్ఞానం, సైబర్ వ్యవస్థ ప్రపంచాన్ని ఒక్కటి చేసి శాసిస్తున్న ప్రస్తుత తరుణంలో, భయంకరమైన సాంకేతిక నిఘాను ప్రయోగించి వ్యక్తుల స్వేచ్ఛను పాలక వర్గాలు హరించ చూడడం అత్యంత దుర్మార్గం.

ప్రపంచ వ్యాప్తంగా దాదాపు అన్ని దేశాలు దేశ భద్రత పేరుతో లక్షల కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నాయి. పాలక వర్గాలు రక్షణ వంకతో, ప్రజా వ్యతిరేక పాలనా విధానాలను ప్రశ్నిస్తున్న ఆలోచనాపరులను, అభ్యుదయ వాదులను, జర్నలిస్టులను ప్రత్యర్థి వర్గాలను లక్ష్యంగా చేసుకుంటున్నాయి, వారిని అడ్డు తొలగించుకోవడానికి అవసరమైతే అంతమొందించటానికి కూడా ఏమాత్రం సంశయించటం లేదు. దీనికోసం దేశ ద్రోహం వంటి కుట్ర కేసులు మోపడానికి ఆధార రహిత ఆరోపణలకు పూనుకుంటూ న్నాయి. భౌతిక సాక్ష్యాలకు సావకాశంలేక సాంకేతిక సాక్ష్యాల సృష్టికి స్పైవేర్ టూల్స్‌ను ఆశ్రయిస్తున్నాయి. ప్రత్యర్థి మస్తిష్కం లోంచి ఆలోచనలు బయటికి రాకముందే తుంచే పని ఈ సాంకేతికత వల్ల సులభమైంది.

ఈ నేపథ్యంలో ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 50 దేశాల్లో 50,000 మంది పైన ఈ సాంకేతిక నిఘాను ప్రయోగించిట్లు వెల్లడైంది. దాదాపు 300 మందికి పైగా విద్యావేత్తల, సామాజిక కార్యకర్తల, అభ్యుదయ వాదుల, ఉద్యమకారుల, ప్రభుత్వ అధికారులపై భారత పాలక వర్గాలు ఈ నిఘా నేత్రం వేశాయి. అంతేగాక ప్రత్యర్థి ప్రభుత్వాలతో పాటు, సొంత మంత్రులపై కూడా పెగాసస్ స్పైవేర్ అనే రెప్పవాల్చని నిఘా నేత్రాన్ని ప్రయోగించాయి. అత్యంత రహస్యంగా సాగిన ఈ నిఘా ప్రయోగాలపై పారిస్‌కు చెందిన మీడియా సంస్థ ఫర్బిడెన్ స్టోరీస్, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ కన్సార్షియం దర్యాప్తు నిర్వహించాయి. ఈ దర్యాప్తులో న్యూయార్క్ టైమ్స్, వాషింగ్టన్ పోస్ట్, ద గార్డియన్, లే మోండేతో సహా 16 ఇతర అంతర్జాతీయ మీడియా సంస్థలు భాగస్వామ్యమయ్యాయి. భారతదేశంలో ద వైర్ ఆన్‌లైన్ మీడియా సంస్థ ఈ బండారాన్ని బయట పెట్టింది. ఇప్పటివరకు ప్రత్యర్థులపై పెట్టిన నిఘా విధానాలలో ఇది అతి భయంకరమైన ప్రమాదకర సాంకేతిక నిఘా వ్యవస్థ. ఇజ్రాయిల్‌కు చెందిన ప్రభుత్వ అండదండలున్న ఒక ప్రైవేట్ సాఫ్ట్‌వేర్ సంస్థ రూపొందించిన స్పైవేర్‌ను ప్రభుత్వాలు కొనుగోలు చేసి ప్రత్యర్థుల మీద ప్రయోగించడం భారతదేశంతో పాటు ప్రపంచవ్యాప్త రాజకీయాలను, మేధావులను ఆందోళనకు గురిచేసింది.

**భారత్‌లో పెగాసస్ స్పైవేర్ ప్రయోగం:**

పెగాసస్ స్పైవేర్‌ను భారత ప్రభుత్వం 2017లోనే కొనుగోలు చేసిందని న్యూయార్క్ టైమ్స్ నివేదిక చెప్పగా 300 మందికి పైగా ప్రముఖుల ఫోన్ నెంబర్లను పెగాసస్ ద్వారా టార్గెట్ చేశారని ది వైర్ వెబ్‌సైట్ వెల్లడించింది. టార్గెట్ అయిన వారిలో పలువురు జర్నలిస్టులు రాజకీయ నాయకులు, వ్యాపార వేత్తలు, కేంద్రమంత్రులు ఉన్నారని తెలియడంతో ప్రతిపక్షాలు పార్లమెంటులో నిజానిజాలు తేల్చాలని పట్టుపట్టాయి. స్వతంత్ర సంస్థ చేత దర్యాప్తు చేయాలని డిమాండ్ చేశాయి. భారత ప్రభుత్వం చేత పెగాసస్ స్పైవేర్ ప్రయోగించబడిన వారిలో సుప్రీం కోర్టు న్యాయమూర్తి, ఎల్గార్ పరిషద్ కేసులో అరెస్ట్ అయిన ఉద్యమకారులు, పౌరహక్కుల నేతలు, జర్నలిస్టులు, రాజకీయ నాయకులు ఉన్నారని వెల్లడించిన న్యూయార్క్ టైమ్స్ పత్రిక జర్నలిస్టుతో ఇంటర్వ్యూ చేసిన ద వైర్ నిజాలను బయట పెట్టింది. భారత్ ఇజ్రాయిల్ కంపెనీ నుండి భారత ప్రభుత్వం 200 కోట్ల రూపాయలతో రక్షణ ఉత్పత్తులు కొన్నదని కుండ బద్దలు కొట్టింది. అయినా ప్రభుత్వం తమకు ఎలాంటి సంబంధం లేదని దేశ పౌరులందరి భద్రతకు కట్టుబడి ఉన్నామని మభ్యపెడుతున్నది. అంతర్జాతీయ సంస్థలు పెగాసస్ దుర్వినియోగాన్ని ఎండగడుతుండగా కేంద్ర ప్రభుత్వం ఎన్ఎస్ఓతో ఒప్పందం చేసుకోలేదని గానీ, కొనలేదని గానీ చెప్పకపోగా భారతదేశ భద్రత రీత్యా ఈ విషయం బయట పెట్టకూడదని సన్నాయి నొక్కులు నొక్కుతోంది. ఇంతగా ఆందోళనలకు గురిచేస్తున్న పెగాసస్ పూర్వాపరాలు, ప్రయోగానంతర ప్రమాదకర పరిణామాలు పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

**ఏమిటీ పెగాసస్ స్పైవేర్?**

పెగాసస్ అనేది ఇజ్రాయిల్‌కు చెందిన టెక్నాలజీ, సైబర్ సెక్యూరిటీ

సంస్థ అయినటువంటి ఎన్ఎస్ఒ గ్రూప్ తయారు చేసిన ఒక స్పైవేర్ ప్రోగ్రాం. ఇది నిఘా పెట్టాలనుకున్న వ్యక్తుల స్మార్ట్ ఫోన్‌లోకి వారి ప్రమేయం లేకుండానే ప్రవేశపెట్టి, వారికి తెలియకుండానే వారి రహస్యాలన్నీ కొల్లగొట్టడానికి పనికివచ్చే ప్రత్యర్థుల ఆయుధం. వ్యక్తిగత జీవితం మొత్తం బహిర్గత జీవితం అవుతుంది. 2017లో యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ మానవ హక్కుల కార్యకర్త అహ్మద్ మన్సూర్ గుర్తించడంతో దీని బండారం బయటపడింది. దీన్ని స్మార్ట్ ఫోన్‌లోకి లింక్ ద్వారా గానీ, కాల్స్ ద్వారా గానీ, ఈ మెయిల్, ఎస్ఎం ఎస్ ల ద్వారా కూడా పంపవచ్చు. అయితే ఈ మాల్వేర్ ఫోన్ లోకి ప్రవేశించిన విషయాన్ని గుర్తించడం కూడా కష్టమే. మరో విశేషమేమంటే సైబర్ సెక్యూరిటీ నిపుణులు గుర్తించకుండా తనను తాను చెరిపేసుకోగల (ఎరేజ్) సౌకర్యం కూడా ఉంది. ఇది ఫోన్‌లోకి చేరిన తర్వాత సంబంధిత వినియోగదారుడి ఫోటోలను, కాల్స్‌ను, సందేశాలను కాపీ చేయగలదు. వినియోగదారుల ఫోన్ కెమెరాతోనే ఫోటో తీస్తుంది, మీ సంభాషణలను రికార్డు చేస్తుంది. వారు ఎక్కడ ఉన్నారు, ఎవరిని కలుసుకున్నారో, ఏం మాట్లాడుతున్నారో కచ్చితంగా గుర్తించగలదు. ఈ సాఫ్ట్‌వేర్ తొలి వర్షన్‌లో ఫోన్‌కు వచ్చిన మెసేజ్‌లను, మెయిల్స్‌ను లింక్‌లను క్లిక్ చేయడం ద్వారా సోకేది. ప్రస్తుతం వినియోగదారుని ప్రమేయం లేకుండానే ఫోన్ సాఫ్ట్‌వేర్‌లోని గుర్తించడానికి వీలు లేనంత స్థాయిలో ఉండే లోపాలను ఉపయోగించుకొని ఫోన్‌లోకి ప్రవేశిస్తుంది. స్పియర్ ఫిషింగ్, జీరో క్లిక్స్ దాడులవల్ల ఫోన్‌లోకి ప్రవేశించ లేకపోయినా, వైర్‌లెస్ ట్రాన్స్‌ఫర్ ద్వారానైనా ప్రవేశిస్తుంది. దీని బారి నుండి తప్పించుకోవడం సాధ్యం కాదు. ఫోన్ సాఫ్ట్‌వేర్‌ను ఎప్పటికప్పుడు అప్‌డేట్ చేసుకోవడం లేదా ఫోన్ వదిలించుకోవడం తప్ప మరో మార్గం లేదు. 2017లో అహ్మద్ మన్సూర్ ఈ విషయాన్ని బయటికి చెప్పిన తర్వాత, కంపెనీ ఈ ప్రోగ్రాం కొన్ని ఎంపిక చేసిన ప్రభుత్వాలకు, ప్రభుత్వ సంస్థలకు మాత్రమే ఇస్తామని వెల్లడించింది. ఉగ్రవాద, నేర నిరోధక లక్ష్యంగా దీన్ని తయారు చేశామని చెప్పింది. కానీ ఇది నిజం కాదు.

**పెగాసస్ స్పైవేర్ ప్రయోగ ఫలితాలు :**

ఉగ్రవాదానికి, హింసకు వ్యతిరేకంగా వాడి వాటిని నిర్మూలించవచ్చని చెబుతున్న దీనిని కొన్న మెక్సికో ప్రభుత్వం డ్రగ్స్ మాఫియా లార్డ్ ఎల్ షాప్ ను పట్టుకున్నామని తద్వారా డ్రగ్స్ లేకుండా చేశామని చెబుతున్నది. నిజంగానే పెగాసస్ (రెక్కల తెల్ల గుర్రం) ప్రపంచంలోని ఉగ్రవాదాన్ని, హింసను నిర్మూలించే అద్భుత సాధనమని గొప్పలు చెప్పిన మెక్సికో ప్రభుత్వం అవినీతిని ఎండగట్టిన అక్కడి జర్నలిస్టును దీన్ని ఉపయోగించి చంపివేసింది. అలాగే సౌదీ అరేబియా ప్రభుత్వం కూడా అక్కడి జర్నలిస్టు జమాల్ ఖషోగ్గి భార్యపై పెగాసస్ ప్రయోగించి వారి సంభాషణల ఆధారంగా ఆ జర్నలిస్టు కదలికలను పసిగట్టి అతన్ని ముక్కలు ముక్కలుగా నరికి చంపింది. ఇన్నాళ్లు ఇజ్రాయిల్ పట్ల వ్యతిరేక వైఖరి ప్రదర్శించిన దేశాలన్నీ ఇజ్రాయిల్ దగ్గర కొన్న స్పైవేర్ మూలంగా దానికి వత్తాసు పలకటం మొదలుపెట్టాయి. తమ దేశాల్లోని ప్రత్యర్థులను కట్టడి చేయటానికి దేశ ప్రతిష్టను ఇజ్రాయిల్ కాళ్ల దగ్గర పెడుతున్నాయి.

ఇజ్రాయిల్‌కు భారతదేశానికి ఏనాడు కూడా సత్సంబంధాలు లేవు. మొదటి నుండి కూడా పాలస్తీనా పట్ల అది వ్యవహరిస్తున్న తీరు పట్ల భారత్ వ్యతిరేక వైఖరి ప్రదర్శిస్తూ, పాలస్తీనా ప్రజల పోరాటానికి అంతర్జాతీయ వేదికల మీద మద్దతు పలికారు. కానీ బిజెపి ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక ఈ వైఖరిలో మార్పు వచ్చింది. మోడీ, 2017లో ఇజ్రాయెల్ దేశాన్ని సందర్శించిన మొట్టమొదటి భారత ప్రధానిగా చరిత్ర పుటల్లోకి ఎక్కారు. ఆ తర్వాత ఇజ్రాయిల్ అధ్యక్షుడు బెంజమిన్ నెతన్యాహు కూడా భారతదేశాన్ని సందర్శించడం వెనుక ఉన్న మతలబు చీకట్లు క్రమంగా తొలగిపోతున్నవి. ఎన్ఎస్ఒ కంపెనీ తయారు చేసిన పెగాసస్ స్పైవేర్‌తో పాటు ఇతర రక్షణ కొనుగోళ్ళకు సంబంధించి 200 కోట్ల డీల్ కుదుర్చుకుంది. ముఖ్యంగా ఈ పెగాసస్ స్పైవేర్ కోసమే ఇజ్రాయిల్ సందర్శన అని అంతర్జాతీయ మీడియా సంస్థలు వెల్లడిస్తున్నాయి. పాలస్తీనాకు వ్యతిరేకంగా ఇజ్రాయిల్‌కు అనుకూలంగా ఐక్యరాజ్యసమితి మానవహక్కుల సంస్థ పరిశీలక హోదాను పాలస్తీనాకు నిరాకరించడానికి మద్దతు ఇచ్చింది. నమ్మిన మిత్రుడు మోసం చేసినట్టుగా భారత్ వ్యవహరించటం అంతర్జాతీయ పత్రికల విమర్శలకు కారణమైంది. అత్యంత ప్రమాదకర పెగాసస్ స్పైవేర్ అమ్మి మెక్సికో, హంగేరి, పనామా, పోలాండ్, యునైటెడ్, ఎమిరేట్స్ లాంటి దేశాలన్నింటిని తన దారికి తెచ్చుకుంది. ఈ దేశాలన్నీ 2019లో ఐక్యరాజ్యసమితి మానవహక్కుల సంస్థ పరిశీలక హోదాను పాలస్తీనాకు నిరాకరించడానికి ఇజ్రాయిల్‌కు మద్దతుగా వ్యవహరించాయి. ఇన్నాళ్లు పాలస్తీనా పట్ల, అక్కడి ప్రజల పట్ల సానుభూతిని, స్నేహాన్ని ప్రదర్శించిన భారతదేశం పెగాసస్ కోసం ఇజ్రాయిల్ అనుకూల నిర్ణయం తీసుకోవడంతో అంతర్జాతీయ విమర్శలకు దారితీసింది. మరొకవైపు అంతర్జాతీయంగా విదేశీ ప్రభుత్వాలను, అసమ్మతివాదులను, జర్నలిస్టులను, అధికారులను పాలకవర్గాలు లక్ష్యంగా చేసుకోవడానికి ఈ స్పైవేర్ సాధనంగా మారిందని అందుకే ఇజ్రాయిల్ సంస్థ ఎన్ఎస్ఒని బ్లాక్ లిస్టులో పెట్టినట్టు అమెరికా చెప్పింది. దీంతో దేశంలో రాజకీయ దుమారం చెలరేగింది.

**పెగాసస్ ప్రయోగించబడిన వారంతా ఉగ్రవాదులేనా!**

భారతదేశంతో ఏనాడూ సత్సంబంధాలు లేని ఇజ్రాయిల్‌తో ప్రస్తుత భారత ప్రభుత్వం దోస్తీ కట్టింది. తన ప్రత్యర్థులను ఎదుర్కోవడానికి కుట్ర కోణాలను వెతికే ప్రభుత్వం పెగాసస్ స్పైవేర్ రాకతో ఇజ్రాయిల్‌తో చెట్టపట్టాలేసుకొని తిరుగుతున్నది. మోడీ సర్కార్ పెగాసస్ ప్రయోగించిన వారంతా ఉగ్రవాదులేనా? వారిపై ఎందుకు ప్రయోగించారో నిజాలు తెలిస్తే విస్తుపోవాల్సిందే. రాహుల్ గాంధీ (కాంగ్రెస్ పార్టీ), ఎన్నికల వ్యూహకర్త ప్రశాంత్ కిశోర్ (ఇతనిది దాదాపు 5 సార్లు హ్యాక్ అయినట్లు రుజువైంది), అభిషేక్ బెనర్జీ (మమతా బెనర్జీ మేనల్లుడు), ప్రవీణ్ తొగాడియా (2018లో విహెచ్‌పిని వదిలేసి, మోడీ పాలనపై విమర్శలు చేస్తున్నారు), అశ్విని వైష్ణవ్ (కేంద్ర మంత్రి), సిబిఐ మాజీ డైరెక్టర్ అలోక్ వర్మ, సిబిఐ అధికారులు రాకేష్ అస్తానా,

ఏ.కె. శర్మ, మాజీ ఎలక్షన్ కమిషనర్ అశోక్ లవాస (ఇతను 2019లో నరేంద్ర మోడీ, అమిత్ షా మోడల్ కోడ్ అఫ్ కండక్ట్ ఉల్లంఘించారని చెప్పాడు), ఫ్రీలాన్స్ జర్నలిస్ట్ రోహిణీ సింగ్ (జై షా కంపెనీ 16 వేల రెట్ల ఆదాయం ఒక్క సంవత్సరంలో ఎలా వచ్చిందో పరిశోధనాత్మక వ్యాసంలో చెప్పింది), జర్నలిస్టు స్వాతి చతుర్వేది (బిజెపి ఐటీ సెల్ మీద 'ఐ యాం ఏ ట్రోల్' అనే పుస్తకం రాసింది), ఇండియాటుడే జర్నలిస్టు సందీప్, ఇండియన్ ఎక్స్ ప్రెస్ మాజీ అసోసియేట్ ఎడిటర్ (రఫెల్ విమానాల వివాదాల గురించి వ్రాశారు), పై పెగాసస్ ప్రయోగించారు.

2017 నేషనల్ సెక్యూరిటీ కౌన్సిల్ సెక్రటేరియట్ బడ్జెట్లో పదిరెట్లు అంటే ఒక్కసారిగా 33 కోట్ల బడ్జెట్ 333 కోట్లకు చేరిన విషయాన్ని వెల్లడించిన హిందూ జర్నలిస్టు విజేతా సింగ్, సీనియర్ అడ్వకేట్ ప్రశాంత్ భూషణ్‌పై కూడా ఇది ప్రయోగించారు. అలాగే మాజీ సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి రంజన్ గొగోయ్‌పై లైంగిక ఆరోపణలు చేసిన మహిళ కూడా ఈ జాబితాలో ఉంది. ఇక్కడ లైంగిక ఆరోపణలు ఎదుర్కొన్న సుప్రీంకోర్టు చీఫ్ జస్టిస్ రంజన్ గొగోయ్ రాఫెల్ విమానాల కొనుగోలు వివాదాలకు క్లీన్‌చిట్ ఇవ్వడం కొసమెరుపు.

ఇవన్నీ గమనిస్తే ఈ స్పైవేర్ టెర్రరిస్టుల మీద, నేరస్తుల మీద ప్రయోగించబడినట్లు కనిపిస్తుందా? వీళ్ళంతా ఉగ్రవాదులేనా? వీరికి అర్బన్ నక్సలైట్‌లు అని పేరు పెడతారేమో! ఇది పక్కా ప్రణాళికతో తమకు వ్యతిరేకంగా గొంతెత్తిన లేదా తమ అనుచర గణాల నిజాన్ని వెలికితీసిన వారందరిపై ప్రయోగించ బడిందన్నది సత్యం. వీరంతా ప్రభుత్వం దృష్టిలో నేరగాళ్ళు, ఉగ్రవాదులు, దేశద్రోహులు. ప్రభుత్వ, అధికారుల అరాచకాలను ఎండగట్టడమే వీరంతా చేసిన నేరం. ప్రజాపక్షం వహించడం దేశ ద్రోహం. ప్రభుత్వం స్పైవేర్ నిఘా నీడలో చేతికి మట్టి అంటకుండా తమ పని కానిచ్చేస్తుంది. ఇది ప్రజాస్వామ్య స్ఫూర్తికి ప్రజా హక్కులకు విఘాతం కలిగించడమే.

**భారత్‌లో పెగాసస్‌పై విమర్శ:**

ఈ దేశంలో మొట్టమొదటిసారి ప్రజాస్వామ్యపు నాలుగు స్తంభాలైన న్యాయవ్యవస్థ, మీడియా, ఎగ్జిక్యూటివ్‌ల మీద కుట్ర జరిగిందని ప్రెస్ క్లబ్ ఆఫ్ ఇండియా విమర్శించింది. కర్ణాటకలో ఎమ్మెల్యేల మీద ఇది ప్రయోగించడం అక్కడి ప్రభుత్వాన్ని పడగొట్టడానికేనని కాంగ్రెస్ ప్రతినిధి విమర్శించారు. దైనిక్ భాస్కర్ పత్రిక రిపోర్టర్ పత్రిక మొదటి పేజీలో ఈ వార్త ప్రచురించిన కొద్ది రోజులకే దాని ఆఫీస్ మీద ఇన్‌కమ్ టాక్స్ రైడ్ జరిగింది. అల్జీరియా, ఫ్రాన్స్, హంగేరి ఆఖరికి ఇజ్రాయిల్ కూడా పెగాసస్ మీద ఎంక్వయిరీ కమిటీలు వేశారు కానీ ఇండియా ఆ పని చేయలేదు. పైగా విదేశీ మీడియా సంస్థలు, మరికొన్ని దేశాలు కలిసి భారత అభివృద్ధిని అడ్డుకోవడానికి ఇలాంటి ఆరోపణలు చేస్తున్నాయని బిజెపి ప్రభుత్వం, సంఘ్ పరివార్ ఎదురుదాడికి దిగుతున్నాయి.

నిజానికి ప్రభుత్వ నిఘా సంస్థలు ఇలాంటి స్పైవేర్‌లు సాఫ్ట్‌వేర్లు వాడుతూ ఉంటాయి. కానీ ఎవరి మీద ఉపయోగిస్తున్నారు అనేది ముఖ్యం. అసలు ఇది కొన్నారా లేదా అంటే ప్రభుత్వం జవాబు దాటవేస్తున్నది. అది చివరికి కేసు సుప్రీంకోర్టుకి వెళ్లాక రాజ్యసభలో రక్షణ శాఖ సహాయ మంత్రి 'మాకు పెగాసస్‌తో గాని ఎన్ఎస్ఒతో గానీ సంబంధం లేదు. ఇలాంటి లావాదేవీలు పెట్టుకోలేద'ని చెప్పారు. మరి ఇంత మంది భారతీయుల మీద ప్రయోగించింది ఎవరో చెప్పాల్సింది కూడా ప్రభుత్వమే, కానీ ప్రభుత్వం నోరు విప్పటం లేదు. భారత పౌర హక్కులపై దాడి జరిగితే కాపాడాల్సిన ప్రభుత్వం ఉదాసీన వైఖరి అవలంబిస్తున్నది. ప్రజా పాలనలో పారదర్శకంగా వ్యవహరించాల్సిన ప్రభుత్వం ఫాసిస్టు ధోరణితో ప్రజల హక్కులకు భంగం కలిగించే ఒప్పందాలను రహస్యం పేరిట దాచి ఉంచటం అత్యంత సిగ్గు చేటు. పెగాసస్ పై విచారణ జరపాలని ప్రతిపక్షాలు నిలదీస్తుంటే బిజెపి ఇదంతా ప్రతిపక్షాల, విదేశీ పత్రికల కుట్రగా అభివర్ణిస్తున్నారు. ఒకవేళ కుట్ర జరిగితే దానిపై విచారణ చేయాల్సిన పాలక వర్గాలు ఎందుకు ఊరుకుంటున్నారనేది అంతు చిక్కని ప్రశ్న.

కేంద్ర మంత్రులపైనే నిఘా ఉంటే దేశానికి ఎంత ప్రమాదం? దేశ భక్తి అనే పదాన్ని విరివిగా వాడే బిజెపి దేశ ప్రజలపై నిఘా ప్రమాదం పొంచి ఉన్న పరిస్థితిపై విచారణ చేయాలి. భారత ప్రభుత్వం ఈ స్పైవేర్‌ను కొనకపోతే దేశ ప్రజల వ్యక్తిగత జీవితాల మీద నిఘా పెట్టినదెవరు? ఒక వైపు ఇజ్రాయిలీ సంస్థ, ప్రభుత్వం, ప్రభుత్వ సంస్థలకు మాత్రమే అమ్ముతామని, వాటిని ఉగ్రవాద నిర్మూలనకు, హింసకు వ్యతిరేకంగా ఉపయోగిస్తామన్న దేశాలతోనే ఒప్పందాలు చేసుకుంటామని చెబుతున్నది. కానీ, ఎవరెన్ని అరిచినా కేంద్ర ప్రభుత్వం లేదు, కాదు అని మాటల పొదుపు పాటిస్తున్నది. పైగా అలా జరిగితే ప్రజాస్వామ్యానికే ప్రమాదమని కపట సానుభూతి చూపుతున్నది. దీనిపై నిజానిజాలు తేల్చాలని సుప్రీం కోర్టు మెట్లెక్కినా, అది వివరణ అడిగినా వాస్తవాలు చెప్పడం లేదు. అటు ఎన్ఎస్ఒ కూడా సూటిగా సమాధానం చెప్పడం లేదు. కానీ న్యూయార్క్ టైమ్స్ జర్నలిస్టు మాత్రం భారతదేశం కొన్నదని ఘంటాపథంగా చెబుతున్నాడు.

దేశంలో 300 మందికి పైగా మొబైల్ ఫోన్లపై నిఘా ఉంచారంటూ మనోహర్‌లాల్ శర్మ, ఎడిటర్స్ గిల్డ్ సహా పలువురు జర్నలిస్టులు దాఖలు చేసిన వేర్వేరు పిటిషన్లను విచారించిన సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఎన్.వి. రమణ నేతృత్వంలో జస్టిస్ సూర్యకాంత్, జస్టిస్ హిమా కోహ్లిలతో కూడిన ధర్మాసనం అక్టోబర్ 27న 46 పేజీల తీర్పు ఇచ్చింది. ఈ అంశంపై దర్యాప్తునకు నిపుణుల కమిటీని ఏర్పాటు చేస్తున్నట్లు వెల్లడించింది. సుప్రీంకోర్టు ఎంత అడిగినా కేంద్ర ప్రభుత్వం సమాధానం సరిగా ఇవ్వలేదు. ఇచ్చిన సమాధానంతో తృప్తి చెందక సుప్రీంకోర్టు విసిగిపోయి భారత ప్రభుత్వ స్పందన సరిగా లేదని ప్రజాస్వామ్యానికి ప్రమాదంగా పరిణమించే ఇలాంటి నిఘాలు ప్రాథమిక హక్కులకు భంగకరమని సుప్రీంకోర్టు రిటైర్డ్ జడ్జి జస్టిస్ రవీంద్రన్, ప్రొఫెసర్ జోషి, డాక్టర్ సందీప్ ఒబెరాయ్‌లతో కూడిన త్రిసభ్య కమిటీని నియమించింది.

ఈ సందర్భంగా సుప్రీంకోర్టు ఎవరికి వారు స్పైవేర్‌లు వాడుకుంటూ పోతే అవి తీవ్రవాదులకు అస్త్రాలుగా మారే ప్రమాదం ఉందని హెచ్చరించింది. కేంద్రం కనీసం అఫిడవిట్ దాఖలు

చేయడానికి కూడా వెనకాడటం ప్రభుత్వ నిర్లక్ష్యానికి, తప్పించుకొనే ధోరణికి నిదర్శనం. ప్రజాస్వామ్యంలో భావప్రకటన స్వేచ్ఛ, పత్రికా స్వేచ్ఛ ముఖ్యమని సాంకేతికతను దుర్వినియోగం చేసి, ప్రాథమిక హక్కులకు భంగం కలగనీయకూడదని ఈ తీర్పులో సుప్రీంకోర్టు ప్రభుత్వ తీరు పట్ల తీవ్రంగా స్పందించింది. అలాగే రవీంద్రన్ నేతృత్వంలో సైబర్ సెక్యూరిటీ ఫోరెన్సిక్ నిపుణులు ఇతర సాంకేతిక నిపుణులతో ముగ్గురు కమిటీ సభ్యులు నియమించింది వారు డాక్టర్ నవీన్ కుమార్ చౌదరి, ప్రొఫెసర్ డాక్టర్ ప్రభాకరన్, డాక్టర్ అశ్విని అనిల్ గుమస్తే. సుప్రీంకోర్టు నియమించిన సాంకేతిక కమిటీ కొన్ని సూచనలతో పబ్లిక్ నోటీసు జారీ చేసింది. పెగాసస్ కారణంగా ఎవరైనా తమ మొబైల్ హ్యాక్‌కు గురైనట్టు భావిస్తే, బాధితులు జనవరి 7వ తేదీలోగా తమను సంప్రదించాలని సూచించింది. ఆ తరువాత తేదీని సవరించి ఫిబ్రవరికి మార్చింది. తమ ఫోన్ హ్యాక్ అయిందని భావించిన వారు తగిన కారణాన్ని కమిటీ ముందు వెల్లడించాలి. అలాగే తమ డివైస్ ఇవ్వడానికి ఒప్పుకోవాలి, అందించాలి.

**ముగింపు:**

సమాచార యుగంలో సాంకేతికత ముఖ్యమే కానీ ఆ వ్యక్తుల రహస్యాలను తెలుసుకోవడానికి ఉపయోగించే సాంకేతికత అనైతికమైంది. ప్రమాదకరమైంది. దీన్ని సుప్రీంకోర్టు తీవ్రంగా పరిగణించింది. పెగాసస్ అత్యాధునిక నిఘా సాఫ్ట్‌వేర్ గురించి ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల పరిరక్షణ సంస్థ అధిపతి "ప్రజాస్వామ్య వ్యవస్థలో జర్నలిస్టులు, మానవ హక్కుల పరిరక్షకులు మన సమాజంలో అనుపమానమైన సేవలందిస్తున్నారు. అలాంటి వారిని గొంతెత్తకుండా అణిచేయడం వల్ల మనందరం బాధలకు గురవుతామని" హెచ్చరించారు. పెగాసస్ నిఘా సాఫ్ట్‌వేర్ సహాయంతో సీబీఐ అధిపతి అలోక్ వర్మను 2018లో పదవి నుండి తప్పించారు. అలాగే మరో ఇద్దరు సిబిఐ అధికారులు రాకేష్ ఆస్థాన, ఏ కె శర్మలను పదవుల నుంచి తప్పించారు. దేశంలోని అనేక మంది సామాజిక కార్యకర్తలు ఉద్యమకారులు ప్రజల కోసం ఆరాటపడే వారిని, ఖలీల్ ఆచార్య, మాజీ బిబిసి జర్నలిస్ట్ సందీప్ కుమార్ రాయ్ మొదలైనవారిపై అకారణంగా అభియోగాలు మోపి జైలు పాలుచేశారు. ప్రొఫెసర్ కల్బుర్గి, గౌరీ లంకేశ్, గోవింద్ పన్సారే హత్యలకు కారకులైన వారి ఆచూకిని కనుగోనడానికెందుకో ఈ నిఘా వ్యవస్థ పనిచేయదు. ఇదీ పాలక వర్గాల పనితీరు.

అభియోగాలు మోపడానికి పనికి వచ్చే నిఘా వ్యవస్థ, బాధితుల పక్షాన న్యాయం కోసం మాత్రం నిలబడదు. ప్రభుత్వ నిఘా సంస్థలన్నీ ప్రభుత్వం పాలక వర్గాలకు అనుకూలంగా ఉండేలా చేసుకుంటున్నాయి. స్వార్థపూరిత పాలక వర్గాల చేతుల్లో బందీ అయిన నిఘా సంస్థలు, పెగాసస్ లాంటి స్పైవేర్‌లు అన్నీ ప్రజా ప్రయోజనాల భక్షణకే గానీ రక్షణకు మాత్రం కాదని స్పష్టమవుతున్నది. జీవితాంతం ఆదివాసీల సేవ కోసం పరితపించిన ఫాదర్ స్టాన్ లాప్టాపుల్లోకి, కంప్యూటర్లోకి చొరబడి పండు ముసలిని జైల్లో వేసి ప్రాణాలు హరించారు. భీమా కోరేగావ్ సహా అనేక కేసుల్లో మావోయిస్టు పథకరచన అంటూ పాలకులు చూపిస్తున్న ఆధారాల విశ్వసనీయత ప్రశ్నార్థమైనదే. అసలు ప్రభుత్వాలకే పెగాసస్‌ను విక్రయిస్తుంటామని ఎన్ఎస్ఓ చెబుతోంది. అందుకే పౌర స్వేచ్ఛకూ, ప్రాథమిక హక్కులకూ భంగం కలిగించేలా పాలకులు అనుసరిస్తున్న ఈ దొడ్డిదారి సంగతి తేలాల్సిందే. వ్యక్తుల ప్రైవసీకి భంగకరంగా ఈ సాఫ్ట్‌వేర్‌ను వినియోగించినట్లు ప్రభుత్వం అధికారికంగా ఒప్పుకోలేదన్న మాటే కానీ, బయటపడుతున్న కథనాలు ఆ చేదు నిజాన్నే చెబుతున్నాయి. ప్రజల కోసం మాట్లాడుతున్న ప్రతి ఒక్కరిపైన నిఘా పెడుతున్నారు, దీంతో నోరు మెదపడానికి కూడా భయపడే చీకటి రోజులు ముందు ముందు రానున్నాయి. సుప్రీంకోర్టు నియమించిన కమిటీ పెగాసస్ ఉదంతంపై నిఖార్సైన విచారణను చేపట్టాలి. తరుణ్ గోగొయ్ తీర్పు లాంటివి పునరావృతం కాకుండా, ఒత్తిళ్లకు లొంగకుండా కమిటీ సుప్రీంకోర్టు నమ్మకాన్ని, వమ్ము చేయకుండా చూడాలి. అలాగే సుప్రీం కోర్టు పై ప్రజలు పెట్టుకున్న నమ్మకాన్ని నిలబెట్టాలి. కాని పక్షంలో తమ వ్యక్తిగత రహస్యాల రక్షణకై బూటకపు ఆరోపణలకు, ప్రయోగాలకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం నిర్మించాల్సి ఉంటుంది.

*(రచయిత డిటిఎఫ్ రాష్ట్ర కౌన్సిలర్)* వీ

## వచ్చే సంచికలలో...

- రజనీ పామీదత్ 'ఫాసిజం అండ్ సోషన్ రెవల్యూషన్' ముందుమాట అనువాదం - రవీంద్రనాథ్ సూరి
- బెంగాల్‌లో మతతత్వ రాజకీయాలు - కొండూరి వీరయ్య
- కుల అస్తిత్వాన్ని చిత్రించిన నవల 'పుట్టుమచ్చ' - మెంతబోయిన సైదులు
- మంగల్ పాండే - మొదటి పోరాటమా? స్వాతంత్ర్య సమరమా? - డా. సంగిరెడ్డి హనుమంతరెడ్డి
- ఆదివాసుల హత్యలు, అత్యాచారాలు - మరోవైపు గౌరవ దినం - ఏమ్లా వాగాలు
- 'సమతామూర్తి' ఎవరి ప్రయోజనాల కోసం? - సతీష్ బైరెడ్డి

# గాలిలో దీపంలా జీవిత బీమా

*ప్రజల నమ్మకం, ఘనమైన చరిత్ర, విస్తారమైన వనరులు సమకూర్చుకున్న జీవిత బీమా సంస్థను ప్రైవేటు పరం చేయడానికి మొదలవుతున్న కుట్రలను వివరిస్తున్నారు* **చుంచు శ్రీశైలం**

**ఆ**రున్నర దశాబ్దాలుగా పేద, గ్రామీణ, మధ్యతరగతి వర్గాలతో మమేకమై, దేశ ప్రజానీకానికి అత్యంత చేరువైన సంస్థ లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఎల్.ఐ.సి.). ఏనాడూ నష్టాల మాట కూడా వినిపించని కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థ. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకే ఎన్నో సార్లు అప్పులిచ్చి అండగా నిలిచిన చరిత్రను సొంతం చేసుకుంది. బడ్జెట్ కు నిధులు సమకూరుస్తూ దేశ ఆర్థికాభివృద్ధిలో కీలకమైన పాత్ర నిర్వహిస్తూ వస్తున్న ఎల్.ఐ.సి.ని కేంద్ర ప్రభుత్వం అమ్మకానికి పెట్టింది. ప్రైవేటీకరణకు సిద్ధం చేసింది. నీతి కథలో బంగారు గుడ్లు పెడుతున్న బాతు యజమాని అత్యాశకు బలైనట్లుగానే ఎల్.ఐ.సి.ని బలివ్వడానికి రంగం సిద్ధం అయ్యింది. ఆ కథలో అత్యాశ, అమాయకత్వం బాతు మరణానికి కారణమైతే, ఈ కళ్ల ముందరి వాస్తవానికి ప్రజాధనాన్ని ప్రైవేటు వ్యక్తులకు, కార్పోరేట్ శక్తులకు అప్పనంగా దోచిపెట్టాలనే ఆలోచనే కారణం. ప్రతీ క్షణం మీకు తోడుగా అనే ఎల్.ఐ.సి. సూక్తి, ఇక మీద ఆచరణలో ప్రతీ క్షణం మాకు తోడుగా అని మారనుంది. రెండు చేతుల రక్షణ మధ్య ఆరిపోకుండా వెలిగిపోతున్న దీపాన్ని చిహ్నంగా కలిగి ఉన్న ఎల్.ఐ.సి. ఇక మీద ప్రజల నమ్మకంలో నుంచి పుట్టిన ఆ రక్షణను కోల్పోనుంది.

2021-22 ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వ రంగ సంస్థలను అమ్మి 1.75 లక్షల కోట్లను సమీకరించాలని బడ్జెట్లో పెట్టుకున్న లక్ష్యాన్ని ఆ తర్వాత 78 వేల కోట్లకు కుదించుకున్నారు. ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా సాగుతున్న ప్రజాపోరాటాలే ఈ వేగానికి బ్రేకులు వేస్తున్నాయి. 78 వేల కోట్లలోనూ ఇప్పటి వరకు ఎయిరిండియా అమ్మకం ద్వారా 12,300 కోట్లు మాత్రమే పొందినట్లు ప్రభుత్వం వెల్లడించింది. మిగిలిన లక్ష్యాన్ని పూర్తిచేయడానికి, ప్రభుత్వ ద్రవ్యలోటును పూరించుకోవడానికి బలమైన ఆర్థిక శక్తిగా ఉన్న ఎల్.ఐ.సి. మీద కన్నేశారు. సంస్థలో 5 శాతం వాటాను ఉపసంహరించుకోవడం ద్వారా సుమారు 65 వేల కోట్ల రూపాయలు పొందడానికి నిర్ణయించారు. ఈ సంస్థలో వాటాల అమ్మకానికి కేంద్ర క్యాబినెట్ జులైలోనే ఆమోదం తెలిపింది. వాస్తవానికి 2021 బడ్జెట్ ప్రతిపాదనల్లోనే దీనికి మార్గం సుగమం చేసుకున్నారు. ఇనిషియల్ పబ్లిక్ ఆఫర్ (ఐ.పి.ఓ.) చేపట్టడానికి, స్టాక్ ఎక్స్ఛేంజి బోర్డు ఆఫ్ ఇండియా (సెబీ) లో లిస్ట్ చేయడానికి, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అడ్డంకులు లేకుండా ఉండేందుకు ఫైనాన్స్ బిల్లులోనే తగిన అంశాలను పొందుపరిచి ఆమోదించారు. వాస్తవానికి ఇదంతా దేశవ్యాప్త విస్తృత చర్చ, ప్రజాభిప్రాయం, పార్లమెంట్ ఆమోదంతో ఎల్.ఐ.సి. చట్టాన్ని సవరించడం ద్వారా చేయాల్సిన ప్రక్రియ. అంతటి పకడ్బందీ చట్టానికి కూడా దొడ్డిదారిన తూట్లు పొడిచి ఐ.పి.ఓ. కు సిద్ధమయ్యారు. ఇది దాదాపు 40 కోట్ల మంది పాలసీదారులను, దేశ ప్రజలను నయవంచనకు గురిచేయడం తప్ప మరొకటి కాదు.

ఎల్.ఐ.సి. ప్రైవేటీకరణను వేగవంతం చేసి ఈ మార్చి నెల చివరి నాటికి లక్ష్యాన్ని పూర్తిచేయాలన్న ఆర్థిక శాఖ ఆదేశాల మేరకు డిపార్ట్మెంట్ ఆఫ్ ఇన్వెస్ట్మెంట్ అండ్ పబ్లిక్ అస్సెట్ మేనేజ్మెంట్ (డి.ఐ.పి.ఏ.ఎమ్ - దీపం) పరుగులు పెడుతుంది. ఇప్పటికే ఇష్యూ ప్రతిపాదిత పత్రాలను ఫిబ్రవరి 13న సెబీకి సమర్పించారు. ఇందులో కంపెనీ నికర విలువ (ఎంబెడెడ్ వాల్యూ) ను 5.4 లక్షల కోట్లుగా లెక్కించి, పొందుపరచినట్లు దీపం సెక్రటరీ తుహిన్ కాంత పాండే ప్రకటించారు. ఈ విలువ పైనే సంస్థ షేర్లు, బహిరంగ మార్కెట్లో వాటి ధర ఆధారపడి ఉంటాయి. అయితే ప్రైవేట్ రంగానికి ప్రయోజనం కల్పించడానికి ఈ నికర విలువను చాలా తగ్గించి చూపుతున్నారని ఆ సంస్థ ఉద్యోగులు, ఆర్థిక నిపుణులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. అయినా ఈ ఆందోళనలకు, 13 లక్షల మంది ఏజెంట్ల, లక్షకు పైగా ఉన్న ఉద్యోగుల, పాలసీదారుల అభిప్రాయాలకు విరుద్ధంగా ప్రక్రియ పూర్తి కాబోతుంది. ఉద్యోగులు, ఏజెంట్లు, పాలసీదారులకు ధరలో 5 శాతం తగ్గింపుతో, 10 శాతం షేర్లు రిజర్వు చేయడం వంటి ఆకర్షణలతో ప్రలోభాలకు గురిచేస్తుంది.

100 శాతం ప్రభుత్వ వాటాల్లో కేవలం 5 శాతమే ఉపసంహరిస్తున్నామని కేంద్రం చెప్తుంది. అది కూడా ఎల్.ఐ.సి. ఆర్థిక పటిష్టీకరణ కోసమే అని వాదిస్తుంది. క్రమం తప్పకుండా వేల కోట్లల్లో లాభాలను గడిస్తూ, లక్షల కోట్లలో ఆస్తులను కలిగి ఉన్న సంస్థకు వీళ్ళు చేయదలిచిన పటిష్టత ఏంటో, ఎవరికో అర్థం కానిదేం కాదు. గత అనుభవాల దృష్ట్యా ఇది పూర్తిస్థాయి ప్రైవేటీకరణకు మొదటి అడుగుగా భావించాల్సి వస్తుంది. రాబోయే కాలంలో వేయబోయే మరిన్ని అడుగులు ప్రజల నెత్తి మీదనే పడనున్నాయని తెలుసుకోవాలి. పట్టిందల్లా బంగారం లాగా ఉన్న సంస్థ మీద కార్పొరేట్ కన్ను పడడం వల్లనే ఈ ఐ.పి.ఓ. ప్రక్రియ మొదలైందనడంలో సందేహం లేదు. దేశ బీమా రంగంలోకి ప్రైవేట్, విదేశీ పెట్టుబడులకు తలుపులు తెరిచినా, 23 ప్రైవేట్ కంపెనీలు పనిచేస్తున్నా అవేవీ ఎల్.ఐ.సి. దరిదాపుల్లో కూడా నిలువలేకపోతున్నాయి. పాలసీల్లో వాటన్నింటి వాటా కలిపి 30 శాతంగా ఉంటే ఒక్క ఎల్.ఐ.సి. వాటా 70 శాతంగా ఉంది. ఎల్.ఐ.సి. మీద ఉన్న ప్రజల నమ్మకాన్ని, భరోసాను కొల్లగొట్టి, బీమా మార్కెట్‌ను సొంతం చేసుకోవడం ఇప్పట్లో సాధ్యం కాదని వారికి

స్పష్టంగా తెలిసొచ్చింది. దానితో పోటీ పడలేనప్పుడు దానినే సొంతం చేసుకోవాలనే ఆలోచన, ఒత్తిడిల ఫలితమే ప్రస్తుత వాటా ఉపసంహరణ - ఐ.పి.ఓ.

ప్రైవేట్ బీమా కంపెనీలను జాతీయాకరణ చేస్తూ చేసిన చట్టం ప్రకారం 1956 సెప్టెంబర్1న కేవలం 5 కోట్ల మూలధనంతో మొదలైన సంస్థ నేడు 36 లక్షల కోట్ల రూపాయల ఆస్తులతో అతిపెద్ద సంస్థగా ఆవిర్భవించింది. దీని వెనుక ప్రజల నమ్మకమే పెట్టుబడిగా పనిచేసింది. సామాన్య ప్రజల్లో జీవితంలోనూ, జీవిత అంతంలోనూ బీమా ధీమాను కల్గించింది. కుటుంబ అవసరాలకు భరోసాను అందించింది. ప్రభుత్వాలనే ఆర్థికంగా ఆదుకునే స్థాయికి ఎదిగింది. ఎల్.ఐ.సి.కి చెందిన 82 శాతం ఆదాయం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చిన అప్పు రూపాల్లోనే ఉన్నదంటే ప్రభుత్వాలు ఈ సంస్థకు ఎంతగా రుణపడి ఉన్నాయో, ప్రభుత్వాల ఆర్థిక అవసరాలను ఎంతగా తీరుస్తూ వచ్చిందో అర్థమవుతుంది. బీమా రంగాన్ని ప్రైవేటీకరించి, విదేశీ పెట్టుబడులకు అవకాశం కల్పించినా ఎల్.ఐ.సి. ఒక్కటే 70 శాతం వాటాను, ఆదాయంలో 66 శాతం వాటాను కలిగి ఉండడం అసాధారణం. ఇది ప్రజల నమ్మకానికి నిదర్శనం. ఆ నమ్మకాన్ని అమ్మకానికి పెట్టి దోపిడీ వేటలో స్వదేశీ, విదేశీ పెట్టుబడి మధ్య పోటీ పెడుతున్న పాలక - వ్యాపార ముఠా చర్య ముమ్మాటికీ ప్రజాద్రోహమే.

ప్రైవేట్ రంగంలో ఉన్న వడ్డీ వ్యాపారులు, బ్యాంకులు, బీమా కంపెనీలు, పరిశ్రమల దోపిడీ నుండి ప్రజలను రక్షించి, ప్రజా ధనాన్ని తిరిగి ప్రజల కోసమే వెచ్చించాలని ఆనాడు జాతీయం చేయబడ్డ అన్ని రంగాలు ఒక్కొక్కటిగా తిరిగి ప్రైవేట్ పరం చేయబడుతున్నాయి. అంటే శ్రమ దోపిడీకి, ప్రజా ధనాన్ని ప్రైవేట్‌కు అప్పగించడానికి నేటి పాలక వర్గం పోటీ పడుతోంది. జాతీయాకరణ నుంచి ప్రైవేటీకరణకు, స్వదేశీకరణ నుంచి పరాయీకరణకు పరుగులు తీస్తూ తిరోగమన మార్గంలో ప్రయాణిస్తుంది. దేశ సంపదను దోచుకుంటున్న అంబానీ, ఆదానీ వంటి వారు సంపద సృష్టించే వాళ్లుగా, సంపద సృష్టించే కార్మికులు, ఉద్యోగులు, రైతులేమో ఆందోళనా జీవులుగా, దేశానికి భారంగా కన్పిస్తున్నారు. దేశ వనరులు, సంపద పరిరక్షణ కొరకు, ప్రజల హక్కుల కోసం జరిగే పోరాటాలు సమయాన్ని వృథా చేసే వ్యవహారాలుగా ఈ దేశ ప్రధానికి కనపడుతున్నాయి.

వాటాల ఉపసంహరణ పేరుతో ప్రజా సంస్థలను ప్రైవేట్‌కు అప్పగిస్తూ మొదలైన ప్రజావ్యతిరేక విధానాలను, నేడు పాలకవర్గాలు ప్రజా అనుకూల విధానాలుగా మభ్యపెడుతున్నాయి. ప్రైవేట్‌కు అవకాశం కల్పించడం వల్ల పోటీతత్వం పెరిగి, మరింత బలోపేతం కానున్నాయని అబద్ధాలను విస్తృతంగా ప్రచారం చేస్తున్నారు. ప్రైవేటీకరణ ఫలితంగా ప్రభుత్వ టెలికామ్ రంగం, విద్యా రంగం, ఇంకా ఇతర పరిశ్రమలు ఏ స్థితిలో ఉన్నాయో గుర్తుచేసుకుంటే ఆ ప్రచారాలు ఎంతటి ప్రమాదకరమైనవో, మరెంతటి తేనె పూసిన కత్తి వంటి అబద్ధాలో స్పష్టమవుతుంది. మొదట్లో నష్టాల సాకుతో, నిర్వహణా భారం పేరుతో అమ్మకాలు మొదలుపెట్టారు. ఇప్పుడు ప్రజల్లో మమేకమై, సేవా రంగంలో, లాభాల బాటలో తిరుగులేకుండా ఉన్న సంస్థను కూడా అమ్మకానికి పెట్టే స్థాయికి బరితెగించారు. వాస్తవాలను కప్పిపుచ్చుతూ ప్రైవేటీకరణ ఒక సగౌరవ, అత్యవసర, తప్పనిసరి విధానంగా గర్వంగా ప్రకటించే స్థితికి పాలకులు చేరుకున్నారు. జింకలు ఉండేదే పులుల ఆహారం తీర్చడానికి అన్నట్లు, ప్రభుత్వ సంస్థలు పుట్టిందే ప్రైవేట్ కోసం అని నిస్సిగ్గుగా మోడీ చేసిన ప్రకటన ఆ గర్వానికి, బరితెగింపుకు నిదర్శనం.

వలస పాలన స్థానంలో స్వదేశీ పాలకులు అధికారాన్ని చేపట్టిన తొలినాళ్లలో ప్రైవేట్ రంగాలన్నింటిని జాతీయాకరణ చేస్తూ వచ్చారు. ఈ ప్రభుత్వ రంగం ఆవిర్భావం వెనుక దేశ ఆర్థిక రంగాన్ని, ప్రజా సంక్షేమాన్ని మెరుగుపరిచే లక్ష్యాలను ప్రకటించారు. అందులో వలస వాద ఆధిపత్యం నుంచి ఆర్థిక వ్యవస్థను బైట పడేయడం, ప్రజా ధనాన్ని సమీకరించి తిరిగి ప్రజా సంక్షేమానికే ఖర్చు చేయడం, ప్రైవేట్ వ్యక్తుల దోపిడీని నివారించి, సంపద కేంద్రీకరణను నిరోధించడం, అన్ని రంగాల్లో సమాన అవకాశాలు కల్పించి ఆర్థిక, సామాజిక అసమానతలను నిర్మూలించాలనేవి ముఖ్యమైనవి. ఈ లక్ష్యాల సాధనకు దేశ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ రంగానికి ప్రాధాన్యతనిస్తూ మిశ్రమ ఆర్థిక వ్యవస్థను అమలు చేస్తూ వచ్చారు. ఆ లక్ష్యాలు ఎంతమేరకు సాధ్యమయ్యాయో పక్కన పెడితే ప్రస్తుత ప్రభుత్వాలు కార్పొరేట్ల వల్ల ఎన్నిక కాబడి, కార్పొరేట్ల చెప్పుచేతల్లో ఉంటూ కార్పొరేట్ల కొరకే పనిచేస్తూ ప్రజాస్వామ్యానికి సరికొత్త నిర్వచనం ఇస్తున్నాయి.

నిజానికి ప్రభుత్వ రంగ సంస్థలను సొంతం చేసుకోవడానికి బడా వ్యాపారవేత్తలు సమకూర్చే పెట్టుబడి మొత్తం మన ఆర్థిక వ్యవస్థ, ప్రభుత్వ బ్యాంకులు అందిస్తున్నవే. బ్యాంకుల నుంచి పొందిన రుణాలు, ఎగ్గొట్టిన బకాయిలు, పొందిన రాయితీలన్నీ పెట్టుబడులుగా మారి ప్రజా సంస్థలను సొంతం చేసుకుంటున్నాయి. పెట్టుబడిదారులు ఒక్క రూపాయి సొంత పెట్టుబడి లేకుండా దేశ సంపదను పోగేసుకుంటున్నారు. ఇలా పోగు పడిన సొమ్మును ఎన్నికల విరాళాలుగా మార్చి, ప్రభుత్వాలను శాసిస్తున్నారు. పాలక వర్గాలు, వ్యాపార వర్గాలు ముఠాగా ఏర్పడి వాటాలను పంచుకుంటున్నాయి. ఎన్నికల బాండ్ల ద్వారా భారతీయ జనతా పార్టీ అధికారికంగా ప్రకటించిన విలువ ప్రకారమే 4,847.78 కోట్లతో దేశంలో అత్యంత ధనిక పార్టీగా అవతరించడం వెనుక ఈ పంపకాలే కారణమని కొంతమంది ఆర్థిక వేత్తలు చెప్తున్న విషయాన్ని విస్మరించరాదు.

మోడీ అధికారంలోకి వచ్చిన తరువాత ప్రభుత్వ రంగ సంస్థల నుంచి 3,62,766 కోట్ల రూపాయల పెట్టుబడులు ఉపసంహరించుకున్నట్టు లోకసభలో కేంద్ర ఆర్థిక సహాయ మంత్రి భగవత్ కిషన్‌రావ్ కరడ్ ప్రకటించారు. నేషనల్ మానెటైజేషన్ పైప్‌లైన్ కింద దేశ ఆర్థిక రంగంలో అత్యంత కీలకమైన 36 సంస్థలు రాబోయే రోజుల్లో ప్రైవేట్ పరం కానున్నాయి. ఈ విధానాల వల్ల అంబానీ, అదానీలు ప్రపంచ కుబేరుల జాబితాలో పైపైకి ఎగబాకుతుంటే, పేదలు నిరుపేదలుగా మారుతున్నారు. ఆర్థిక అసమానతలు అంతకంతకూ పెరిగిపోతున్నాయి. ఆర్థిక, సామాజిక, రాజకీయ సమానత్వాన్ని, దేశ వనరులు, సంపద మీద ప్రజలందరికీ సమాన హక్కులను వాగ్దానం చేసిన రాజ్యాంగ లక్ష్యాలకు విరుద్ధంగా పాలకులు పనిచేస్తూ దోపిడీకి కొమ్ముకాయడమే కాకుండా అందులో భాగస్వాములు అవుతున్నారు. ప్రజా ధనానికి ఒక ట్రస్టీగా వ్యవహరిస్తూ, చౌకీదార్లుగా ఉండాల్సిన ప్రభుత్వాలు, పాలకులే చోర్‌లుగా మారితే ప్రజాగ్రహానికి తప్పక గురి కావాల్సి వస్తుంది. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# కాషాయ కండువాల పిల్లలకు ఉత్తరం

*కర్నాటకలో హిజాబ్ ధరించిన సహ విద్యార్థుల మీద కాషాయ కండువాలు కప్పకున్న కొందరు విద్యార్థులు జరిపిన దౌర్జన్యాల నేపథ్యంలో వారిని ఉద్దేశించి హితవు పలుకుతున్నారు* **మీనా కందసామి**

ప్రియమైన కాషాయ కండువాల బాల బాలికల్లారా,
నమస్కారం!

మిమ్మల్ని ఎప్పుడూ కలవకపోయినా మీకు ఉత్తరం రాసే చనువు తీసుకుంటున్నాను. మీ వీడియోలు మొదటిసారి చూసినప్పుడు నాకు చాల భయం కలిగిందని మీకు చెప్పకతప్పదు. మనందరి ఉమ్మడి దేశమైన భారతదేశంలో ఇటువంటిది జరుగుతుందని నేను నమ్మలేకపోయాను. నా భయం మీరేదో ప్రమాదకరమైనవాళ్లని కాదు, నా దృష్టిలో మీరింకా చిన్నారి పిల్లలే. కాని అత్యంత విచ్ఛిన్నకర శక్తులు మిమ్మల్ని వాడుకుంటున్నాయని చూసి నాకు భయం వేసింది. నాకు అక్కడికి వచ్చి మిమ్మల్ని కలవాలని, మీతో కలిసి కూచుని మాట్లాడాలని ఉంది. కాని ఈలోగా, మీతో సంభాషించడానికి ఒక ఉత్తరం రాయడమైనా మేలని అనిపించింది.

ప్రియమైన విద్యార్థులారా, నా వయసు ముప్పై ఏడేళ్లు. అంటే మీ వయసుకు రెట్టింపు కన్న ఎక్కువ. మీకు ఉపన్యాసం ఇవ్వడానికి వచ్చిన మరో పెద్ద మనిషిగా నన్ను కొట్టిపారెయ్యరని ఆశిస్తున్నాను. నేనేమీ మీకేదో సలహా ఇవ్వడానికి రాలేదు. నేను చేయదలచినదల్లా మన దేశ చరిత్ర గురించి నాతో పాటు ఆలోచించమని, అనుభూతి చెందమని, పునస్సమీక్షించమని అడగడం మాత్రమే.

మీకు చరిత్ర బోధించినవాళ్లు బ్రిటిష్ వారి గురించీ, వలసవాదం గురించీ, ప్రపంచ యుద్ధాల గురించీ, స్వాతంత్ర్యోద్యమం గురించీ చెప్పే ఉంటారు. నా పాఠశాలలో నేను కూడా అదే చరిత్ర నేర్చుకున్నాను. అయితే కథలో అది ఒక భాగం మాత్రమే. మన నుంచి దూరంగా ఉంచబడిన మరొక చరిత్ర ఉంది. అది భారతదేశంలో విద్య చరిత్ర. ప్రత్యేకించి భారతదేశపు హిందువులలో విద్య చరిత్ర.

అది మొదలైన చోటనే మొదలుపెట్టాలంటే, విద్య అనేది ప్రతి ఒక్కరికీ సంబంధించిన ఉమ్మడి అంశమని హిందూ సమాజం అనుకోనే లేదని గుర్తు పెట్టుకోండి. విద్యా పొందడం ప్రతి ఒక్కరి హక్కు అని హిందూ సమాజం అంగీకరించలేదు. బ్రాహ్మణులూ, ద్విజులూ మాత్రమే విద్య పొందగలిగేవారు. శూద్రులను చదువు నుంచి దూరం పెట్టారు. శూద్రులు వేదాన్ని కనీసం వింటే కూడా వారి చెవుల్లో సీసం కరిగించి పోయాలని మనుస్మృతి ఆదేశించింది. శూద్రులు వేదాలను ఉచ్చరిస్తే వారి నాలుకను కత్తిరించాలని మనుస్మృతి ఆదేశించింది. అయితే బ్రాహ్మణులలో, సవర్ణులలో కూడ అందరూ విద్య నేర్చుకునే అవకాశమేమీ లేదు. స్త్రీలను పూర్తిగా చదువుకు బైటనే ఉంచారు. చివరికి ఒక వంద సంవత్సరాల కింద కూడా, వందమంది స్త్రీలలో ఇద్దరికో, అంతకన్న తక్కువకో మాత్రమే చదువూ రాతా వచ్చేవని జనగణన నివేదికలు మీకు తెలియజెపుతాయి.

కొంత మంది ప్రజలను విద్యకు దూరంగా ఉంచడం, అది కూడా అత్యంత భయానకమైన హింస బెదిరింపులతో వారిని విద్యకు దూరం చేయడం అనేది మన మతపు మూల రహస్యాలలో మిళితమై ఉంది. ఇటువంటి విద్య నిరాకరణకు వ్యతిరేకంగానే మన మహత్తరమైన విప్లవకారులెందరో పోరాడారు. ప్రతి ఒక్కరికీ విద్య ద్వారాలను తెరవడం ద్వారా వారు ఉదాహరణప్రాయంగా నిలిచారు.

మహారాష్ట్రలో సావిత్రీబాయి ఫూలే, జోతీరావు ఫూలే శూద్ర, అతిశూద్ర బాలికల కోసం 1848 లోనే మొట్టమొదటి పాఠశాలను స్థాపించారు. స్త్రీలు విద్య నేర్చుకోవడానికి వీలులేదని నిషేధం విధించిన బ్రాహ్మణీయ పితృస్వామ్యానికి అది ఒక సవాల్. సావిత్రీబాయి ఫూలే తన పాఠశాలలో బోధించడానికి వెళ్తున్నప్పుడు ప్రత్యర్థులు ఆమె మీద పేడ విసిరే వారు. స్త్రీ విద్య అంటే మన సమాజానికి ఎంత వ్యతిరేకతో అది చూపుతుంది. క్రాంతిజ్యోతి సావిత్రీబాయితో పాటు నడిచి, ఆ దాడులను ఎదుర్కొని పాఠశాలకు వెళ్లి బోధించిన మరొక వ్యక్తి ఎవరో మీకు తెలుసా? ఆ వ్యక్తి ఫాతిమా షేక్, ఒక ముస్లిం మహిళా ఉపాధ్యాయురాలు.

కేరళలో మరొక భిన్నమైన కథ ఉంది. మహాత్మా అయ్యంకలి 1904లో వెంగనూరులో దళిత పిల్లల కోసం పాఠశాల ఏర్పాటు చేయడానికి ప్రయత్నించినప్పుడు, అదే రోజు సవర్ణ హిందువులు ఆ పాఠశాలను తగులబెట్టారు. ఆయనే బలరామపురం లోని ఉరుత్తంబలం పాఠశాలలో దళిత బాలిక పంచమిని చేర్చడానికి 1910లో ప్రయత్నించినప్పుడు, హెడ్ మాస్టర్ ఆమెను చేర్చుకోవడానికి నిరాకరించాడు. ఆ పరిణామం దళిత వ్యతిరేక హింసాకాండకు దారి తీసింది. నాయర్లు పులయార్ల ఇళ్లు తగులబెట్టారు. వారి పశువులను ఎత్తుకుపోయారు. దళిత స్త్రీలమీద అత్యాచారాలు చేశారు. దళిత పురుషులను కొట్టారు. దక్షిణ తిరువాన్కూరు లోని పాఠశాలల్లో పులయార్ పిల్లలను చేర్చుకోవడానికి వీలులేదని నాయర్లు అడ్డుకున్నారు. ఈ మూకుమ్మడి నిషేధానికి వ్యతిరేకంగా పోరాడుతూ అయ్యంకలి వ్యవసాయ కూలీల సమ్మెకు పిలుపు ఇచ్చాడు. తన జాతి ప్రజలను నాయర్ల వ్యవసాయ క్షేత్రాల్లో పని మానెయ్యమని అడిగాడు. ఒక్క పులయార్ స్త్రీ చేసే పని చేయడానికి ఆరుగురు నాయర్ పురుషులు అవసరమయ్యారని వార్తాపత్రికల్లో వార్తలు వచ్చాయి. శారీరక శ్రమ

అనేది అగ్రవర్ణాలకు ఎంత తెలియని పనో అది చూపింది. నాయర్లు దిగివచ్చి, ప్రభుత్వ, సాముదాయక పాఠశాలల్లో దళిత పిల్లలు చదువు నేర్చుకోవడానికి ఆమోదించారు.

ఆధునిక భారత పిత, భారత రాజ్యాంగపు ప్రధాన నిర్మాత డా. అంబేద్కర్ ఈ విద్యా హక్కును ఈ దేశపు చట్టంలో ప్రవేశపెట్టారు. మనలో ఏ ఒక్కరి పైనా మన మతం ప్రాతిపదికనో, మన కులం ప్రాతిపదికనో వివక్ష చూపడానికి వీలు లేదని సమానత్వ హక్కు చెపుతుంది.

డా. అంబేద్కర్ మౌలిక భావనల అడుగుజాడల్లో నడుస్తూ తంతై పెరియార్ తమిళనాడులో 1951లో జరిపిన నిరసన ప్రదర్శనలు భారత రాజ్యాంగంలో మొదటి సవరణకు దారి తీశాయి. సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన వర్గాల, లేదా షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల ప్రగతి కోసం రిజర్వేషన్ వంటి సానుకూల చర్యలు తీసుకోవడానికి రాజ్యానికి మొదటి రాజ్యాంగ సవరణ అవకాశం ఇచ్చింది. పెరియార్ మరొక చిరస్మరణీయమైన పోరాటానికి కూడా నాయకత్వం వహించారు. పాఠ్యాంశాలలో వంశ పారంపర్య విద్యను తిరిగి ప్రవేశపెట్టాలనే ప్రయత్నాలను ఆయన అడ్డుకున్నారు. కులకల్వి తిట్టం, వంశ పారంపర్య వృత్తి, కుల వృత్తుల విద్య కొనసాగితే మనందరమూ మన తల్లిదండ్రుల సాంప్రదాయిక వృత్తిని మాత్రమే నేర్చుకోవలసి ఉండేది. అది ఒక చెరసాల లాంటి కట్టుగొయ్య. అది కొనసాగితే భయానక కుల వ్యవస్థ నుంచి బైటపడే అవకాశాన్ని విద్య మనకు ఎప్పటికీ ఇవ్వగలిగేది కాదు.

భారతీయ విద్యకు ఉండిన ఈ బ్రాహ్మణీయ పితృస్వామిక స్వభావాన్ని బద్దలు గొట్టడానికి జరిగిన ఈ పోరాటం, విద్య మనందరికీ చెందినదని మన హక్కును నిలుపుకునే పోరాటం ఇవాళ్టికీ కొనసాగుతూనే ఉంది. విద్యారంగంలో మండల్ కమిషన్ సిఫారసులు అమలు చేయాలనే పోరాటమైనా, వైద్య కళాశాల సీట్లలో వెనుకబడిన కులాల రిజర్వేషన్ అమలు చేయాలనే పోరాటమైనా, నీట్ కు వ్యతిరేక పోరాటమైనా, నూతన విద్యా విధానానికి వ్యతిరేక పోరాటమైనా, రోహిత్ వేముల ఉదంతమైనా, ఫాతిమా లతీఫ్ ఉదంతమైనా మనకు చూపుతున్నదేమంటే ఆ పోరాటం ఇంకా ముగిసిపోలేదు.

భారతదేశంలో ప్రభుత్వ విద్యా రంగం ఉన్నదంటే అణగారిన కులాలకూ, మత మైనారిటీలకూ చెందిన ప్రజలు సమీకృతమై దాని కోసం పోరాడారు గనుక మాత్రమే. విద్యా శిక్షణ, నూత్న భావాల సృష్టి అనేవాటిలో ఏ ఒక్క వ్యక్తినీ పక్కన పెట్టడానికి వీలులేదని వారు పోరాడారు. ప్రభుత్వ విద్యా రంగం అనే భావనకు కచ్చితమైన అర్థం అదే. ఏ ప్రాతిపదికనగానీ ఏ ఒక్కరినీ విద్యకు దూరం చేయగూడదనేదే.

ఇవాళ ఏమి జరుగుతున్నదో మీరు తెలుసుకోవాలనే కోరికతోనే ఇంత సుదీర్ఘమైన, కష్టతరమైన చరిత్రను చెప్పాను. హిజాబ్ ధరించిన ముస్లిం మహిళలకు విద్యారంగపు తలుపులు మూసివెయ్యడమనే పరిణామం నేను పైన చెప్పిన పీడక వ్యవస్థలో భాగమే.

మీతో ఏమేమి చేయించారో చూడండి. మీతో కాషాయ కండువాలు ధరింపజేశారు. మిమ్మల్ని విద్యాలయాలలోకి కవాతు చేయించారు. నేను ఒక హిందూ మహిళగా పుట్టాను. నా జీవితంలో ఇన్ని సంవత్సరాలలో మా ఇంట్లో ఒక కాషాయ కండువా నేనెప్పుడూ చూడలేదు. మా నాన్న ఒకప్పుడు రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ పూర్తి కాలం ప్రచారక్‌గా ఉండేవారు. ఆ సంస్థలో అమలయ్యే మనువాద కుల ఆధిక్యతను, మైనారిటీల పట్ల ద్వేషాన్ని, ప్రాంతీయ భాషల పట్ల ద్వేషాన్ని చూసి ఆయన ఆ సంస్థను వదిలేశారు. పూర్తిగా మెదడు నిండా ఆ భావాలు నింపుకున్న సంఘీ కూడ ఆ ద్వేషాన్ని వదిలే అవకాశం వచ్చినప్పుడు ఎట్లా ప్రవర్తించాడో నా కళ్లారా చూశాను గనుక మీకు రాస్తున్నాను. మీరు కూడ ఒక కొత్త మనిషి కాగలరు. మీరు కూడ ఒక మెరుగైన వ్యక్తి కాగలరు. ద్వేష రాజకీయాలకు మీరు ముగింపు పలకగలరు.

మన దేశంలో విద్యారంగంలో వేలాది సంవత్సరాల పాటు వ్యాపించిన బ్రాహ్మణాధిక్యత మీద మీరు ఎందుకు పోరాడవలసి ఉంది?ఈ వ్యవస్థ పర్యవసానాలు సుదీర్ఘమైనవి, విస్తారమైనవి. మనువాద కులాధిక్య అవగాహన కేవలం బ్రాహ్మణ పురుషుడిని మాత్రమే మేధావిగా చూస్తుంది. అతనికి మాత్రమే విద్య పొందే యోగ్యత ఉందనుకుంటుంది. అతడు మాత్రమే మేధస్సుకూ, ఆలోచనకూ సమర్థుడంటుంది. మిగిలినవాళ్లందరమూ తెలివికీ, విద్యకూ సమర్థత లేనివాళ్లంగా చూసే ఈ కుల వ్యవస్థ మనను ఆలోచన లేని మనుషులుగా, అహేతుకమైన దద్దమ్మలుగా, మందలోని పశువులుగా భావిస్తుంది. మిమ్మల్ని ఈ వ్యవస్థ కాల్బలపు సైనికులుగా భావిస్తుంది. మీరు ఆ కాషాయ కండువాలు వేసుకుని, ఆ కవాతుల్లో పాల్గొన్నప్పుడు, గుర్తుపెట్టుకోండి, మీరు సరిగ్గా ఆ మంద లోని పశువులుగానే ఉన్నారు. స్వతంత్ర ఆలోచనకు శక్తి లేనివారుగానే ఉన్నారు. మానవ సహజమైన స్పందనలు లేనివారుగా ఉన్నారు. ఆధునిక కాలపు హిట్లర్లు ఇచ్చే ఆదేశాలను గుడ్డిగా అనుసరించి కవాతు చేసే మెదడు లేని తెలివితక్కువ దద్దమ్మలుగా ఉన్నారు. మిమ్మల్ని మీరు ఇలా చూసుకోవడం మీ మేధాశక్తికే అవమానం. మీ తాతముత్తాతలు గాని, అమ్మమ్మ నాయనమ్మలు గాని ఈ మిలమిల మెరిసే కండువాలు కప్పుకుని పాఠశాలలకో, కళాశాలలకో వెళ్లడం మీరు ఎప్పుడైనా చూశారా? ఈ కొత్త దుస్తులు పుట్టగొడుగుల్లాగ ఎక్కడినుంచి పుట్టుకొస్తున్నాయి? ఏ ప్రయోగశాలల్లో అవి తయారయ్యాయి?

విద్య అంటే ఒక సమష్టి శిక్షణ, జీవిత పర్యంతం కొనసాగే సహకార, ఆదాన ప్రదాన బంధాలను రూపొందించుకునే కార్యాచరణ. అటువంటి విద్యను పొందే బదులు, మిమ్మల్ని ఈ విచ్ఛిన్నకర శక్తులు కాషాయ కండువాలు మెడలో వేసుకుని, మరొక రకమైన దుస్తులు ధరించే కొందరు విద్యార్థులను వ్యతిరేకించేలా చేస్తున్నాయి. ప్రస్తుతం ఆ వ్యతిరేకించే దుస్తులు హిజాబ్ కావచ్చు, కాని రేపు అది మరేమైనా కావచ్చు. ఈ మతోన్మాద శక్తులు మిమ్మల్ని ఏకాకి జీవితానికి, ద్వేషం నిండిన జీవితానికి కట్టిపడేయడానికి ప్రయత్నిస్తున్నాయి. అక్కడ నేర్చుకునే పాఠాలలో ఏ ఒక్కటీ ఉత్పత్తిదాయకమైనది కాదు, ప్రాముఖ్యత కలిగినది కాదు. అది నిజమైన విద్యకు పూర్తిగా విరుద్ధమైనది.

నా ప్రియమైన చిన్నారులారా, గుర్తుంచుకోండి, ఇంత పెద్ద ఎత్తున ద్వేషాన్ని ఆచరించే సమాజం ఎప్పటికీ తనను తాను ఆరోగ్య

# హిజాబ్ పితృస్వామ్య చిహ్నమేనా?

*హిజాబ్ మత చిహ్నం గనుక విద్యా సంస్థల్లో ధరించగూడదనీ, పితృస్వామ్య చిహ్నం గనుక మహిళా హక్కులకు భంగకరమనీ వస్తున్న వాదనలనుచర్చిస్తున్నారు* **సౌమ్య రాజేంద్రన్**

కర్ణాటక కళాశాలల్లో ముస్లిం అమ్మాయిలు హిజాబ్ ధరించడం మీద ఇప్పుడు కొత్తగా గొడవలు మొదలవడంతో స్త్రీవాద సంస్థల్లో చర్చ ప్రారంభమైంది. స్త్రీలు మర్యాదకరంగా కనిపించడానికి ఒక విధమైన దుస్తులు మాత్రమే ధరించాలనే పద్ధతిని, కొన్ని దేశాలలో సాంఘికపరమైన ఆచారంగా పాటించడమైనా, మరికొన్ని దేశాలలో ప్రభుత్వమే చట్టపరంగా అమలు చేయడమైనా, మనం సమర్థించాలా? ఈ పితృస్వామ్య చిహ్నాలు వదులుకొమ్మని అనేవాళ్లు ఎవరైతే ఏమిటి, అది అంతిమంగా పితృస్వామ్య చిహ్నాలను తొలగించేదే గనుక ఎవరు అడిగినా సరే ఆ పిలుపును స్త్రీవాదులు సమర్థించాలి గదా? అలాగే, హిజాబ్ కూ బుర్ఖా, నిఖాబ్ లాంటివాటికీ తేడా లేదా? అంటే ఆ దుస్తులు స్త్రీల శరీరాన్ని ఎంతవరకు కప్పిఉంచుతాయనే దాన్ని బట్టి స్త్రీవాదుల వైఖరి మారుతుందా?

అసలు నేను మొదట ఈ విషయం గురించి రాయడానికి సంకోచించాను. ఎందుకంటే నేను ముస్లిం మహిళను కాననే కారణంతో పాటు, చిన్నప్పటినుండి ఎటువంటి మతపరమైన పూజలు కానీ సంప్రదాయాన్ని కానీ పాటించిన దాన్ని కాను. నాకు దేవుడి మీద చిన్నప్పుడూ తొలి యవ్వనంలోనూ కొన్ని ప్రశ్నలు ఉండేవి. ఒక సందర్భంలో నేను దేవుడు ఉన్నాడా లేడా చెప్పలేం అనే అజ్ఞేయవాదంలో కూడ ఉన్నాను. మాది అప్పటికే మూడో తరం నాస్తిక కుటుంబం గనుక మా కుటుంబంలో ఎప్పుడూ కూడా ఎలాంటి సంప్రదాయాన్ని పాటించమని చెప్పినవాళ్లు లేరు. అందువల్ల ఒక వ్యక్తి మతాచారాలకు బద్ధులు కావడం ఎంతవరకు అనుకోకుండా జరుగుతుందో, ఎంతవరకు ఇష్టంతో పాటిస్తూ ఉంటారో నేను చెప్పలేను. నా అభిప్రాయంలో అన్ని మతాలూ మనుషులకు ఎటువంటి ఉపయోగం లేనివి. అంతే కాదు, అవి మనుషుల పట్ల అతి క్రూరంగా వ్యవహరించడాన్ని బలపరుస్తాయి. ఏ మతపరమైన పుస్తకంలో, ఎక్కడ ఏమి చెప్పినప్పటికీ జరిగేది అదే.

నేను యూనివర్సిటీ ఆఫ్ ససెక్స్‌లో జెండర్ స్టడీస్ మాస్టర్స్ చదువుతున్నప్పుడు కేంబ్రిడ్జ్‌లో 'జండర్ – స్త్రీవాదాలు' అనే అంశం మీద జరిగిన సదస్సుకు హాజరయ్యే అవకాశం వచ్చింది. అవును, నేను 'స్త్రీవాదాలు' అని  కావాలనే బహువచనంలో రాసాను. ఆ సదస్సుకు ప్రపంచం నలుమూలల నుండి  చాలామంది ఫెమినిస్టులు వచ్చారు. వాళ్లందరూ ఆ సమావేశంలో వాళ్ల ఆశలు, ఆకాంక్షలు, ఎదుర్కొంటున్న సమస్యలు, వాళ్ల  పోరాటాలను ఎలా ముందుకు

---

సమాజమని చెప్పుకోజాలదు. అది సంతోషంగా, సంతృప్తికరంగా, ఆరోగ్యకరంగా ఉన్న ప్రజలతో కూడిన సమాజం కాజాలదు. ఈ విభజన, ద్వేషం అనే మృతప్రాయమైన అడుగుజాడలనే మీరు అనుసరిస్తే మీ ఊహాశక్తి కురచబారుతుంది. మీ భావాలు వక్రీకరణకు గురవుతాయి. ద్వేషం ఎప్పుడైనా ప్రమాదకరమైనదనే అవగాహన పునాది మీదనే ఆత్మగౌరవపు జీవితం మొదలవుతుంది. ఆ ద్వేషం ముస్లింలకు, దళితులకు, ఆదివాసులకు, స్రీలకు, ఎవరికి వ్యతిరేకంగానైనా కావచ్చు. విద్య అనేది మనకు ఇవాళ ఉన్న శక్తి సామర్థ్యాలను అధిగమించి చూసే అవకాశాలను ఇస్తుంది. అందువల్ల పూర్తిగా భిన్నమైనదాన్ని ఊహించండి. ఈ ద్వేష, విభజన శక్తులను నిరాకరించే అవకాశం ఇప్పుడు మనకు ఉంది. మనుషులను పక్కనపెట్టే, దూరం చేసే, పీడించే వ్యవస్థలను యథాతథంగా ఉంచాలనుకునే శక్తులను నిరాకరించే అవకాశం ఇప్పుడు మనకు ఉంది. మనం ఒక కొత్త దాన్ని ఊహించగూడదని కట్టడి చేసే శక్తులను నిరాకరించే అవకాశం ఇప్పుడు మనకు ఉంది. వాళ్లు మనను పాత కు బందీలుగా ఉండాలని ఆశిస్తున్నారు. ఆ జైళ్లను బద్దలు కొడితేనే మీరు మెరుగ్గా ఉండగలరు.

హిజాబ్ ధరిస్తున్న మీ అక్కాచెల్లెళ్లతో పాటు నిలబడండి.

ముస్లిం స్త్రీలు మీకు శత్రువులు అని వాళ్లు మీకు చెపుతున్నారు. ఆ విద్వేష ప్రచారానికి బలి కాకండి. వాళ్లు మీ దృష్టిని మళ్లించాలని చూస్తున్నారు. వాళ్లు ఇవాళ్టి యువతరం ముందు ఉండవలసిన నిజమైన సమస్యల మీద దృష్టి కేంద్రీకరించకుండా పక్కకు తప్పించదలచారు. మన ఆర్థిక వ్యవస్థకు ఏమవుతున్నది? మన భవిష్యత్తు కోసం మనకు ఉద్యోగాలు ఎక్కడ దొరకనున్నాయి? అనేవే ఆ ప్రశ్నలు. నాణ్యమైన విద్య, ఉచిత విద్య, ఉద్యోగాలు, మంచి భవిష్యత్తుకు హామీ అనే మీ హక్కుల కోసం మీరు సంఘటితం కాకుండా మిమ్మల్ని పక్కకు తప్పించే ఈ ప్రయత్నానికి బలి అయి, ఒక దారితప్పిన తరంగా, ఎక్కడా లేకుండా పోయిన తరంగా మిగిలిపోనున్నారా?

గుర్తుంచుకోండి, భవిష్యత్తు కోసం పోరాడకపోతే, యువతరానికి భవిష్యత్తు లేదు.

(మీనా కందసామి సుప్రసిద్ధ కవి, నవలా రచయిత, పరిశోధకురాలు.

ఈ ఉత్తరం https://maktoobmedia.com సౌజన్యంతో)

తీసుకుపోవాలని అనుకుంటున్నారో అవన్నీ చర్చించారు. (అప్పుడు ఆ సమావేశంలో నాకు అత్యంత ఆకర్షణీయమైన విషయం ఏమిటంటే కాథరిన్ మాక్కిన్నన్ ను కలవడం. నేను ఆమె కూర్చున్న గదిలోకి వెళ్లి, మైమరిచిపోయి ఆమె వైపు చూస్తుండిపోయా. ఆమె నా వైపు చూసి నవ్వి పలకరించినప్పుడే ఆ మైమరపు నుంచి తేరుకున్నా.)

ఆ సమావేశానికి పశ్చిమాసియా నుండి కూడా ఫెమినిస్టులు వచ్చారు. వాళ్లలో చాలామంది హిజాబ్ ధరించి ఉన్నారు. వాళ్లు పితృస్వామ్యం గురించి మాత్రమే కాదు, ఇస్లామోఫోబియా (ఇస్లాం పట్ల భయం కలిగించడం) గురించి కూడ మాట్లాడారు. వాళ్ల కుటుంబాలలో, సమాజంలో ఫెమినిస్టు సంభాషణలు జరపడం ఎంత కష్టమో మాట్లాడారు. అదే సమయంలో తమ ఇస్లాం మత అస్తిత్వాన్ని ఒంటరి చేస్తూ, ఇస్లాం పట్ల మిగిలిన ప్రపంచ దేశాలు అంతకంతకూ ఎక్కువగా చూపుతున్న శత్రుత్వం గురించి కూడ మాట్లాడారు. పాశ్చాత్య ప్రపంచంలో జరుగుతున్న ఆ సమావేశంలో వాళ్లు హిజాబ్ ని తమ అస్తిత్వ చిహ్నంగా ధరించారు. ఇతర సంస్కృతుల ఫెమినిస్టుల తరపున మాట్లాడుతున్నామని తెల్లజాతి ఫెమినిస్టులు అనుకోగూడదని నొక్కి చెప్పారు.

అప్పుడు వాళ్లు మాట్లాడుతున్నది నాకు అర్థమైనప్పటికీ, ఆ సమయంలో వాటిలో కొన్నిటి పట్ల నాకు అభ్యంతరం ఉండింది. ఎన్నో ఇస్లామిక్ సమాజాలలో హిజాబ్ ధరించడం నిర్బంధం అయినప్పుడు, తాము ఇష్టపూర్వకంగానే ధరిస్తున్నామని చెపుతూ, ఆ నిర్బంధాన్ని అంగీకరిస్తూ, ఆ విషయాన్ని వాళ్లు ఎందుకు పలచబారుస్తున్నారని నాకు అనిపించింది. కాని ఏళ్లు గడిచాక, ఇంకా ఎక్కువగా చదివాక, ఎక్కువమందిని విన్నాక, నా అభిప్రాయాలు ఆ 21 ఏళ్ల వయసులో ఉన్న అభిప్రాయాల కన్న చాల మారాయి.

హిజాబ్ ధరించడం మీద ఇప్పుడు ముఖ్యంగా రెండు అభ్యంతరాలు వినబడుతున్నాయి. మొదటిది హిజాబ్ ఒక మతచిహ్నం కాబట్టి బహిరంగ స్థలాలలో, విద్యా సంస్థలలో, అటువంటి చోట్ల దాన్ని ధరించడాన్ని నిరుత్సాహపరచాలనేది. రెండో అభ్యంతరం అది పితృస్వామ్యానికి చిహ్నం కాబట్టి, స్త్రీల హక్కులను హరించేది కాబట్టి దాన్ని వ్యతిరేకించాలనేది.

అయితే మనం మొదటి కారణం మూలంగా హిజాబ్ ను నిషేధించాలనుకుంటే, మరి అన్ని మత చిహ్నాల పట్ల అదే వైఖరి అవలంబించాలి. మనదేశంలో, అనేక విశ్వాసాలను పాటించే ప్రజలు ఉన్న చోట, కత్తి నుంచి తలపాగా వరకు అనేక రకాల మతాల, కులాల చిహ్నాలను బహిరంగంగా ప్రదర్శించే చోట అది సాధ్యమేనా? ఏ మతానికి చెందిన చిహ్నాన్ని అనుమతించవచ్చునో, ఏ మతానికి చెందినదాన్ని అనుమతించగూడదో ఎట్లా నిర్ణయించగలం? ఒకవేళ మనం మతానికి సంబంధం లేకుండా అందరూ ఒకే రకమైన దుస్తులు ధరించాలి అని అంటే, ఏ మతానికి చెందిన చిహ్నాలు ఉండకూడదని అంటున్నామా లేక అధిక సంఖ్యాకుల మత చిహ్నాలను సాధారణీకరించి, ఆమోదించి, అనుసరిస్తున్నాం గనుక అవి ఉండవచ్చునంటున్నామా?

ఇక మనకు రెండో కారణం సరైనదిగా అనిపిస్తే, ఇస్లాం మతాన్ని అన్ని దేశాలలో అన్నిచోట్ల ఒకే విధంగా వ్యాఖ్యానించి ఒకే పద్ధతులు పాటిస్తున్నారని అనుకుంటున్నామన్నమాట. కాని ప్రపంచం మొత్తం మీద దాదాపు 200 కోట్ల మంది ముస్లింలు ఉన్నారు. సౌదీ అరేబియాలో అనుసరించే ఇస్లాం, టర్కీలో అనుసరించే ఇస్లాం ఒకటి కాదు. బంగ్లాదేశ్ లో అనుసరించే ఇస్లాం, ఆఫ్రికన్ దేశాల్లో పాటించే ఇస్లాం ఒకటి కాదు. మనదేశంలో తమిళనాడులో ముస్లింల పద్ధతి వేరు, కశ్మీర్ ముస్లింల పద్ధతి వేరు. తిరునల్వేలిలో ఉండే క్రైస్తవులకూ, ఐర్లాండ్ లో ఉండే క్రైస్తవులకూ ఒకే రకమైన విశ్వాసాలూ, సాంస్కృతిక ఆచరణలూ, రాజకీయ అభిప్రాయాలూ ఉంటాయని ఎవరూ భావించరు. కాని ముస్లింలు మాత్రం ఏకశిలా సదృశంగా ప్రపంచమంతటా ఒక్కలాగే ఉంటారని మనలో చాలమందిమి భావిస్తాం. ఇది ఇస్లాం మతం పట్ల ప్రజలలో తెలిసీ తెలియకుండానే ఉండే వ్యతిరేక భావనకు ఒక నిదర్శనం. మనం కోరుకున్నా కోరుకోకపోయినా, ఇస్లాం అనగానే అభివృద్ధి నిరోధక భావాలూ, అతివాద వైఖరీ, హింసలతో సమానం చేస్తాం.

కొన్ని ఇస్లామిక్ సమాజాలలో హిజాబ్, నిఖాబ్, బుర్ఖా ధరించడం చట్టబద్ధంగా తప్పనిసరి. ధరించనివాళ్లు భయంకరమైన శిక్షలకు గురి అవుతారు. ఇతర ఇస్లామిక్ సమాజాలలో, అలాంటి చట్టం ఏదీ లేకపోయినా కుటుంబ కట్టుబాట్ల వల్ల, సామాజిక ఒత్తిడివల్ల ధరించవలసిన వస్తుంది. మరికొన్ని సమాజాల్లో, అరుదుగానే అయినప్పటికీ, ధరించాలో కూడదో ఎంచుకునే అవకాశం నిజంగానే స్త్రీలకు ఉంటుంది.

ఒకసారి ఒక ముస్లిం స్నేహితురాలు చాలా రోజుల తర్వాత ఆశ్చర్యంగా అకస్మాత్తుగా హిజాబ్ ధరించడం మొదలు పెట్టింది. ఆమె ఇప్పుడు యూరప్‌లో ఉంటున్నది. నాకు కాలేజిలో స్నేహితురాలు. ఎంత అకస్మాత్తుగా హిజాబ్ ధరించడం మొదలు పెట్టిందో అంతే అకస్మాత్తుగా మానేసింది. మేము ఆమె కాలేజిలో హిజాబ్ ధరించగా ఎప్పుడూ చూడలేదు. అసలు ఆమె కుటుంబం లోనే ఎవరూ ఎప్పుడూ హిజాబ్ ధరించలేదు. పోనీ హిజాబ్ ధరించడానికి భర్త బలవంతం ఏమన్నా ఉందా అంటే నాకు తెలిసినంతవరకు ఆమె భర్త కూడా స్వేచ్ఛా భావాలకి విలువనిచ్చే మనిషి. చాలా రోజుల తర్వాత ఆమెను ఈ విషయం గురించి అడిగాను. ఆమె రెండు కారణాలు చెప్పింది. మొదటిది, ఇస్లాం ను కాన్సర్ లా భావిస్తున్న సమాజంలో తాను హిజాబ్ నే తన అస్తిత్వంగా నొక్కి చెప్పదలచుకున్నానని. రెండవది, తానిప్పుడు ఉన్న సమాజంలో స్త్రీ అంటే "పొందికగా", "ముస్తాబుతో" ఉండాలనే ఒత్తిడి చాల ఎక్కువగా ఉందనీ, అందువల్ల తాను ఆహార్యంలో కోల్పోతున్న సాధారణత్వాన్ని జీవనవిధానంగా ఎంచుకోదలచుకున్నానని. అయితే తాను హిజాబ్ ధరించడాన్ని తన భర్త కూడా ఇబ్బందికరంగా భావించాడని, తానే ఆమెను అలా ఒత్తిడి చేస్తున్నానని అందరూ అనుకుంటారేమో అని భావించాడని ఆమె చెప్పింది. తనను ఆలోచింపజేస్తున్న ప్రశ్నలకు జవాబు దొరికి ప్రశాంతత చేకూరగానే ఆమె హిజాబ్ ధరించడం మానేసింది.

భారతదేశంలో నివసించే, ఉదారవాద కుటుంబాలకు చెందని ముస్లిం స్త్రీల పరిస్థితి ఏమిటి? అటువంటి ఎంపిక చేసుకోవడానికి

వాళ్లకు ఉన్న స్వేచ్ఛ ఎంత? అనే ప్రశ్నలు తప్పనిసరిగా తలెత్తుతాయి. కాని ఇక్కడే మనం ఏమి అడగాలని నేననుకుంటానంటే ఆ స్త్రీలకు ఉన్న తక్షణ ప్రమాదం ఏమిటి అని. భారతదేశం లోని స్త్రీలందరూ అన్ని సంస్కృతులలోనూ తమ ఇంటా బయటా ఎదుర్కొంటున్న తరతరాల పితృస్వామ్యమా, లేక, బహిరంగ జీవితం నుంచి వారి మత అస్తిత్వాన్ని చెరిపివేయడానికి బలమైన రాజకీయ మద్దతుతో వేగంగా జరుగుతున్న ప్రయత్నమా, ఏది తక్షణ ప్రమాదం?

అసలు ఇప్పుడు హిజాబ్ కు వ్యతిరేకంగా సాగుతున్న హిందూత్వ ప్రచారానికీ మహిళా హక్కులకూ ఎటువంటి సంబంధం లేదు. అది కేవలం ముస్లిం లను ఒంటరులను చేసి, వారి పట్ల వ్యతిరేకతను రెచ్చగొట్టడం, వారిని వెనుకబడినవారిగా, అభివృద్ధి నిరోధకులుగా ప్రచారం చేయడం మాత్రమే. మరి ఈ హిందూ వైతాళికులు సుల్లీ డీల్స్ గురించీ, బుల్లీ బాయ్స్ గురించీ పెదవి విప్పరు. ముక్కుపచ్చలారని ముస్లిం బాలిక మీద అత్యాచారాన్ని కూడ సమర్థిస్తారు, కాని హిజాబ్‌కు వ్యతిరేకంగా మాత్రం పోరాడతారు. ఎందుకంటే, వాళ్ల దృష్టిలో వాళ్లు ద్వేషిస్తున్న మతానికి చిహ్నంగా కనబడుతున్నదది. వాళ్లు దాన్ని వ్యతిరేకించడం అది పితృస్వామ్య చిహ్నమనే కారణంతో కాదు.

హిజాబ్ పట్ల తమ వ్యక్తిగత అభిప్రాయం ఏమైనప్పటికీ, ఇప్పుడున్న పరిస్థితుల్లో ముస్లిం మహిళలు ఏమి చేయాలి? అవతలివాళ్ల ఆదేశాలకు తల ఒగ్గాలా, తమ అస్తిత్వాన్ని నొక్కిచెప్పాలా? ఈ పరిస్థితిలో చిక్కుకోవడం అంత అసూయపడవలసినదేమీ కాదు. నిజానికి వారు ఆ స్థితిలో పడినందుకు ఒక బహుళ సంస్కృతుల సమాజంగా మనందరం మన వైఫల్యాన్ని గుర్తించి సిగ్గుతో తల వంచుకోవాలి. ఇంకొక వాదన కూడ ఉంది. ఇది మత ద్వేషం నుంచి వచ్చినదైనప్పటికీ, దీన్ని పితృస్వామ్యం మీద విజయంగా గుర్తించాలట. కాని హిందూమతంతో సహా ఇతర మతాలలో ఉన్న అటువంటి లెక్కలేనన్ని పితృస్వామిక ఆచారాల మీద అటువంటి నిషేధాలు లేవని మనకు కచ్చితంగా తెలిసినప్పుడు, ఆ వాదన ఎలా చేయగలం? తమ మొత్తం సమూహాన్ని ప్రతిరోజూ పరాయీకరణకు గురి చేస్తున్న సందర్భంలో ముస్లిం స్త్రీలు ఈ విజయం పట్ల మాత్రం సంతోషించాలని మనం ఎలా ఆశించగలం? స్త్రీల అస్తిత్వాన్నే కొల్లగొడుతున్న ఈ సందర్భాన్ని స్త్రీవాద విజయంగా ఎలా ఉత్సవం చేసుకోగలం?

ఒక చివరి అంశంతో నేను ఈ వ్యాసాన్ని ముగిస్తాను. స్త్రీవాద ఎంపికలకూ (అవి కూడ ఒక సంస్కృతి నుంచి మరొక సంస్కృతికి మారిపోతూ ఉంటాయని నేను మరొకసారి చెప్పదలచాను), స్త్రీల హక్కులకూ మధ్య తేడా ఉంది. పద్దెనిమిదేళ్లకే, ఆర్థికంగా స్వాతంత్ర్యం లేకుండానే లేచిపోవడం స్త్రీవాద ఎంపిక కాదు. అది ఒకరకంగా చిన్నవయసులో ప్రసవానికి కూడ దారి తీయవచ్చు. కాని అలా చేయడం స్త్రీ హక్కు కిందికి వస్తుందా? తప్పనిసరిగా. ఆ యువతి తన హక్కును నిలబెట్టుకోవడానికి స్త్రీవాదులు పోరాడవలసి ఉంటుంది కూడ.

స్త్రీవాద పోరాటమనేది స్త్రీవాదులందరూ తమ హక్కులు సాధించుకోవడానికి చేసేది కాదు, అది స్త్రీలందరూ, అణగారిన అస్తిత్వాల ప్రజలందరూ తమ హక్కులు సాధించుకోవడానికి చేసేది.

స్త్రీవాదంలో కేంద్ర స్థానంలో ఉండేది లోలోపలి నుంచి జరిగే విమోచన. దాని అర్థమేమంటే, వాళ్లంతట వాళ్లు అక్కడికి చేరకుండా, ఏ ఒక్కరినీ నేను బలవంతపెట్టి 'విముక్తి' చేయలేను. అలాగే, విముక్తి కావడం అంటే ఏమిటో నా అభిప్రాయాన్ని ఇతర స్త్రీలమీద రుద్దలేను. కాకపోతే విముక్తి గురించి నా అభిప్రాయాలను వాళ్లతో చర్చించగలను, సంవాదం చేయగలను, పంచుకోగలను. కాని నేను నా జీవితంలో ఏమి చేస్తున్నానో అదే అనుసరించమని వాళ్ల మీద ఒత్తిడి చేయలేను. ఆ పని ఎప్పుడూ ఎందుకు చేయనంటే, విముక్తి గురించి నా సొంత అభిప్రాయాలే కాలాన్ని బట్టి మారుతూ ఉంటాయి.

ముగింపుగా, ప్రస్తుత పరిస్థితులలో హిజాబ్ పట్ల స్త్రీవాద వైఖరి ఎలా ఉండాలని నేననుకుంటానంటే:

ఏ సమాజంలో హిజాబ్ ధరించనందుకు మహిళలను రాజ్యం శిక్షిస్తున్నదో, అక్కడ స్త్రీవాదులు ఆ రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడాలి.

ఏ సమాజంలో హిజాబ్ ధరించినందుకు రాజ్యం మహిళలను శిక్షిస్తున్నదో అక్కడ స్త్రీవాదులు ఆ రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడాలి.

ఏ సమాజంలోనైతే, మహిళలు హిజాబ్ ధరించనందుకు రాజ్యం శిక్ష విధించనప్పటికీ, కుటుంబాలు, మత సంస్థలు శిక్షలు విధిస్తాయో, అక్కడ స్త్రీవాదులు ఈ సమస్య ఇతర మతాలవారు చేస్తున్న పోరాటాల కంటె భిన్నమైనది కాదని గుర్తించాలి. అంటే విద్యాహక్కు కోసం, ఆస్తి హక్కు కోసం, పునరుత్పత్తి స్వేచ్ఛ కోసం జరిగే పోరాటాల కంటె భిన్నమైనది కాదని గుర్తించాలి. అది "ముస్లి" సమస్య కాదు, ఒక "అభివృద్ధి నిరోధక" విశ్వాసపు సమస్య కాదు. అక్కడ స్త్రీవాదులు సంఘీభావాన్ని నిర్మించాలి. వారి పోరాటానికి తాను నాయకత్వం వహించడం కాకుండా ఆ పోరాటానికి తాను ఎలా దోహదం చేయగలనో ఆలోచించాలి.

ఏ సమాజంలోనైతే, మహిళలు హిజాబ్ వేసుకున్నందుకు ప్రభుత్వం శిక్షించకపోయినా, కుటుంబం గాని, మత సంస్థలు గాని జోక్యం చేసుకోకపోయినా, స్త్రీవాదులు దాన్ని వ్యక్తిగత ఎంపికగా అంగీకరించాలి.

స్త్రీవాదం లోపలనే ఈ భిన్నమైన వైఖరులు తీసుకోవడం కపటత్వమని అనిపిస్తుందా? ఎంతమాత్రమూ కాదు. ప్రపంచ జనాభాలో యాభై శాతంగా ఉన్న స్త్రీలలో అన్ని స్త్రీవాదాలకూ ఒకే పద్ధతి సరిపోదు. అందువల్లనే నేను నా ఇరవై ఒకటో ఏట పాల్గొన్న సమావేశం ''స్త్రీవాదాలు' అని బహువచనంలో ఉంది. ఇన్ని సంవత్సరాలలో స్త్రీవాది కావడమంటే ఏమిటో నా సొంత అవగాహనే చాల మారింది. భవిష్యత్తులో కూడ మారుతుంది.

https://www.thenewsminute.com/article/hijab-patriarchal-why-wrong-debate-be-having-now-160779

(తెలుగు: రాణి నిడదవోలు) వీ

# మహిళలు - వస్త్రధారణ

*వస్త్రధారణకు వాతావరణం, వృత్తి అనే భౌతిక కారణాలతో పాటు భావజాల కారణాలు కూడా ఉన్నాయని, వాటికి ప్రాధాన్యత తొలగించాలని అంటున్నారు* **జి. చంద్రకళ**

కర్ణాటక రాష్ట్రంలో హిజాబ్ ధరించిన విద్యార్థినులను తరగతులకు అనుమతించకపోవడం, అది క్రమంగా మత విద్వేషాలు రగిలించే సమస్యగా మారి కోర్టు వరకు వెళ్లడం తెలిసిన విషయమే. ఇందులో మహిళల వస్త్రధారణను మతపరమైన భావజాలానికి ముడిపెట్టి సమస్యగా చిత్రించడం, విద్యార్థినులను విద్యార్జనకు దూరం చేయడం సరి అయిన చర్య కాదని విజ్ఞత కలిగినవారికి ఎవరికైనా అర్థమవుతుంది. అసలే బేటీ బచావో బేటీ పడావో స్థితిలో ఉన్న సమాజం ఇది. ఈ చర్యతో అది మరింత వెనకబడి పోతుంది. చదువు, మనుగడ ప్రశ్నార్థకమయ్యే పరిస్థితి కనబడుతోంది.

మత విశ్వాసాలకు కేంద్రమైన దేవాలయాలు, చర్చ్, మసీదు, ధార్మిక సంస్థలు వంటి చోట్ల స్త్రీల పట్ల వివక్ష, ఆంక్షలు ఉండటం, వాటికి వ్యతిరేకంగా స్త్రీలు పోరాటం చేయటం, న్యాయస్థానాల వరకు వెళ్లడం కూడా కొత్త విషయమేమీ కాదు. కానీ ప్రజాస్వామ్యబద్ధంగా ఉంటూ లౌకిక భావన పెంపొందించ వలసిన విద్యాసంస్థల్లో కూడా స్త్రీల వేషధారణ సమస్యగా మారడం శోచనీయం. విద్యార్థినులు హిజాబ్ కావాలో, చదువు కావాలో తేల్చుకోమనే ఒత్తిడికి గురికావడం నాగరికంగా వెనుకబాటుతనమే.

ఇతరులకు నష్టం కలిగించనంతవరకు ఎవరికి నచ్చినట్టుగా వారు జీవించడం ప్రతి ఒక్కరి ప్రాథమిక హక్కు. విభిన్న మతాలకు నిలయమైన భారతదేశంలో ఎవరి మత విశ్వాసాలు వారు కొనసాగించేందుకు రాజ్యాంగం తగిన ఏర్పాట్లను కలిగించింది. అయితే ఏ మతంలోనైనా స్త్రీల పరిస్థితి పురుషులతో సమానంగా లేదు. స్త్రీల చుట్టూ ఆచారాలు, పద్ధతులు, కట్టుబాట్లు, సంస్కృతి పేరుతో ఎన్నో ఆంక్షలను విధించి వారి స్వేచ్ఛకు పరిమితులను విధించడం, స్వతంత్రంగా వ్యవహరించే పరిస్థితులను లేకుండా చేయడం చారిత్రక సత్యం. అందులో స్త్రీల వస్త్రధారణ ఎంతో ప్రాముఖ్యత కలిగిన అంశం.

వ్యక్తుల వస్త్రధారణ వారి సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. మహిళలు ఇందుకు భిన్నమేమీ కాదు. ఏ వ్యక్తి వస్త్రధారణ అయినా ప్రధానంగా మూడు అంశాలపై ఆధారపడి ఉంటుంది. మొదటిది వారు నివసించే భౌగోళిక వాతావరణ పరిస్థితులు. రెండవది జీవనోపాధికై చేస్తున్న వృత్తి. మూడవది వారు అనుసరించే మతం. ఇందులో మొదటి రెండు భౌతిక అంశాలపై ఆధారపడితే మూడవది భావజాల పరమైన అంశంపై ఆధారపడి ఉంటుంది. ఏ మతానికి చెందిన స్త్రీలైనా ఆయా మత సంబంధమైన భావజాలానికి అనుకూలంగానే తెలిసి గాని, తెలియక గాని కొనసాగించడం నేటికీ జరుగుతూనే ఉన్నది. అయితే ఇది పురుషాధిపత్య భావజాలాన్ని కొనసాగించడానికి రూపొందించిన అనేక అంశాలలో ఒకటిగా గుర్తించడం ప్రధానమైన అంశంగా చెప్పవచ్చు. స్త్రీలు అలంకార ప్రియులు అనే ముద్ర వేయడం కూడా అందులో భాగమనే చెప్పవచ్చు.

వస్త్రధారణలో ప్రాథమికమైన భౌతిక అంశాలను పక్కకునెట్టి, భావజాల పరమైన అంశాలకు ప్రాధాన్యతనీయడం శోచనీయం. స్త్రీలు తమకు అనుకూలమైన, నచ్చిన వస్త్రధారణను కలిగి ఉండటం వారి ప్రాథమిక హక్కు. ఏది ధరించాలో, ఏది ధరించకూడదో నిర్ణయించుకునే స్వేచ్ఛ స్త్రీలకు ఉండాలి. అయితే వస్త్రధారణ ఎంపికలో ఏ మతానికి చెందిన స్త్రీలైనా, ఎంతటి విద్యావంతులైనా, ఎంతటి ఉన్నత స్థానంలో ఉన్నా, ఆ మతం నిర్ణయించిన విధానాలకు లోబడి తమ ఆలోచనలను పరిమితం చేసుకోవడం దురదృష్టకరం. కొన్నిసార్లు చేసే పనికి అనుకూలంగా భిన్నమైన వస్త్రాలను ధరించి వేషధారణలో సొంత నిర్ణయం కలిగినట్లుగా కనిపించినా అది చాలా పరిమితంగా, అంటే కట్టేసిన తాడు మేరకే పశువు స్వేచ్ఛ కలిగి ఉన్నట్టు స్త్రీలు కూడా అంతే పరిమితమైన స్వేచ్ఛను పొందుతున్నారు. వస్త్రధారణ విషయంలో ఎప్పుడైతే సంస్కృతి పరిరక్షణ పేరుతోనో, మత నిబంధనల పేరుతోనో జరిగే మానసిక, భౌతిక దాడులను నిలిపి వేయగలుగుతామో, అందుకు అనుకూలమైన చట్టాలు అమలు చేయ గలుగుతామో అప్పుడే నిజమైన స్వేచ్ఛ లభించినట్టు. స్త్రీల వస్త్రధారణ వారి ఇష్ట ప్రకారమే, వారే నిర్ణయించుకోగలిగే స్వేచ్ఛను, దానిని ఆమోదించి, ఆచరించే ఉన్నత సంస్కారం కలిగిన వ్యక్తులు గల ఉత్తమ సమాజాన్ని నిర్మించుకునే దిశగా ప్రతి వ్యక్తి ప్రయత్నించాలి. వస్త్రధారణ విషయంలో సిద్ధాంతాల, విశ్వాసాల ప్రసక్తి అనవసరం.

*(రచయిత అధ్యాపకులు)* వీ

# భారత చరిత్రకు సంఘ పరివార్ వికృతీకరణ

*సంఘ్ పరివార్ నాయకత్వంలో విపరీతంగా జరుగుతున్న భారత చరిత్ర వక్రీకరణకు సంబంధించిన అసంగతాలనూ, మౌలిక విషయాలనూ చర్చిస్తున్నారు* **ఇర్ఫాన్ హబీబ్**

(న్యూ సోషలిస్ట్ ఇనిషియేటివ్ (ఎన్ఎస్ఐ) నిర్వహిస్తున్న డెమోక్రసీ డైలాగ్స్ అనే ఉపన్యాస పరంపరలో సుప్రసిద్ధ చరిత్రకారుడు ప్రొ. ఇర్ఫాన్ హబీబ్ జనవరి 30, 2022న చేసిన ఉపన్యాసం 'డాక్టర్డ్ హిస్టరీ ఫ్రం ఏన్షియెంట్ టైమ్స్ టిల్ టుడే' కు ఎం కె సుధీర్ (ఎన్ ఎస్ ఐ కర్నాటక) రూపొందించిన అక్షర రూపానికి అనువాదం. ఇర్ఫాన్ హబీబ్ ఉపన్యాసాన్ని https://www.youtube.com/watch?v=jxUNXT-WpaQ మీద వినవచ్చు)

**భా**రతదేశంలో చారిత్రక సంప్రదాయం చాల పాతది. సంస్కృతంలోని హర్ష చరిత్ర, రాజతరంగిణిల నుంచి పర్షియన్‌లోని వృత్తాంతాలూ, సమాచార నమోదులూ, ఐన్ ఇ అక్బరీ లాంటి పాలన మీద పుస్తకాలూ, ఆ తర్వాత వలస కాలంలోనూ కూడా ఇది కొనసాగింది. ప్రధానంగా కచ్చితత్వం పట్ల, యథార్థమైన వాస్తవాల పట్ల పట్టింపుతో వాటిని అధ్యయనం చేయడం జరిగింది. ఆ కాలపు భారత చరిత్రను పునర్నిర్మించడానికి మనం ఆ వాచకాలను ఉపయోగించవచ్చు. కాని ఇప్పుడు జరుగుతున్నదాన్ని చరిత్ర వక్రీకరణ, వికృతీకరణ అనడం సబబు. ఇది వాస్తవాలలో ఎటువంటి ప్రాతిపదిక లేని చరిత్ర.

నేను జాతి సిద్ధాంతం అనే అంశంతో మొదలుపెడతాను. దాన్ని ప్రపంచమంతటా వదిలేశారు. కాని అధికారిక భారత చరిత్ర రచనకు సంబంధించినంతవరకు అదే చలామణీలో ఉన్న సిద్ధాంతంగా ఉంది. ఉదాహరణకు బాచిలర్ కోర్సు కోసం యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ (యుజిసి) తయారు చేసిన చరిత్ర పాఠ్యాంశాలు చూడవచ్చు.

1920లలో ఆర్ఎస్ఎస్‌ను స్థాపించినప్పుడు దాన్ని మత కల్లోలాలలో ఒక రకమైన శక్తిగా తయారు చేశారు. కాని 1938లో గోల్వాల్కర్ ఒక పుస్తకం రాయడానికి నిర్ణయించుకున్నాడు. ఆ పుస్తకాన్ని ఆర్ ఎస్ ఎస్ అన్ని రకాలుగానూ తన బైబిల్‌గా భావిస్తుంది. ఆ పుస్తకంలో తాను ఇతర హిందుత్వ రచయితల నుంచి గ్రహిస్తున్నానని గోల్వాల్కరే స్వయంగా చెప్పుకున్నాడు. ఆ పుస్తకంలో జాతి గురించి అడాల్ఫ్ హిట్లర్‌కు సరైన దృక్పథం ఉందని, అది యూదుల పట్ల వైఖరిలో వ్యక్తమయిందని గోల్వాల్కర్ చేసిన ప్రశంసాత్మకమైన ప్రకటన ఉంది. 1938 నాటికి ఇంగ్లండ్, ఫ్రాన్స్ రెండూ కూడా రష్యా మీద దాడి కోసం హిట్లర్‌ను ప్రోత్సహిస్తున్నాయి. అందువల్ల హిట్లర్‌ను ఎంత ప్రశంసించినా బ్రిటిష్ వారికి కోపం వచ్చే ప్రసక్తి లేదు. మరి హిట్లర్‌కు ఉండిన జాతి సిద్ధాంతం అంటే ఆర్య భావన మీద మోజు తప్ప మరేమీ కాదు.

గోల్వాల్కర్ కూడా స్వయంగా ఆర్యులే వాస్తవికంగా పూర్తిగా భారతీయులని, భారత జాతి వారికి మాత్రమే చెందినదని భావించాడు. ఇతరులకు భారతదేశంలో ఎటువంటి హక్కులు ఉండగూడదని అన్నాడు. ఆ మాట అంటున్నప్పుడు ఆయన ముస్లింలను ఉద్దేశించాడు. వాళ్లసలు పౌరులే కాజాలరన్నాడు. హిందువుల మత స్థలాలన్నీ భారతదేశంలోనే ఉన్నాయి గనుక వారు మాత్రమే భారతదేశపు నిజమైన దేశభక్తులని అన్నాడు. వాజపాయి పాలనా కాలంలో, 1999 నుంచి 2004 వరకూ ఈ మాట ఎన్‌సిఇఆర్‌టిలో పదే పదే వినబడే ఇతివృత్తంగా ఉండేది. కాని సమస్య ఏమంటే ఈ మత స్థలాల జాబితాలో మొట్టమొదటి పేరైన కైలాస్ భారతదేశంలో లేదు. చైనాలో ఉంది. ఇప్పటివరకూ అయితే అది మనదే అని అనడం లేదు. కాని ఈ పరికల్పనను అంగీకరిస్తే ప్రపంచంలోని 99 శాతం దేశాలను దేశాలని పిలవడానికే వీలు లేదు. క్రైస్తవుల మత స్థలాలు పాలస్తీనాలో ఉన్నాయి. కాథలిక్కుల మత స్థలాలు రోమ్ లో ఉన్నాయి. దీన్ని అన్వయిస్తే భారతదేశంలో హిందూ జాతి తప్ప మరే జాతీ ఉండడానికి వీలు లేదు. దేశంలో హిందువులు తప్ప మరెవరూ లేనట్టుగానే ఈ మాటనే పదే పదే పునరుక్తిగా చెపుతున్నారు. కాని మనం చరిత్రలో కొంత వెనక్కి వెళ్లాలి.

ఆర్య సిద్ధాంతం గురించి చెప్పాలంటే, భాషా శాస్త్రవేత్తలు నిర్ధారించిన ప్రకారం, ఆర్య లేదా ఆరియ అనే శబ్దం భారతదేశానికీ, ఇరాన్ కూ సంబంధించినది. అది ఇండో యూరపియన్ భాషల సముదాయానికి చెందినది. ఆ భాషలలోనే రుగ్వేదమూ, అవెస్తా ఉన్నాయి. తొలి సంస్కృత వాచకాల్లో ఆర్య అంటే గౌరవనీయమైన అని అర్థం. దాన్ని ధర్మశాస్త్రాల్లో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య అనే మూడు వర్ణాలకు అన్వయించారు. ఉత్తములు, శిష్టులు అనే అర్థం కూడ ఉంది. ఆరియకు బహువచనంగా వాడిన ఆర్యావర్త అనే పదం భారత దేశాన్నీ, ఇరాన్ నూ రెంటినీ సూచిస్తుంది. అలా చూసినప్పటికీ, ఆ మాటలో ప్రత్యేకంగా భారతీయమైనదేమీ లేదు. మూల ఆర్యులం తామేనని చెప్పుకోవడానికి మనం చేసినంత ఇరాన్ కూడా సులభంగా చేసి ఉండవచ్చు.

కాని ఆర్యులు కావడంలో అంత ఆకర్షణీయమైనది ఏముంది? మనం గనుక యుజిసి పాఠ్యాంశాలు, రచనలు, పాఠ్యపుస్తకాలు చూస్తే, ఆర్యులు బైటి నుంచి వచ్చి ఉండవచ్చుననే సూచన పట్లనే తీవ్రమైన ఆగ్రహం కనబడుతుంది. వాళ్లు భారతదేశంలోనే మొదలై, ఇతర ప్రాంతాలకు వ్యాపించారని అనాలి. కాని మానవులందరూ ఆఫ్రికా నుంచి ప్రపంచానికి వ్యాపించారని మానవ శాస్త్ర (ఆంత్రొపాలజీ) చాల కాలంగా స్థిరపరిచింది. దాన్ని పురావస్తు ఆధారాలు నిర్దిష్టం

చేశాయి. ఇప్పుడిక మానవ జన్యువుల ఆధారాలు కూడా దాన్నే బలపరుస్తున్నాయి. కాని మన పాఠ్యపుస్తకాల్లో దీన్ని పూర్తిగా విస్మరిస్తున్నారు. దాని బదులు, భారతదేశమే ఆర్యులకు జన్మనిచ్చిందనీ, వారు యావత్ ప్రపంచాన్నీ నాగరికం చేశారనీ చెపుతున్నారు. మనం ఆఫ్రికా నుంచి వచ్చామనే మాటను తిరస్కరించాలని లోలోపలి ఉద్దేశం. యుజిసి పాఠ్యాంశాలలో చరిత్ర పూర్వ యుగం గురించి ఎంతో కొంత ఉంది గాని మానవ వలసల గురించి మాట మాత్రం కూడా లేదు.

సంస్కృతం, ఇరానియన్ భాషల నుంచి తలెత్తిన ఇండో యూరపియన్ భాషల సముదాయం ఒకటుందని భాషా శాస్త్రం ఎంతో కాలం కిందనే నిర్ధారించింది. ఆ రెండు భాషలూ ఇండో యూరపియన్ భాషల పూర్వదశ నుంచి ఎంతో దూరమైనవి. ఆ తర్వాత పురావస్తుశాస్త్ర ఆధారాలు దొరికాయి. గుర్రం ఆధారం దొరికింది. గుర్రాలు మధ్య ఆసియాలోని దక్షిణ భాగాన ఉన్న కజకిస్తాన్ నుంచీ, రష్యన్ గడ్డి మైదానాల నుంచీ ఆఫ్ఘనిస్తాన్ కూ, ఇరాన్ కూ, ఇండియాకూ వలస వచ్చాయి. పురావస్తు తవ్వకాల్లో దొరికిన గుర్రపు ఎముకల ఆధారాల నుంచీ, ఆయా ప్రాంతాల్లో గుర్రాల చిత్రలేఖనాల ఆధారాల నుంచీ ఇది గుర్తించవచ్చు. అదంతా ఇరవై ఏళ్ల కిందనే నిస్సందేహంగా నిర్ధారణ అయింది. ఇప్పుడు అదే విషయం జన్యు ఆధారాల ద్వారా నిరూపితమైంది. క్రీ.పూ. 2000-1500 మధ్య ప్రధానంగా పురుషుల వలసలతో ఇది జరిగిందని జన్యు పరిశోధనలు చూపుతున్నాయి. జన్యుశాస్త్రం చూపుతున్న ఈ కాలక్రమాన్నే పురావస్తుశాస్త్రం కూడా నిర్ధారించింది.

సరే, ఇండో ఆర్యన్ భాషలు మాట్లాడుతుండిన మలిదశ ఇండో ఆర్యన్లు మధ్య ఆసియాలోని ఉత్తర భాగాల నుంచి ఇండియాలో ప్రవేశించారని అంటే వచ్చిన నష్టం ఏముంది? అయ్యో, ఏమీ నష్టం లేదు. ప్రపంచంలో ఏ ప్రాంతమైనా మరొక ప్రాంతం లాంటిదే. కాని చరిత్రను వికృతీకరిస్తున్న ఆర్ఎస్ఎస్ కల్పనా కర్తలకు అది మహా భయానకం. వాళ్లిక ఆర్యుల దురాక్రమణ అనే మిథ్యా సిద్ధాంతాన్ని తుత్తునియలు చేయడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. మొట్టమొదట గుర్తించవలసింది, ఆర్యులు అనే వారు ఒక రాజ్యంగా ఇండియా మీద దురాక్రమణ చేయలేదు. మనం ఇక్కడ దురాక్రమణల గురించీ, దాడుల గురించీ కాదు, వలసల గురించి మాట్లాడుతున్నాం. మనం ఇక్కడ తెగల గురించి మాట్లాడుతున్నాం. ఆ తెగల ఉనికి గురించి రుగ్వేద సూక్తాలు ధృవీకరిస్తున్నాయి. తప్పనిసరిగా చలనం ఉండింది. అలాగే ఇండియాలో ప్రత్యేకంగా ఇండో ఆర్యన్ భాషల మీద కనబడుతున్న ద్రావిడ భాషల ప్రభావం ఇరాన్‌లో ఎంతమాత్రం కనబడడం లేదు. ద్రావిడ పూర్వ భాషల్లో ఉండిన మూర్ధన్య ధ్వని (నాలుక కొసను అంగిలికి తగిలించి హల్లును పలికే అలవాటు) ఇండియాకు వలస వచ్చినవారిలో సాధారణంగా ఉంటుంది. అందువల్ల భాషాశాస్త్ర నిర్ధారణలు సంపూర్ణంగా రుజువయ్యాయి. చాల ఆసక్తికరమైన విషయమేమంటే, ఇప్పుడు ద్రావిడ ప్రభావాలకు వ్యతిరేకంగా విరుచుకుపడుతున్నారు గాని ద్రావిడులు కూడా భారతీయులే కదా, రుగ్వేదంలో ద్రావిడ ప్రభావం ఉన్నదంటే ప్రమాదమేమిటి?

ఇక సింధు నాగరికత విషయానికి వచ్చినప్పుడు ఈ జాతి వివక్షా సిద్ధాంతపు సంపూర్ణ రూపాన్ని మనం చూడగలం. ఆర్ఎస్ఎస్ చేతబడి చరిత్రకారులకు సింధు నాగరికత అనే మాట వింటే గంగవెర్రులెత్తుతుంది. సింధు నాగరికతకు లిఖిత చరిత్ర ఉందనీ, గణేశుడికి ఏనుగు తలను అతికించడం జరిగింది గనుక మనకు అప్పటికే ప్లాస్టిక్ సర్జరీ తెలుసుననీ మన ప్రధాన మంత్రి అన్నాడు.

కాని అశోకుడి శాసనాల వరకూ మనకు రాత తెలుసుననే ఆధారాలు లేవు. అంతకు ముందు లిపి ఆధారాలు ఉన్నాయంటే అవి దక్షిణ భారతదేశంలోనూ, శ్రీలంకలోనూ మాత్రమే ఉన్నాయి. సింధు నాగరికత రాసుకున్న దాన్ని మనం చదవలేము గనుక, అది కచ్చితంగా సంస్కృతం కాదు గనుక సింధు నాగరికత ఇబ్బందికరమైనది. వారు పూజించిన దేవతలు ఆకారాలతో ఉన్నవారే గాని మానవ ఆకారాలతో ఉన్నవారు కాదు. అంటే వారి ఆరాధన జంతువుల మీద ఆధారపడింది గాని, మానవ రూపాల మీద కాదు. శివుడితో కలిపి చూపిన జంతువులు వన్యమృగాలే తప్ప పశువులు కావు. అందువల్ల, సింధు నాగరికత కచ్చితంగా ఆర్యులకు పూర్వపుదని పురావస్తు శాస్త్రవేత్తలు సుదీర్ఘకాలం కిందనే నిర్ధారించారు. సింధు నాగరికతలో కనిపించిన చిత్రాక్షరాలకూ సంస్కృతానికీ ఎటువంటి సంబంధమూ ఉండే అవకాశం లేదు. పైగా, సింధు నాగరికతకూ ద్రావిడ పూర్వ దశకూ రెండు ప్రధానమైన సంబంధాలున్నాయి. అవి ఒకటి చేప గుర్తు, రెండోది బాణం గుర్తు. ద్రావిడపూర్వ దశలో చేప గుర్తుకు చేప అనీ, నక్షత్రాలనీ అర్థాలతో పాటు ఇతర అర్థాలు కూడా ఉన్నాయి. సింధు నాగరికతలో కూడా చేప గుర్తు చాల తరచుగా కనబడడాన్ని ఇది వివరిస్తుంది. అలాగే, సింధు వాచకాల్లో బాణం గుర్తు ఉన్న స్థలాలు ద్రావిడ, ద్రావిడపూర్వ భాషలకు వర్తించేట్టు కనబడుతున్నాయి. ఈ రెండు ఆధారాలూ చాలా ముఖ్యమైనవి.

సింధు నాగరికతకు ద్రావిడ సంబంధం ఉన్నదని తేలితే మనం ఎందుకు విచారపడాలి? ద్రావిడులేమీ ఇరానియన్ లో, ఆఫ్ఘన్లో కారు. వారు కూడా భారతీయులే. చేతబడి జరిగిన భారత చరిత్రలో ప్రధానమైన సమస్య ఇది. వాళ్లు ఒక అభూత కల్పనల కాలక్రమాన్ని స్థిరపరచడానికి ప్రయత్నించదలిచారు. ఆర్ ఎస్ ఎస్ కు చెందిన పురావస్తు శాస్త్రవేత్త వాకాంకర్ రుగ్వేదకాలాన్ని క్రీ.పూ. 8000 గా నిర్ధారించారు. రుగ్వేదంలో వ్యవసాయం ఉంది. వరి, బార్లీ పంటలు పండించడం ఉంది. గుర్రాలను మచ్చిక చేసుకోవడం ఉంది. మరి క్రీ.పూ. 8000లో ఇవేవీ లేనప్పుడు, రుగ్వేదం ఆ కాలానికి చెందినది ఎలా అవుతుంది? ఆ తర్వాత ఆర్కియలాజికల్ సర్వేకు డైరెక్టర్ జనరల్‌గా పనిచేసిన బిబి లాల్ ఉన్నారు. ఆయన ఖగోళ సమాచారానికి అభూతకల్పనల వ్యాఖ్యానం ఇవ్వడం ద్వారా శతపథ బ్రాహ్మణం రచన క్రీ.పూ. 4500లో జరిగిందని, అందువల్ల రుగ్వేదం దానికన్న నాలుగు వేల సంవత్సరాలు ముందుది అయి ఉండాలని అన్నారు. పురావస్తు శాస్త్రవేత్తలుగా ఎంతో కొంత పేరు ఉన్న వారే ఇటువంటి అభూత కల్పనలు మాట్లాడుతున్నారు. వేదానంతర వాచకాలను క్రీ.పూ. 4000లో పెడుతున్నారు. అప్పటికి పత్తి లేదు, గుర్రాలు లేవు, గోధుమలూ, బార్లీ లేవు. అంటే రుగ్వేదాన్ని సింధు నాగరికత కన్నా ముందుకు జరిపే ప్రయత్నం, ఒక చరిత్ర పునర్నిర్మాణ ప్రయత్నం

జరుగుతున్నది. ఇవన్నీ ఉద్ఘాటనలు మాత్రమే గనుక, వాటికి సాక్ష్యాధారాలు చూపించవలసిన అవసరం కూడ ఏమీ లేదు.

ఇక పదజాలం సమస్య కూడా చాల ముఖ్యమైనదే అనుకోండి. వీలర్ రోజులనుంచి కూడా ఆర్కియలాజికల్ సర్వే సింధు నాగరికతను హరప్పా నాగరికత అని పిలుస్తున్నది. ఆ నాగరికతకు సంబంధించి మొట్టమొదట తవ్వకాలు జరిగిన ప్రాంతం హరప్పా కావడమే అందుకు కారణం. మరి ఇప్పుడు హరప్పా పాకిస్తాన్‌కు పోయింది. అంతే కాదు, అది అక్కడి పంజాబ్ రాష్ట్రంలో కూడా లేదు. ఇక చివరి ఇబ్బంది, హరప్పా సరస్వతీ తీరంలో లేదు. సింధు నాగరికతను గనుక "సరస్వతీ నాగరికత" అని పిలవాలంటే దాన్ని ఆర్యీకరించాలి, హైందవీక రించాలి. నిజానికి ఋగ్వేదం ప్రకారం సరస్వతి అంటే నదీ దేవత. పవిత్రమైన సరస్వతీ నది థానేశ్వర్ గుండా ప్రవహిస్తుంది. అది చాల చిన్న సెలయేరు. ఎండిపోయి ఉంది. అందువల్ల సరస్వతిని అంత ముఖ్యమైన నది అని వాదించడం చాల కష్టం.

సరస్వతిని స్తుతిస్తూ ఉన్న ఋగ్వేద సూక్తాలు నదీ దేవతా స్తోత్రాలనేది మరిచిపోయిన చిన్న సంగతి. ఆ సూక్తాలు ఈ నిర్దిష్ట నది గురించినవి కావు. సాధారణంగా నదీ దేవతలు పెద్ద నదులకే ఉంటారు. ఈ కీలకమైన విషయాన్ని విస్మరించి సింధు నాగరికతను సరస్వతీ నాగరికత అని పిలుస్తున్నారు. సింధు నాగరికతలో గుర్రం ఉన్నదనే ఆధారాలు లేవు గనుక, ఋగ్వేదమేమో గుర్రాలే ముఖ్యమైన సమూహం గురించి మాట్లాడుతుంది గనుక స్పష్టంగా ఈ వక్రీకరణ చరిత్ర, చరిత్రను తలకిందులుగా మార్చేస్తున్నది. ఏమాత్రం గంభీరమైన చరిత్రకారులకైనా ఇటువంటి జోక్యం అంగీకారయోగ్యం కాదు.

ఇక్కడి నుంచి నేను కుల వ్యవస్థ పట్ల వాళ్ల వైఖరి విషయానికి వస్తాను. గాంధీజీకి జవాబు అంబేద్కర్ అని వాళ్లు తమకే తెలిసిన ఏదో కారణం వల్ల భావిస్తున్నారు. కాని కులం పట్ల వాళ్ల సొంత చిత్రణ ఏమిటి? యుజిసి పాఠ్యాంశాలలో కుల వ్యవస్థను మధ్య యుగాల ఉత్పత్తిగా చిత్రించారని వింటే మీరు ఆశ్చర్యపోతారు. ముస్లింలు రాగానే, హిందువులు తమలో తాము కులాలుగా విభజించుకున్నారట. వాళ్లు రాసిన ప్రాచీన భారతదేశంలో కులం అనే దాన్ని ఎక్కడా ప్రస్తావించ లేదు. ప్రాచీన కాలంలో క్రీ.శ. 600 సమయంలో రాజపుత్ర కులం ఎదుగుదల గురించి మాత్రం ప్రస్తావించారు. మరి రాజపుత్రులు ఒక కులమేననేది ఎవరూ నిరాకరించడానికి వీలులేని అంశం. వాళ్లకు తమ మూలాలు ఎప్పటి నుంచి ఉన్నాయో తెలుసుకోవాలని కోరిక ఉంది గాని మొత్తంగా కుల వ్యవస్థ గురించి వచ్చినప్పుడు మాత్రం, దాన్ని పూర్తిగా విస్మరిస్తున్నారు. వాళ్లు కుల వ్యవస్థను పొగుడుతారు గాని కులం మాత్రం లేదన్నట్టు మరోవైపు చూస్తారు.

వాస్తవానికి గంగా మైదానం మధ్య భాగంలో కుల వ్యవస్థ పుట్టుక గురించీ, అది మౌర్య సామ్రాజ్యం లోకీ, దక్షిణ భారతదేశం వైపూ వ్యాపించడం గురించీ అధ్యయనం చేయడం చరిత్రకారులకు చాల ఆసక్తికరమైన ఇతివృత్తం. కుల వ్యవస్థ ఎలా విస్తరించింది? ఇప్పుడు పాకిస్తాన్ గా ఉన్న సింధు లోయ ప్రాంతంలోకి అలెగ్జాండర్ వచ్చినప్పుడు బ్రాహ్మణులు ఉన్నారని గుర్తించాడు. కాని కుల వ్యవస్థను చూడలేదు. కుల వ్యవస్థ క్రమంగా బీహార్ నుంచి తూర్పు ఉత్తరప్రదేశ్‌లోకి ఎట్లా వ్యాపించిందో శాసనాలను నిశితంగా అధ్యయనం చేస్తే చూడవచ్చు. ఇది చరిత్రకారులకు చాల ఆసక్తికరమైన అంశం. కాని యుజిసి పాఠ్యాంశాల రూపకర్తలకు, ఆర్ఎస్ఎస్ తరహా చరిత్ర రచయితలకు మాత్రం కంటగింపు. కులవ్యవస్థను వారు వివరించలేకపోతున్నారు గనుక దాన్ని తమ పాఠ్యాంశాల నుంచి తొలగించారు. శూద్రుల గురించి పుస్తకం రాసినందుకు, బహుశా చండాలుల గురించి పుస్తకం రాసినందుకు ఆర్ ఎస్ శర్మను శత్రువుగా భావిస్తున్నారు. వేదానంతర సమాజంలో అటవీ ప్రాంతాల్లో వ్యవసాయం వ్యాపింపజేయడానికి తెగలను ఎట్లా సమీకరించారో, వారిని ఎట్లా అస్పృశ్యులుగా మార్చారో ఒక ఆసక్తికరమైన అంశం.

అదే వరుసలో మరొక ఆసక్తికరమైన అంశం మతం. ధర్మం అంటే నీతి, బ్రాహ్మణుల పట్ల విధేయత. కాని వాస్తవంగా వారికి మతం అనే మాట లేదు. సహిష్ణుత గురించిన అశోకుడి శాసనం మత సహనం గురించి మాట్లాడుతూ "పాషండులు" అనే మాట వాడింది. ఆ మాటను బ్రాహ్మణులు బౌద్ధుల గురించీ, బౌద్ధులు బ్రాహ్మణుల గురించీ వాడారు. ఉదాహరణకు అశోకుడు కుల వ్యవస్థ గురించి ఎందుకు ప్రస్తావించలేదనేది ఉపయోగకరమైన చర్చ. కాని చేతబడుల చరిత్ర కథనంలో ఇటువంటి ఆసక్తికరమైన అంశాలన్నీ అనవసరమైనవి అయిపోతాయి. నిజం చెప్పాలంటే అశోకుడినే అంతకంతకూ ఎక్కువగా అనవసరమని భావిస్తున్నారు. భారత చరిత్ర సంస్కృతి సంఘం అనేది స్థాపించినప్పటినుంచీ, 1970ల నుంచీ, "భారత చరిత్ర రచనలో దురభిప్రాయాలు" అనే పుస్తకం విడుదల చేసినప్పటినుంచీ ఎన్నెన్నో కొత్త అన్వేషణలు చేశారు. పురుషోత్తముడిని అలెగ్జాండర్ జయించలేదనీ, అలెగ్జాండరే ఓడిపోయాడనీ వి ఎస్ సూరి రాశాడు. సరస్వతి క్రీ. పూ. 2200లో ఎండిపోయింది గనుక ఋగ్వేదం అంతకు చాల ముందుది కావాలని మరొక చరిత్రకారుడు అన్నాడు. ఈ వాదనను ప్రొఫెసర్ రొమిలా థాపర్ అంగీకరించలేదు. ఆ రెంటికీ మధ్య సంబంధం ఏమిటో ఎవరికీ తెలియదు.

వారు రాసిన ప్రాచీన భారత చరిత్ర వివాదాలకు దారితీసింది. హిందూ, ముస్లిం మతోన్మాద చరిత్రకారులిద్దరూ తమ తమ వైఖరులు ప్రకటించారు. మొదట ముస్లిం చరిత్రకారుల సంగతి చెపుతాను. ఇస్లాం ఒక సమానత్వ మతం అని ఒక ఆధునిక అభిప్రాయం ఉంది. కాని ఇస్లాంను చారిత్రక దృష్టితో చూస్తే ఈ లక్షణం పరిమితమైనదే అని తెలుస్తుంది. ఇస్లాం బానిసత్వాన్ని అనుమతించింది. ఉంపుడుగత్తెల పద్ధతిని అనుమతించింది. స్వయంగా ముస్లిం మతతత్వవేత్తలకు బానిసలుండేవారు. చివరికి సూఫీలకు కూడా బానిసలున్నారు. అందువల్ల ఇస్లాం ఒక సమానత్వ సమాజం అనడాన్ని అంగీకరించలేం. ముస్లింలు ఇక్కడికి సమానత్వాన్ని వ్యాపింపజేయడానికే వచ్చారన్నట్టుగా ముస్లిం చరిత్రకారులు రాశారు. ఇస్లాంలో కుల వ్యవస్థను ఆమోదించడం కష్టం గనుక వాళ్లు దాన్ని ఆమోదించలేరు. కాని వాళ్లు దాన్ని వాడుకున్నారు.

కుల వ్యవస్థ బ్రాహ్మణులకు గాని, మరే ఇతర కులానికి గాని లాభం చేకూర్చలేదని నేను ఇదివరకే వాదించాను. అది ప్రభుత్వానికి, రాజ్యానికి, లేదా ఏ దోపిడీ వర్గానికైనా లాభం చేకూర్చింది. అది ఒక పెద్ద భూమిహీన శ్రామికవర్గాన్ని, లేదా అస్పృశ్యులను సృష్టించింది.

రైతులను విభజించింది. అది ప్రాచీన భారత పాలకులను సంపన్నులను చేసింది. అది వలస ప్రభుత్వానికి లాభం చేకూర్చింది. అందుకే వాళ్లు 'మనం దాన్ని చెదరగొట్టగూడదు' అనుకున్నారు. కులవ్యవస్థ బ్రిటిష్ వారికి ఎంత ఉపయోగకరంగా ఉండిందో, సుల్తాన్లకు కూడా అంతే ఉపయోగకరంగా ఉండింది. కనుక, ఇస్లాం ఒక సమానత్వ మతం అని అనడం పూర్తిగా అచారిత్రికం. ఒక ఆధునిక భావనను దానిమీద ఆపాదించడమే.

అదే విధంగా దాన్ని విదేశీ పాలన అనడం పిచ్చితనం. ఎందుకంటే విదేశీపాలన అన్నప్పుడు ఒక దేశాన్ని మరొక దేశం తరఫున పాలించడం ఉండాలి. మొఘల్‌లు విదేశీయులు కారు. హుమాయూన్ తర్వాత ఏ ఒక్క మొఘల్ చక్రవర్తి కూడా దేశం బైట పుట్టలేదు. భారతదేశం 1200 సంవత్సరాలు విదేశీ పాలన కింద ఉండిందని మోడీ అనడం అసంబద్ధం.

ఇక మనం జాతీయోద్యమం గురించి మాట్లాడినప్పుడల్లా, వాళ్లు మహారాణా ప్రతాప్ గురించి మాట్లాడడం మొదలుపెడతారు, ఆయనేదో భారతీయ జనతా పార్టీ సభ్యుడైనట్టు! ఆర్‌సి మజుందార్ హిందూ మహాసభకు చెందినవాడైనప్పటికీ, ఆయన కూడ ఆర్ఎస్ఎస్ వాళ్లు వెళ్లినంత అతికి వెళ్లలేదు. ఉదాహరణకు, ముస్లిం పాలనలు ఏవైనా సాంస్కృతిక విజయాలను మిగిల్చాయంటే ఆర్ఎస్ఎస్‌కు కంపరమెత్తుతుంది. అందువల్లనే ప్రతి మొఘల్ కట్టడమూ వాస్తవంగా అంతకుముందు హిందువులు నిర్మించినదేనని, పి ఎన్ ఓక్ తదితరులు 1960ల లోనే రాయడం ప్రారంభించారు. అది ఎర్రకోట గాని, తాజ్ మహల్ గాని, మాన్‌సింగ్ మహల్ గాని. దానితో ఆర్‌సి మజుందార్ ఆర్ఎస్ఎస్ పత్రిక ఆర్గనైజర్‌తో తన సంబంధాలన్నిటినీ తెంచుకున్నారు. మొఘల్ కాలంలో ఎటువంటి సాంస్కృతిక విజయం సాధించలేదని అనడం, దాన్ని ప్రచారం చేస్తూ ఉండడం పిచ్చితనం తప్ప మరేమీ కాదు.

ఇక ఆధునిక చరిత్ర విషయానికి వస్తే, వాజపాయి పాలనా కాలంలో ఎన్‌సిఇఆర్‌టి ప్రచురించిన, హరి ఓం రాసిన 'మాడర్న్ ఇండియా' పుస్తకం చూడవచ్చు. పునరుజ్జీవన ఘనతను ఇంగ్లిష్ విద్యను ప్రోత్సహించిన రామమోహన్ రాయ్‌కీ, కేశవచంద్ర సేన్‌కూ, జస్టిస్ రానడేకూ, సయ్యద్ అహ్మద్ ఖాన్‌కూ ఇవ్వడం ఆర్ఎస్ఎస్‌కు ఇష్టం లేదు. వీరిలో రామమోహన్ రాయ్ ప్రత్యేకంగా ఒక అద్భుతం. శాశ్వత శిస్తు పద్ధతిని జమీందార్లతో కాక రైతులతో చేయాలని 1839 లోనే అన్నాడంటే ఆ మనిషి దూరదృష్టి ఎంత గొప్పదో నేను ఊహించను కూడలేను. కేశవచంద్ర సేన్ స్త్రీపురుష సమానత్వం గురించి మాట్లాడాడు. వీళ్లందరినీ ఆ పుస్తకం బహిష్కరించింది. రామమోహన్ రాయ్ తనను తాను ఏకేశ్వరోపాసకుడినని చెప్పుకున్నాడు గనుక, ఇంగ్లిష్ లో ఎంత ప్రజ్ఞ ఉండేదో, పర్షియన్, అరబిక్ లలో కూడా అంతా ప్రజ్ఞ ఉండేది గనుక ఆయనను బహిష్కరించారు.

ఇప్పుడిక నాయకులు దయానంద సరస్వతి, బంకించంద్ర ఛటర్జీ, స్వామి వివేకానంద, అరవింద ఘోష్. వారు ఏ రకంగా సంస్కర్తలు? వారు మత వ్యక్తులు. జాతీయోద్యమంలో వారి పాత్ర ఏమిటి?

ఈ పుస్తకం చిట్టచివరికి తేల్చేదేమంటే, జాతీయోద్యమం నిజమైన ఉద్యమం కాదని, దాని స్థానంలో సాంస్కృతిక జాతీయవాదమే ముఖ్యమని. బ్రిటిష్ పాలకులు ఈ సాంస్కృతిక జాతీయవాదం తమకు ప్రమాదకరమని ఎంతమాత్రం భావించలేదు. అంతే కాదు, పాలకులు ఏమి చెపితే అది ఆర్ఎస్ఎస్ చేసింది కూడ.

అంతే కాదు, అంబేద్కర్ ను తలకిందులుగా వాడుకోవడం. బహిష్కృత, అణగారిన వర్గాల కోసం నడిపిన ఉద్యమం వరకు అంబేద్కర్ కానుకలు మహత్తరమైనవి. కాని జాతీయోద్యమం విషయానికి వస్తే ఆయనను జాతీయోద్యమ నాయకులతో పోల్చడానికి వీలులేదు. జాతీయోద్యమం నుంచి గాంధీ నెహ్రూలను తొలగించడానికి ఎంత ప్రయత్నం జరిగిందంటే హరి ఓం చివరికి గాంధీజీ హత్య గురించి ఒక్క ముక్క కూడా రాయలేదు. అసలు ఆ ఘటనకు చరిత్రలో నమోదు కాదగిన అర్హతే లేదన్నట్టుగా. మనకు నిజంగా స్వాతంత్ర్యం తెచ్చిన జాతీయ వ్యక్తులను పూర్తిగా చిన్నబుచ్చడం చేతబడి చరిత్రలో జరిగిందని నేనిక్కడ చెప్పదలచాను. అలాగే వాళ్లు ఆర్ఎస్ఎస్ మీద పటేల్ విమర్శలను ఎప్పుడూ ఉటంకించరు. పటేల్ ను నెహ్రూకు వ్యతిరేకంగా నిలబెట్టడం మరొక పిచ్చితనం. జాతీయోద్యమాన్ని పూర్తిగా వక్రీకరించడం వారు చేస్తున్న అత్యంత విషపూరితమైన, దుర్మార్గమైన చర్య.

చివరిగా, స్వాతంత్ర్యానంతర దశలోని చరిత్రమీద వాళ్లు చేసిన చేతబడి గురించి చెప్పి ముగిస్తాను. మామూలుగానే వాళ్లు చేసేది ప్రమాదకరమైనది కాగా, ఇది అత్యంత ప్రమాదకరమైనది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు నా వయసు 16 సంవత్సరాలు. ఆగ్రా వంటి ప్రాంతంలో 1952 ఎన్నికల సమయంలో నేను కమ్యూనిస్టు పార్టీ తరఫున పనిచేశాను. ఆ ఎన్నికలలో ఇతర విషయాలతో పాటు, హిందూ కోడ్ సంస్కరణలు, స్త్రీల హక్కులు ప్రధానాంశాలుగా ఉండినాయి. హిందూ కోడ్ సంస్కరణలను వ్యతిరేకించడానికి జనసంఘ్, రామరాజ్య పరిషద్, హిందూ మహాసభ ఒక కూటమిగా ఏర్పడ్డాయి. వాళ్లు చిత్తుగా ఓడిపోయారు. కమ్యూనిస్టు పార్టీ దగ్గరికి కొందరు వస్తుండేవారు. ఆ కూటమి దగ్గరికి ఎవరూ వెళ్తుండేవారు కాదు. 'మాకు ఏమీ దక్కలేదు, కాని ఈ చట్టం వస్తే కనీసం మా కూతుళ్లకైనా ఎంతో కొంత దక్కుతుంది' అని జనం అంటుండేవాళ్లు.

దేశపు జ్ఞాపకాలలో అదంతా తుడిచిపెట్టుకుపోయినట్టు కనిపిస్తున్నది. ఆర్ఎస్ఎస్ ప్రాతినిధ్యం వహించే వికృతీకరణ చరిత్రలోకి మనం చేరుకుంటున్నట్టున్నది. 1955-56ల్లో హిందూ కోడ్ వచ్చినప్పుడు, అది రెండువేల సంవత్సరాల ధర్మశాస్త్రాలను పూర్తిగా కూలదోసింది. యాభై సంవత్సరాల తర్వాత, మళ్లీ ఒక కాంగ్రెస్ ప్రభుత్వం కిందనే స్త్రీలు సంపూర్ణంగా సమానహక్కులు సాధించారు. ఇంకా మిగిలిపోయిన చిన్న చిన్న తేడాలు కూడ పూర్తిగా తుడిచివేయబడ్డాయి. కాని అదంతా జరిగింది కాంగ్రెస్ ప్రభుత్వం కిందనే. కనుక ఇప్పుడు మోడీ, షా అంటున్నట్టుగా స్వాతంత్ర్యం తర్వాత ఏమీ జరగలేదని అనడం తెలివితక్కువతనం.

తర్వాత, రైతులకు భూమి. 1946లో తాత్కాలిక ప్రభుత్వాల నుంచి, చట్టసభలు జమీందారీ రద్దు కోసం చట్టాలు ఆమోదించడం ప్రారంభించాయి. షేక్ అబ్దుల్లా నాయకత్వంలో కశ్మీర్‌లో బహుశా అత్యంత విప్లవాత్మకమైన భూసంస్కరణలు అమలయ్యాయి. ఆ షేక్

# స్థానికతను సమాధి చేస్తున్న 317 జివో

*ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాల బదిలీ కోసం తెచ్చిన ఉత్తర్వులు తెలంగాణ అస్తిత్వాన్ని, స్థానికతను దెబ్బతీస్తున్నాయని అంటున్నారు* **ఎం. కోదండరామ్**

**ఉ**ద్యోగులు, ఉపాధ్యాయుల పట్ల పాలకుల అప్రజాస్వామిక ధోరణికి పరాకాష్టే జి.వో. 317. ఈ జి.వో. కారణంగానే కొత్త జిల్లాల వారీగా ఉద్యోగుల కేటాయింపు సమస్యాత్మకంగా మారింది. అసలే లోపభూయిష్టమైన జివో, పైగా ఆ జీవో అమలులో కూడా వీసమెత్తు పారదర్శకత లేదు. తాము రాసిన ఈ తప్పుడు జి.వో.ను కూడా అధికారులు పాటించకపోతే అడిగే నాధుడే లేడు. ఏ నియమాన్ని పాటించకుండా విచ్చలవిడిగా చెట్టుకొకరిని పుట్టకొకరిని విసిరేయడంతో దిక్కుతోచక, ఆదుకునేవాడు కనిపించక, మొర వినేవాళ్లే లేకపోవడంతో ఇష్టపడి, కష్టపడి సాధించుకున్న ఉద్యోగాన్ని వదులుకోలేక, పిల్లాజెల్లాతో దూరం వెళ్లలేక ఆఖరుకు ప్రాణాలు త్యాగం చేసుకున్న ఉద్యోగులు ఉన్నారు. ఇప్పటివరకు 10 మంది ఉద్యోగ, ఉపాధ్యాయులు బలవన్మరణానికి గురయ్యారు. అందులో ఆత్మహత్య చేసుకున్న ఒక మహిళ కూడా ఉన్నది. ఉద్యోగుల, ఉపాధ్యాయుల ఆవేదన అర్థం కావాలంటే స్థానిక రిజర్వేషన్ల అంశాన్ని తెలుసుకోవాలి.

**స్థానిక రిజర్వేషన్లు:**

స్థానిక రిజర్వేషన్లు తెలంగాణకు ఉన్న ప్రత్యేకత. 19వ శతాబ్దంలోనే నాటి హైదరాబాద్ సంస్థానంలో స్థానిక రిజర్వేషన్లకు అంకురార్పణ జరిగింది. మొదటి సాలార్జంగ్ ప్రధానమంత్రిగా ఉండగా హైదరాబాదులో పాలనా సంస్కరణలు మొదలయ్యాయి. వివిధ శాఖలను ఏర్పాటు చేసి ఆధునిక పాలనా యంత్రాంగాన్ని నిర్మించే ప్రయత్నం ప్రారంభమైంది. అయితే ఆధునిక పద్ధతుల ప్రకారం శాఖలను నిర్వహించగల ఉద్యోగులు మన రాష్ట్రంలో లేరని ఉత్తర హిందూస్థానం నుండి చదువుకున్న యువకులను తీసుకొచ్చారు. ఈ నిర్ణయాన్ని స్థానిక యువకులు వ్యతిరేకించారు. ఇక్కడి సంస్కృతి, జీవన విధానం తెలియని బయటి వాళ్లకు కాకుండా స్థానికులకే ఉద్యోగాలు ఇవ్వాలని డిమాండ్ చేసినారు. అప్పట్లో యువకులు చేసిన పోరాట ఫలితంగా స్థానికులకే ఉద్యోగాలు రిజర్వు చేస్తూ ముల్కీ నియమాలు హైదరాబాద్ సంస్థానంలో 1919లో అమలులోనికి వచ్చినాయి.

ఈ నియమాల ప్రకారం తెలంగాణలో పుట్టి 15 ఏళ్ల పాటు స్థిర నివాసం ఉంటేనే స్థానికుడవుతాడు. పోలీస్ యాక్షన్ జరిగి హైదరాబాద్

---

అబ్దుల్లాను ఆర్ ఎస్ ఎస్ తీవ్రంగా ఖండిస్తుంది. ఆయన వల్లనే కశ్మీర్‌లోని రైతులకు భూములు దక్కాయి. ఉత్తరప్రదేశ్‌లోనూ, అన్ని రాష్ట్రాలలోనూ రైతులకు భూమి దక్కింది, జమీందారీ రద్దయింది. అదంతా ఏమీ జరగనట్టేనా?

ఆ తర్వాత భూగరిష్ట పరిమితి చట్టాలు వచ్చాయి. అణగారిన ప్రజలు భూమి పొందారు. అదంతా ఏమీ జరగనట్టేనా?

తర్వాత, నెహ్రూ కాలంలోనే, బీమా కంపెనీల జాతీయీకరణ జరిగి, బీమా సురక్షితమై సాధారణ ప్రజానీకానికి గొప్ప ఉపశమనాన్ని ఇచ్చింది. బ్యాంకుల జాతీయీకరణ మరింత రక్షణను ఇచ్చింది. ఇవన్నీ ప్రభుత్వ రంగాన్ని నిర్మించడంలో, భారతదేశాన్ని పారిశ్రామికీకరించడంలో చాల ముఖ్యమైన పరిణామాలు. దేశాన్ని పారిశ్రామికీకరించడానికి అది ఒకటే మార్గమని అంటూ రెండో పంచవర్ష ప్రణాళికను చివరికి జిడి బిర్లా కూడ సమర్థించారు. అదంతా ఏమీ జరగనట్టేనా?

ఇరవయో శతాబ్ది రెండో అర్ధ భాగంలో తలసరి వినియోగం పెరిగిందని, ఆ తర్వాత అది తగ్గిపోతున్నదని ప్రముఖ అర్థశాస్త్రవేత్తలెందరో చూపారు. అదంతా ఏమీ జరగనట్టేనా?

అంటే మొత్తం మీద స్వాతంత్ర్యానంతర భారతదేశాన్ని పూర్తిగా తప్పుగా చూపడం భారత చరిత్ర మీద చేతబడిలో ఒక ముఖ్యమైన భాగం. దాన్ని ప్రతిఘటించవలసి ఉంది. ఏమి జరిగిందో సక్రమంగా, సరిగ్గా వర్ణించాలి. భారత చరిత్రలోని మహత్తరమైన వ్యక్తులను తొలగించి, వారి స్థానంలో మనం తయారు చేసిన కొందరు వ్యక్తులను స్థాపించడం కుదరదు. అలాగే అది పౌర చట్టం గాని, జమిందారీ రద్దు గాని, భూగరిష్ట పరిమితి గాని, భూ పంపిణీ గాని, ప్రభుత్వ రంగ నిర్మాణం గాని, పారిశ్రామికీకరణ గాని అటువంటి మహత్తర సంఘటనలను మన ఇష్టం వచ్చినట్టుగా విస్మరించలేము.

షా, మోడీలు దాచిపెట్టదలచిన ఈ విజయాలు మహత్తరమైనవి. ఆ విషయం భారత ప్రజలకు చేరవేయడం చరిత్రకారుల బాధ్యత.

(అనువాదకుడి వ్యాఖ్య: ఈ ఉపన్యాసంలో కొన్ని అభిప్రాయాలతో, ముఖ్యంగా వలస వ్యతిరేక ఉద్యమం చరిత్రపై, వలసానంతర భారత చరిత్రపై ఇర్ఫాన్ హబీబ్ అభిప్రాయాలతో భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ, ప్రస్తుత సంఘ్ పరివార్ వక్రీకరణల నేపథ్యంలో ఈ మొత్తం చరిత్రాంశాలు తప్పనిసరిగా చర్చకు రావాలనీ, ఇవి తెలుగు ఆలోచనాపరులకు తెలియాలనీ అనువదించాను. ఉపన్యాసానికి అక్షరరూపం ఇవ్వడంలో కొన్ని అంశాలు తొలగిపోయినట్టున్నాయి, అలాగే ఉపన్యాసం తర్వాత మంచి చర్చ కూడ జరిగింది. కనుక వీలైనవాళ్లు యూట్యూబ్ మీద చూడండి.) వీ

సంస్థానం భారత దేశంలో విలీనమైన తరువాత కూడా ఈ నియమాలు యథాతథంగా కొనసాగినాయి. అయితే రాజ్యాంగం ఉనికిలోనికి వచ్చిన తరువాత స్థానికుడిగా గుర్తించడానికి 15 ఏళ్ల స్థిర నివాసం అనే అంశాన్ని మాత్రమే పరిగణలోనికి తీసుకున్నారు.

విలీనం అనివార్యమైన సందర్భంలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంత నాయకులు ఢిల్లీలోని హైదరాబాద్ హౌస్‌లో సమావేశమై కుదుర్చుకున్న పెద్దమనుషుల ఒప్పందం ప్రకారం తెలంగాణలో ముల్కీ నియమాలను కొనసాగించడానికి ఆంధ్రా నాయకులు ఒప్పుకున్నారు. ఆ విధంగా ముల్కీ నియమాలు అమలయ్యాయి. అయితే వాటిపైన 1960 దశకం చివరన, 1970 దశకం ఆరంభంలో కోర్టులలో చాలా వివాదం కొనసాగింది. చివరకు 1972లో సుప్రీంకోర్టు ముల్కీ నిబంధనలు కొనసాగుతాయని తీర్పునిచ్చింది. తీర్పుకు వ్యతిరేకంగా ఆంధ్ర ప్రాంతంలో ఉద్యమం చెలరేగింది. ఆ నేపథ్యంలో 1973లో వివాద పరిష్కారానికి ఆరు సూత్రాల పథకాన్ని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది.

ఈ ప్రకటన తరువాత స్థానిక రిజర్వేషన్ల స్వభావం మారిపోయింది. అందువలన తెలంగాణాకు నష్టం జరిగింది. అప్పటి వరకు తెలంగాణా ప్రాంతంలో మాత్రమే అమలైన స్థానిక రిజర్వేషన్లను మొత్తం ఉమ్మడి రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు విస్తరించారు. ఈ రిజర్వేషన్ల అమలుకు కావలసిన ఉత్తర్వులు జారీ చేసే అధికారాన్ని రాష్ట్రపతికి కల్పిస్తూ కేంద్ర ప్రభుత్వం సవరణ ద్వారా రాజ్యాంగంలో 371(డి) ఆర్టికల్‌ను చేర్చింది. ఈ రాజ్యాంగ నిబంధన ప్రకారం రాష్ట్రపతి స్థానిక రిజర్వేషన్ల ఉత్తర్వులను 1975లో జారీ చేసింది. రాష్ట్రపతి ఉత్తర్వులు, ఉన్న ఉద్యోగాలను జిల్లా, జోన్, రాష్ట్ర స్థాయి ఉద్యోగాలుగా విభజించి ప్రతి స్థాయిలో స్థానికులకు రిజర్వేషన్లు కల్పించాయి. అయితే ఎస్.ఎస్.సి. పరీక్షలకు ముందు ఎవరైనా నాలుగు సంవత్సరాలు ఎక్కడ స్థిర నివాసం ఉంటే అక్కడ స్థానికులవుతారు. ఈ నియమం కారణంగా ఆంధ్రా ప్రాంతం వారు తెలంగాణాలో స్థానికతను పొందగలిగారు. ఇప్పటికీ ఇదే పద్ధతిలో స్థానిక రిజర్వేషన్లు కొనసాగుతున్నాయి.

**తెలంగాణలో స్థానికత అంశం:**

తెలంగాణా ఏర్పడిన తరువాత కూడా 371(డి) అవసరం ఉంటుందా లేదా అన్న చర్చ విభజన సందర్భంగా జరిగింది. ఆ సమయంలో ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడిన తరువాత 371(డి) అవసరం లేదన్న న్యాయ నిపుణులు లేక పోలేదు. 371(డి)ని అడ్డంపెట్టి విభజన చట్టం పార్లమెంటు ముందుకు రాకుండా అడ్డుకుంటున్న సందర్భంగా ఆ చర్చ తలెత్తింది. విభజన చట్టంలో భాగంగా ఈ అంశాన్నైనా సవరించవచ్చు అనే విషయాన్ని న్యాయ నిపుణులు తేల్చి చెప్పడంతో ఆ చర్చ ఆగిపోయింది. అయితే చర్చ వలన ఒక లాభం జరిగింది. 371(డి) ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తరువాత ఏ విధంగా ఉపయోగపడుతుందో తెలుసుకోవడానికి చర్చ ఉపయోగపడింది. అప్పుడు రెండు ప్రయోజనాలను కోరి 371(డి) కొనసాగాలని అనుకున్నాం. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల వారికి పాలనా రంగంలో సమాన భాగస్వామ్యం కల్పించడానికి స్థానిక రిజర్వేషన్లు అవసరమన్న వాదన బలంగా ముందుకు వచ్చింది. స్థానిక రిజర్వేషన్లు లేకపోతే ఇప్పుడున్న ఉద్యోగులను కక్షతో రాష్ట్రంలో ఎక్కడికి పడితే అక్కడికి నాయకులు ఇష్టానుసారం బదిలీ చేసే ప్రమాదం వున్నది. 371(డి)ని కొనసాగిస్తే ఈ విచ్చలవిడితనానికి ముగుదాడు వేయవచ్చునన్నది మరొక ఆలోచన. అందువలన 371(డి) కొనసాగింది. అయితే ఆ స్ఫూర్తికి విరుద్ధంగా ఇప్పుడు జీవోలు వచ్చినాయి. 371(డి) ప్రకారం స్థానికతకు ప్రాధాన్యత ఇవ్వవలసిఉంటుంది.

రాష్ట్రం ఏర్పడిన తరువాత కొత్త స్థానిక రిజర్వేషన్ల రూపకల్పన కొత్త జిల్లాల ఏర్పాటు వలన ఆలస్యమైంది. గందరగోళంగా మారిపోయింది. జిల్లాలను ఏర్పాటు చేసినప్పుడు ప్రభుత్వ శాఖల విభజన, ఉద్యోగుల కేటాయింపు వంటి అంశాలను ప్రభుత్వం పట్టించుకోలేదు. రాజకీయ అవసరాలు, రియల్ ఎస్టేట్ ప్రయోజనాలను మాత్రమే దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం జిల్లాల ఏర్పాటుకు పూనుకున్నది. జిల్లాల ఏర్పాటును పరిశీలిస్తే ఒక ప్రాతిపదిక కానీ, పద్ధతి కానీ కనిపించవు. ఏ కోణం నుండి చూసినా జిల్లాల మధ్య విపరీతమైన తారతమ్యాలున్నాయి. విస్తీర్ణంలో విపరీతమైన వ్యత్యాసాలున్నాయి. అన్నింటికన్నా పెద్ద జిల్లా భద్రాద్రి కొత్తగూడెం విస్తీర్ణం 7,483 చదరపు కిలోమీటర్లు. నల్గొండ జిల్లా విస్తీర్ణం 7,122 చదరపు కిలోమీటర్లు. 6,000 చదరపు కిలోమీటర్ల కన్నా పెద్ద జిల్లాలు నాలుగున్నాయి. అవి పైన చెప్పిన నల్గొండ, భద్రాద్రి కొత్తగూడెం కాక నాగరకర్నూల్, జయశంకర్ భూపాలపల్లి. రెండు వేల చదరపు కిలోమీటర్ల లోపు విస్తీర్ణం కల హన్మకొండ, వరంగల్, మేడ్చల్–మల్కాజిగిరి, రాజన్న–సిరిసిల్ల జిల్లాలున్నాయి. నల్గొండ 31 మండలాలతో ఏర్పడితే జయశంకర్–భూపాలపల్లి, నారాయణపేట జిల్లాలలో 11 మండలాలు, జనగామ, జోగుళాంబ గద్వాలలో 12 మండలాలున్నాయి. ములుగు జిల్లాలో 9 మండలాలే ఉన్నాయి. జనాభా రీత్యా చూస్తే మేడ్చల్–మల్కాజిగిరి జిల్లాలో 24 లక్షల జనాభా ఉంటే జయశంకర్ భూపాలపల్లి జిల్లా జనాభా అతి తక్కువ. ఈ జిల్లా జనాభా 4.16 లక్షలు. ఎనిమిది జిల్లాలను వివిధ పాత జిల్లాల పరిధిలోని భూభాగాలను కలిపి ఏర్పాటు చేస్తే మిగతా జిల్లాలు ఏదో ఒక పాత జిల్లా నుండి వేరైన భౌగోళిక ప్రాంతాలు. ఇన్ని వ్యత్యాసాలున్నయి. అందుకే ప్రభుత్వం ప్రతీ జిల్లాలోనూ అన్ని శాఖలను ఏర్పాటు చేయలేదు. రకరకాల సైజులు, జనాభాలో వ్యత్యాసం, మండలాలు, మున్సిపాలిటీల సంఖ్యాపరంగా తేడాలు కల జిల్లాలను కలిపి జోన్లుగా ఏర్పాటు చేయడంలోనూ గందరగోళం కొనసాగింది. జిల్లాలు, జోన్లను ఇష్టానుసారంగా చేయడంతో ఉద్యోగులు ఇబ్బంది పడ్డారు.

**124 జి.వో.**

ప్రభుత్వం జారీ చేసిన జీవోల లోనూ తప్పులున్నాయి. స్థానిక రిజర్వేషన్లను రాష్ట్రానికి వర్తింప చేసిన జీవో 124 కేటాయింపులో స్థానికతను పరిగణలోనికి తీసుకోనే లేదు. స్థానికత అనే అంశాన్ని గుర్తించక పోవడమే ఇప్పుడు ఉద్యోగులు ఎదుర్కొంటున్న సమస్యలకు మూలకారణమైంది. జిల్లాల మధ్య ఉద్యోగుల కేటాయింపుకు జీవోలోని సెక్షన్ 4 మార్గదర్శకాలను ఏర్పాటు చేసింది. అందులోని సబ్ సెక్షన్ 2లోని క్లాజ్ (ఎ) నుండి (ఇ) వరకు మార్గదర్శకాలను విపులీకరిస్తున్నది. ఇందులో స్థానికత అనే అంశాన్ని ప్రభుత్వం చేర్చే ప్రయత్నం చేయలేదు. ఈ తప్పిదం ఉద్యోగుల పాలిట శాపంగా మారింది. సెక్షన్ 4 కింద 4 నుండి 7 వరకు కల సబ్ సెక్షనులు కేటాయింపుకు తీసుకోవలసిన చర్యలను, పాటించవలసిన జాగ్రత్తలను సూచిస్తున్నాయి. 2018లో జారీ అయిన ఈ జీవో ప్రకారం అటు తరువాత మూడు సంవత్సరాలలో ఉద్యోగుల కేటాయింపు పూర్తి కావాలి. కానీ ప్రభుత్వం కేటాయింపు అంశాన్ని విస్మరించింది. మొద్దునిద్ర పోయింది. మూడేళ్లు పూర్తయిన తరువాత మేల్కొని హడావుడిగా కేటాయింపు ప్రక్రియను పూర్తి చేసే ప్రయత్నం చేసింది. దానివలన అన్నీ తప్పులే జరిగినాయి.

**జి.వో. 317:**

317 జీవో పైన పేర్కొన్న 124 జీవో లోని సెక్షన్ 4 ప్రకారం ఉద్యోగులను వివిధ జిల్లాలకు, జోన్లకు కేటాయించాలని మాత్రమే చెపుతున్నది. ఇందులో ఎవరికి తప్పు కనిపించదు. అసలు విషయం లోపభూయిష్టమైన అనుబంధంలో ఉన్నది. ఈ అనుబంధం సీనియారిటీని తప్ప 124లోని ఏ ఇతర మార్గదర్శకాలను గుర్తించదు. ఉదాహరణకు షెడ్యూల్ ప్రాంతాలలో ఉద్యోగుల రిక్రూట్‌మెంట్ కోసం ప్రత్యేకమైన నియమాలుంటాయి. వాటిని పాటించాలి. అదే విధంగా ఉద్యోగుల కేటాయింపులో 4(2)(బి) ప్రతీ జిల్లాలోనూ, జోనులోనూ అనుభవంలో, వయసులో వివిధ స్థాయి కలవారిని సమతూకంలో కేటాయించాలి. ఐచ్ఛికాలను కూడా పరిగణలోనికి తీసుకోవాలి.

**కేటాయింపులు ఎలా జరిగాయి?**

124 జీవోలో స్థానికతను గుర్తించక పోవడం తప్పని దాన్ని సరిచేయాలని డిమాండ్ చేస్తుంటే ప్రభుత్వం 124 లో వున్న అంశాలను కూడా పాటించలేదు. 317 ద్వారా ఇచ్చిన మార్గదర్శకాలను మామూలు పరిభాషలో చెప్పుకుంటే జరిగేది ఇది. సీనియారిటీని గుర్తించడం అవసరం. కానీ స్థానికతను విస్మరించడానికి కూడా వీలు లేదు. స్థానికతను విస్మరించడంతో పాటు ప్రభుత్వం మరొక సమస్యను కూడా సృష్టించింది. ప్రతి జిల్లాకు మొత్తం పోస్టులను ఎన్ని మంజూరు చేసినా ఆ జిల్లాకు కేటాయించవలసిన విధుల్లో వున్న ఉద్యోగ, ఉపాధ్యాయుల సంఖ్య పైన మాత్రం సీలింగ్ విధించింది. ప్రస్తుతం విధిలో వున్న ఉద్యోగులను, ఉపాధ్యాయులను, పోస్టులు ఖాళీగా వున్నా, నియమిత సంఖ్య ప్రకారమే కేటాయించాలని ఆదేశించింది. దాని వలన సీనియారిటీ ప్రకారం పోస్టింగు ఇచ్చిన తరువాత జూనియర్లను వారి స్థానికతతో నిమిత్తం లేకుండా విసిరేసినట్టు ఎక్కడెక్కడికో పంపించారు.

కొన్నిసార్లు పోస్టింగు వెనుక స్పష్టమైన కారణం కనిపించదు. ఆరోగ్య శాఖలో పనిచేసే పారా మెడికల్ సిబ్బందిని వరంగల్ నుండి నల్గొండ, ఆదిలాబాద్ జిల్లాలకు కూడా బదిలీ చేసినారు. మూడు క్యాటగిరీలకు పోస్టింగులలో ప్రత్యేక అవకాశాలు కల్పించాలని 317 జీవో పేర్కొన్నది. దీర్ఘకాలిక రోగాలు ఉన్నవాళ్లు, వికలాంగులు, కారుణ్య నియామకం పొందిన వితంతు మహిళలు. ఈ వర్గాలకు కూడా ప్రభుత్వం న్యాయం చేయలేదు. జీవోను బేఖాతరు చేసింది. ఆలుమగలను ఒకే చోట ఉంచాలన్న నిబంధనకు విరుద్ధంగా ఒక్కొకరిని ఒక్కొక్క చోట పోస్టింగు చేసినారు. దంపతులను ఒకచోట పోస్టు చేయాలన్నది కూడా పోరాటాల ఫలితంగా ఉద్యోగులు సాధించుకున్న వెసులుబాటు. వారి విషయంలో ప్రభుత్వం మానవీయ కోణాన్ని విస్మరించింది. 70 శాతం వైకల్యం వుంటేనే వికలాంగులకు ప్రత్యేక అవకాశం అని షరతు విధించడంతో వికలాంగులకు 317 జీవో ఇచ్చిన రక్షణల ప్రయోజనం దక్కలేదు. కారుణ్య నియామకంలో వచ్చిన వితంతు మహిళలు తప్ప మిగతా ఒంటరి మహిళలకు ప్రభుత్వం ఎటువంటి రక్షణ కల్పించలేదు. ఆదివాసీ ప్రాంతాలలో నియామకాలు, పోస్టింగుల విషయంలో ఉన్న ప్రత్యేక నియమాలను కూడా జివో 124కు విరుద్ధంగా ప్రభుత్వం తుంగలో తొక్కింది.

మొత్తం పోస్టులు ఎన్ని వున్నా నియమిత సంఖ్యలోనే ఉద్యోగుల, ఉపాధ్యాయులను నియమించి మిగతా పోస్టులను ఖాళీగా వుంచాలన్న నియమాన్ని ఎత్తివేస్తే ఈ సమస్య వచ్చేది కాదు. ఒక వేళ జిల్లాలోని మొత్తం పోస్టులకన్న ఎక్కువ మంది జిల్లాకు ఆప్షన్ ఇస్తే అప్పుడు ఆ జిల్లాకు సూపర్ న్యూమరరీ పోస్టులు మంజూరు చేస్తే సరిపోతుంది. కానీ ప్రభుత్వం సానుభూతితో ఆలోచించలేదు. ఏ నియమాన్ని పాటించకుండా విచ్చలవిడిగా చెట్టుకొకరిని పుట్టకొకరిని విసిరేయడంతో దిక్కుతోచని స్థితిలో ఉద్యోగులు ఉన్నారు. జూనియర్ ఉద్యోగ, ఉపాధ్యాయులను అందరినీ రూరల్ జిల్లాలకు పోస్టు చేయడంతో ఆ జిల్లాలో భవిష్యత్తులో ఖాళీలు వచ్చే అవకాశాలు లేవు. నిరుద్యోగులకు ఇది నష్టం చేసే అంశం.

15 శాతం ఉద్యోగులకే ఇబ్బంది వున్నది అని ప్రభుత్వం తన చర్యను సమర్థించుకునే ప్రయత్నం చేస్తున్నది. ఒక్కరికి కూడా అన్యాయం జరుగకూడదన్న ధోరణిని కనబర్చలేదు. ఎక్కడ వేసినా పోవాలన్నది ప్రభుత్వం చెపుతున్న రెండవ వాదన. ఈ ధోరణి పాత కాలంలో జాగీర్దార్లు, జమీందార్లు రైతులను, కూలీలను బానిసలుగా చూసే ఫ్యూడల్ సంప్రదాయాన్ని తలపిస్తున్నది. ప్రభుత్వం కూడా ప్రజాస్వామిక సంప్రదాయాలను మరిచిపోయి ఉద్యోగులను బానిసలుగా చూస్తున్నది కాబట్టి భాష అట్లా ఉన్నది. వాళ్లు మనుషులు. ప్రభుత్వం వారి పట్ల నియమాల ప్రకారం వ్యవహరించాలి. పోస్టింగులు, బదిలీలు నియమాల ప్రకారమే జరుగాలి. కనుక జరిగిన తప్పులను ప్రభుత్వం వెంటనే సరి చేయాలి. స్థానికతకు గుర్తింపు ఇవ్వాలి.

సమస్యలు విన్నవిస్తూ బాధితులు ఉత్తరాలు ఇచ్చినా వాటి అతీగతీ తెలియదు. ఈ లోగా రాత్రికి రాత్రి జిల్లాలకు కేటాయింపు మాత్రమే కాదు – కౌన్సిలింగ్ ప్రకారం బదిలీ చేయాలన్న నియమాన్ని తుంగలో తొక్కి – డైరెక్టుగా పోస్టింగ్ ఆర్డర్లు కూడా వాట్సప్‌కు వచ్చినాయి. చేరడానికి కూడా ఎక్కువ సమయం ఇవ్వలేదు. చేరకపోయినా చేరినట్టుగా భావిస్తామని ప్రకటించడంతో గత్యంతరం లేక అందరూ డ్యూటీలో చేరి పోయారు. పారదర్శకత లేదు, పద్ధతి లేదు, స్థానికతకు గుర్తింపు లేదు. ఇష్టానుసారంగా ఉద్యోగులను, ఉపాధ్యాయులను పోస్టింగు చేసినారు. పశువులను తరిమినట్టు వివిధ జిల్లాలకు విసిరేసినారని ఉద్యోగులు, ఉపాధ్యాయులు అంటూనే ఉన్నా వినే నాథుడేడి? సమస్యలకు పరిష్కారం కనపడక ఇప్పటికీ ఆందోళనలు చేస్తూనే ఉన్నారు. ప్రభుత్వం నుండి స్పందన లేదు. 124 జీవో ప్రకారం ఆరు నెలల వరకు బాధితులు తమకు జరిగిన నష్టాన్ని ప్రభుత్వానికి విన్నవించవచ్చు. కానీ ఆ అవకాశం ఎవరికీ దక్కలేదు. ఇచ్చిన ఉత్తరాలను పట్టించుకుంటారో లేదో తెలియదు. ఇదీ ఉద్యోగుల కేటాయింపు వ్యవహారం. ప్రభుత్వం తెలంగాణా ఉద్యమానికి ఆత్మ వంటి స్థానికతకు గౌరవం లేకుండా చేసింది. చాలా మంది ఉద్యోగులు ఆ రకంగా అస్తిత్వాన్ని కోల్పోయి బతకవలసి వస్తున్నది. ఏ అస్తిత్వ పరిరక్షణ కోసం కొట్లాడి తెలంగాణాను తెచ్చుకున్నామో ఆ రాష్ట్రంలో ఆత్మ గౌరవం, అస్తిత్వం సమాధి అయ్యాయి. అందుకే 317 జీవోను రద్దు చేయాలి. 124 జీవోలోని సెక్షన్ 4ను సవరించి స్థానికత అంశాన్ని జోడించాలి.

*(రచయిత తెలంగాణ జన సమితి నాయకులు)*

వీ

# మార్కెట్ విలువ పెంపు పర్యవసానాలు

*ఆరు నెలల్లో రెండు సార్లు భూముల మార్కెట్ విలువలను సవరించిన ప్రభుత్వ విధానాలు అంతిమంగా ప్రజలపై ఎటువంటి పర్యవసానాలకు దారితీస్తాయో చర్చిస్తున్నారు* **తండా సదానందం**

**భూ**మి బువ్వ పెడుతుంది, చదువు బ్రతుకునిస్తుంది అంటారు పెద్దలు. మానవ మనుగడకు భూమి అతిముఖ్య వనరు. మానవుడే కాదు సకల జీవులకు జీవన వనరు భూమి. భూమి లేనిది మనిషి జీవం లేదు. మానవుడికి కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డ భూమి మీదనే ఆధారపడతాయి. ఉత్పత్తి సాధనాలలో అతి ముఖ్యమైనది భూమి. ఏ వస్తువు ఉత్పత్తి చేయాలన్నా, ప్రాజెక్టు నిర్మించాలన్నా, ఏఅభివృద్ధి కార్యక్రమాలు చెయ్యాలన్న మొదట కావలసిన వనరు భూమి.

ప్రకృతి ప్రసాదించిన భూమిపై మనుషులందరికీ సమ భాగస్వామ్యం ఉండాలి. కానీ ప్రభుత్వ విధానాల వల్ల అనేక అంతరాలు అధికమయ్యాయి. ధనవంతులకు విలాసవంతమైన సకల సౌకర్యాలతో కూడిన భవనాలు, సామాన్యులకు తలదాచుకునేందుకు చిన్న గూడు కూడా లేనటువంటి పరిస్థితి దాపురించింది. పేదలు, దిగువ మధ్య తరగతి, మధ్య తరగతి వారికి సొంతింటి కల కలగానే మిగిలిపోతోంది. దానికి కారణం తెలంగాణలో భూముల మార్కెట్ విలువ పెరిగింది. రిజిస్ట్రేషన్ చార్జీలు కూడా విపరీతంగా పెరిగాయి. తెలంగాణలో వ్యవసాయ వ్యవసాయేతర భూములు, ఆస్తుల మార్కెట్ విలువలు పెరిగాయి. ఫిబ్రవరి 1 నుండి కొత్త మార్కెట్ విలువలు అమల్లోకి వచ్చాయి. కొత్త విలువల ప్రకారమే రిజిస్ట్రేషన్లు జరుగుతున్నాయి.

తెలంగాణ రివిజన్ ఆఫ్ మార్కెట్ వాల్యూస్ గైడ్‌లైన్స్ అండ్ రూల్స్ 1998 ప్రకారం భూముల విలువను సవరిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. వ్యవసాయ భూముల మార్కెట్ విలువ కనీసం 50 శాతానికి, ఖాళీ స్థలాల విలువలను 35 శాతానికి, ఫ్లాట్ల విలువలను 25 శాతానికి సవరించినట్లుగా ప్రభుత్వం ఉత్తర్వుల్లో పేర్కొంది. ఈ విలువలకు రిజిస్ట్రేషన్ చార్జీలు 7.5 శాతం అమలు అవుతున్నాయి. సవరించిన మార్కెట్ విలువతో తొలిసారిగా రాష్ట్రంలో చదరపు గజం ఖాళీ స్థలానికి లక్ష రూపాయలకు పైగా పెరిగింది. రాష్ట్రంలోని 141 సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయాల్లో కొత్త మార్కెట్ విలువలు అమలవుతున్నాయి.

వివిధ జిల్లా కేంద్రాలలో, మునిసిపాలిటీ ప్రాంతాలలో, గ్రామీణ ప్రాంతాలలో, హైదరాబాద్‌లో రకరకాలుగా మార్కెట్ విలువలను పెంచడం జరిగింది. హైదరాబాద్‌లో స్థిరాస్తి మార్కెట్ విలువలు అతి భారీగా పెరిగాయి. నగరం చుట్టూ ఉన్న ప్రాంతాలలో ఖాళీ స్థలాల్లో, అపార్ట్‌మెంట్లలో స్థిరాస్తి మార్కెట్ విలువలు మధ్యతరగతి వారు మోయలేనంతగా పెరిగాయి.

హైదరాబాద్ జిల్లాలో అత్యధికంగా గజం 84,500 ఉన్న మార్కెట్ విలువను 1,14,100కు పెంచారు. అనగా 34.9 శాతం పెరిగింది. తర్వాత స్థానంలో మేడ్చల్, ఖమ్మం, రంగారెడ్డి, సంగారెడ్డి జిల్లాలు ఉన్నాయి. ఈ జిల్లాల్లో మార్కెట్ విలువ 39,000 నుండి నూతన విలువల ప్రకారం 52,700గా నిర్ణయించారు. మహబూబాబాద్, నాగర్ కర్నూల్, ఆసిఫాబాద్, భూపాలపల్లి లాంటి గ్రామీణ ప్రాంత జిల్లాల్లో 26 శాతం చొప్పున సవరించారు. రాష్ట్రంలోనే అతి తక్కువ మార్కెట్ విలువ భూపాలపల్లి జిల్లాల్లో చదరపు గజం విలువ రు. 1,750 నుంచి రు. 2,400 వరకు పెంచారు. మార్కెట్ విలువ ఉత్తర్వులతో పాటు రాష్ట్ర వ్యాప్తంగా ముప్పై మూడు జిల్లాలకు 33 మంది నోడల్ అధికారులను నియమించారు. రాష్ట్రంలో వ్యవసాయ భూముల విలువలను కూడా భారీగా పెంచారు. 42 గ్రామాల పరిధిలో 150 శాతం, 77 గ్రామాల పరిధిలో 125 శాతం, 90 గ్రామాల పరిధిలో 100 శాతం, 472 గ్రామాల పరిధిలో 75 శాతం చొప్పున విలువలను పెంచారు. రాష్ట్ర వ్యాప్తంగా కనీస విలువల పెరుగుదలను 50 శాతానికి సవరించినట్లు స్టాంప్స్ అండ్ రిజిస్ట్రేషన్ శాఖ తెలియజేస్తుంది.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఆరు నెలల్లోనే మరోసారి భూముల మార్కెట్ విలువలు పెంచడంతో ఇంటి స్థలం, ఫ్లాట్ కొనుగోలులో రిజిస్ట్రేషన్ చార్జీలు గుదిబండగా మారాయి. సామాన్య ప్రజలు, మధ్యతరగతి వాళ్లు సొంత ఇంటి కోసం, పిల్లల భవిష్యత్తు కోసం స్థిరాస్తి కొనుగోలు చేస్తే రిజిస్ట్రేషన్ ఛార్జీలు విపరీతంగా చెల్లించాల్సి వస్తుందని ఆందోళన చెందుతున్నారు. గత సంవత్సరం జూలై 22న భూముల మార్కెట్ విలువ పెంచారు. అపార్ట్‌మెంట్లోని ఫ్లాట్‌ల ధరలను 20 నుంచి 30 శాతం, ఖాళీ స్థలాలు అయితే 30 నుంచి 50 శాతం పెంచారు. 6 శాతంగా ఉన్న స్టాంప్ డ్యూటీని, రిజిస్ట్రేషన్ చార్జీలను 7.5 శాతానికి పెంచారు.

ఇప్పుడు మరోసారి భూముల మార్కెట్ విలువలను పెంచడానికి కమిటీల సూచన ప్రకారం పెంచడం జరిగింది. దీంతో ఆరు నెలలోనే రెండింతలకు పైగా భారం ప్రజలపై మోపబడింది. ఉదాహరణకు హయత్‌నగర్‌లో కొన్ని నెలల క్రితం 1,000 చదరపు అడుగుల ప్లాటు మార్కెట్ విలువ చదరపు అడుగుకు 2,200 ప్రకారం 22

లక్షలకు స్టాంప్ డ్యూటీ రిజిస్ట్రేషన్ చార్జీలు 6 శాతం చొప్పున 1.32 లక్షలు అయ్యేది. గత ఏడాది జూలై 22 తర్వాత మార్కెట్ విలువ చదరపు అడుగుకు 3200కు పెంచగా 32 లక్షలకు పెంచిన రిజిస్ట్రేషన్ చార్జీల ప్రకారం 7.5 శాతం చొప్పున 2.40 లక్షలు చెల్లించడం జరుగుతుంది. ఈ నెల ఫిబ్రవరి 1 తర్వాత మార్కెట్ విలువ చదరపు అడుగుకు 4,000గా పెంచగా 40 లక్షల విలువకు రిజిస్ట్రేషన్ చార్జీలు 7.5 శాతం చొప్పున 3 లక్షలు చెల్లించాల్సి వస్తుంది. ఇలా ఆరు నెలల్లోనే రెట్టింపు అవ్వడం ఇబ్బందికరం.

**భూముల విలువ పెంచడం వల్ల ఎవరికి లాభం?**

భూముల విలువ పెరగడం వల్ల ప్రభుత్వం, అమ్మకందారు, కొనుగోలుదారు ముగ్గురు ప్రత్యక్షంగా ప్రభావితం అవుతారు. ఈ ముగ్గురిలో ప్రభుత్వానికి భారీగా ఆదాయం సమకూరుతుంది. గతేడాది జులై నెలలో సవరించిన విలువలు రిజిస్ట్రేషన్ చార్జీల పెంపుతో నెలకు రు. 400 కోట్ల నుంచి 500 కోట్ల వరకు అదనపు ఆదాయం వచ్చింది. తాజాగా భూముల విలువ పెంపుతో ప్రతి నెల మరో 200 కోట్లకు పైగా ఆదాయం సమకూరుతుందని అంచనా వేస్తున్నారు. దీంతో రాష్ట్రంలో రిజిస్ట్రేషన్ లావాదేవీల ద్వారా వచ్చే ఆదాయం నెలకు సగటున 1,200 కోట్లు ఉంటుందని, అది సంవత్సరానికి 15 వేల కోట్లకు చేరుతుందని భావిస్తున్నారు.

గతేడాది వరకు రిజిస్ట్రేషన్ శాఖ ద్వారా కేవలం 5,500 కోట్ల నుంచి 7,000 కోట్ల వరకు రాబడులు వచ్చేవని, తాజా సవరణలతో ఏటా 15,000 కోట్లకు పెరుగుతుందని అంచనా. రాష్ట్ర ప్రభుత్వం సొంత పన్నుల ఆదాయం ఒక స్టాంపులు రిజిస్ట్రేషన్ల శాఖ ద్వారానే ఏడాదికి అదనంగా 8 వేల కోట్ల రూపాయల వరకు పెరగవచ్చు. ఇలా భూముల, ఆస్తుల విలువలను సవరించడం ద్వారా రాష్ట్ర ప్రభుత్వ ఖజానాకు కాసుల వర్షం కురుస్తుంది.

అమ్మకందారుకి భూముల విలువ పెరగడం వల్ల భూముల ధరలకు రెక్కలు వస్తాయి. తద్వారా లాభం జరిగే అవకాశం ఉంటుంది. అంతిమంగా మానవునికి కనీస అవసరమైన గూడు నిర్మించుకోవడానికి స్థలం కొనుక్కోవాలంటే భూముల విలువ పెరగడం వల్ల కొనుగోలుదారులకి విపరీతంగా కొనుగోలు వ్యయం పెరుగుతుంది.

భూములకు రెండు రకాల రేట్లు ఉంటాయి. 1. ప్రైవేట్ మార్కెట్ విలువ, దానిని బహిరంగ మార్కెట్ విలువ అని కూడా అంటారు. 2. ప్రభుత్వం నిర్ణయించే మార్కెట్ విలువ. సాధారణంగా భూములను ప్రైవేటు మార్కెట్ విలువ ప్రకారం కొని గవర్నమెంట్ మార్కెట్ విలువ ప్రకారం రిజిస్ట్రేషన్ చేపిస్తారు. ప్రైవేట్ మార్కెట్ విలువ గవర్నమెంట్ మార్కెట్ విలువకు మూడు నాలుగు రెట్లు, కొన్ని ప్రాంతాలలో ఇంకా ఎక్కువగా కూడా ఉంటుంది. ఈ రెండింటి మధ్య వ్యత్యాసం ఎక్కువగా ఉండటం వలన వాటిని సమతుల్యం చేయడానికి భూముల విలువ పెంచుతున్నామని ప్రభుత్వాలు చెబుతున్నాయి. వాస్తవానికి ప్రభుత్వ ఆదాయాన్ని పెంచుకోవడానికి భూముల విలువ పెంపును ఒక వనరుగా ఉపయోగించు కుంటున్నాయి. రాష్ట్ర ప్రభుత్వాలకు జీఎస్టి ద్వారా ఆదాయం పడిపోయింది. ప్రభుత్వాలకున్న పరిమిత ఆదాయ మార్గాలలో పెట్రోల్ డీజిల్ రేట్లు పెంచడం, ఉక్సైజ్, ఆదాయం, రిజిస్ట్రేషన్ చార్జీలు. పెట్రోల్ డీజిల్, ఆల్కహాల్‌లపై భారం మోపితే ప్రజలు భరించలేరు. కనుక రిజిస్ట్రేషన్ చార్జీలు పెంచి ఆదాయాన్ని సమకూర్చుకునే ఆలోచనలు ప్రభుత్వాలు చేస్తున్నాయి. అందులో భాగంగానే ఆరు నెలల లోపే మళ్లీ రిజిస్ట్రేషన్ చార్జీలు పెంచడం జరిగింది.

దీనివల్ల రియాల్టీ రంగంపై తీవ్ర ప్రభావం పడనుంది. ఇంటి నిర్మాణం ఖర్చులు, ఇంటి కొనుగోలు ఖర్చులు, భూమి కొనుగోలు ఖర్చులు బాగా పెరిగి పోతాయి. కరోనా సంక్షోభంలో ప్రజల ఆదాయాలు పడిపోయి, ఉపాధి దొరకక కొనుగోలు శక్తి తగ్గిపోవడం వల్ల రియల్ ఎస్టేట్ రంగం విపరీతంగా నష్టాన్ని చవిచూసింది. సామాన్య ప్రజలు కూడా తిండి గింజల కోసం ఇబ్బందులు పడుతున్న సమయంలో ఇంటి కొనుగోలు, ప్లాట్ల కొనుగోలుపై ఆసక్తి చూపరు. ఈ మధ్య కాలంలోనే వ్యవస్థలన్నీ కుదుటపడి ప్రజల ఆదాయాలు మెరుగై కొనుగోలు శక్తి పెరగడం వలన స్థిరాస్తుల కొనుగోలు వైపు ఆసక్తి చూపుతున్న సమయంలో భూముల విలువల పెంపు ద్వారా రిజిస్ట్రేషన్ ఛార్జీలు బాదడం మూలిగే నక్క మీద తాటిపండు పడ్డ చందమే. ఇది సామాన్య ప్రజలకు పెనుభారం కాగా, కార్పొరేట్ వర్గీయులకు అవకాశం.

ఇది ఇలా ఉండగా భారీగా పెరిగిన ఇంటి నిర్మాణ సామాగ్రి ధరలతో సామాన్య పేద ప్రజలు ఇంటిని కట్టలేరు, కొనలేరు. మండుతున్న స్టీల్ ధరలు, సిమెంటు ధరలు, లేబర్ ధరలు, మార్బుల్, ఇటుక, పైపులు 78 రకాల నిర్మాణ వస్తువుల ధరలు భగ్గుమంటుండటంతో, అధిక ధరలను వెచ్చించి ఫ్లాట్ కొనుగోలు చేయడం మధ్యతరగతి ప్రజలకు సాధ్యం కాదు. వీటికి తోడు భూముల విలువ పెంపు, రిజిస్ట్రేషన్ చార్జీల మోత తోడవడంతో సామాన్య మధ్యతరగతి ప్రజలకు సొంతింటి కల నెరవేరే అవకాశం లేదు.

దారిద్ర్య రేఖకు దిగువనున్న పేద ప్రజలకు ప్రభుత్వమే గృహవసతి కల్పిస్తూ ఉండగా, సంపన్నులు తమ సొంత డబ్బుతో విలాసవంతమైన భవనాలు నిర్మించుకుంటూ ఉండగా మధ్య తరగతి సామాన్య ప్రజలు ప్రభుత్వం కల్పించే గృహవసతికి నోచుకోక, సొంతంగా ఇంటిని నిర్మించుకోలేక కొట్టుమిట్టాడుతున్న సమయంలో భూములకు కొత్త విలువ పెంపు ప్రతిపాదనలు చేయడం కక్షపూరితమైనది.

ప్రభుత్వం భూములకు కొత్త మార్కెట్ విలువను నిర్ణయించడంతో ఆ విలువతో పాటే రాష్ట్రంలోని నగరాల్లో పట్టణాల్లో, మేజర్ గ్రామ పంచాయతీలలో భవన నిర్మాణ పనులకు అనుమతులు పొందడంపై మరింత భారం పడే అవకాశం ఉంది. భూముల విలువ పెంపుతో పాటే నిర్మాణ అనుమతుల ఫీజులు కూడా పెరుగుతాయి. ముఖ్యంగా వేకెంట్ ల్యాండ్ టాక్స్ (వీఎల్‌టి) ను భూముల మార్కెట్ విలువ ఆధారంగా నిర్ధారించడంతో అది భారీగా పెరగనుంది. భవన నిర్మాణ అనుమతి కోసం దరఖాస్తు చేసుకుంటే ప్రాసెసింగ్ ఫీజు, డెవలపింగ్

ఫీజు తోపాటు అదనంగా విఎల్‌టి ఛార్జీలను కూడా చెల్లించవలసి ఉంటుంది. ఆ ప్రాంతంలో ఉన్న మార్కెట్ విలువ ఆధారంగా 0.5 శాతం నుండి 2 శాతం వరకు విఎల్‌టి ఛార్జీలను స్థానిక సంస్థలు వసూలు చేస్తాయి. ఫలితంగా సామాన్య మధ్యతరగతి ప్రజలకు ఇంటి నిర్మాణ అనుమతులు పెను భారంగా మారే అవకాశం కలదు. ప్లాట్లను కొనుగోలు చేసేవారు వాటిని సత్వరమే వినియోగంలోకి తీసుకు రారు. దీంతో ఆ స్థల యజమాని నిర్మాణ అనుమతులకు వచ్చిన సందర్భంలో అక్కడి భూముల మార్కెట్ విలువ ప్రకారం విఎల్‌టి చార్జీలు వసూలు చేస్తారు. ఇకపై అలా కాకుండా ఆస్తిపన్ను మాదిరిగా ప్రతి ఏడాది ఛార్జి విధించేందుకు రంగం సిద్ధమైంది. ఓ వ్యక్తి 100 గజాల స్థలాన్ని కొనుగోలు చేస్తే, రిజిస్ట్రేషన్ జరిగిన నాటి నుంచి ఎన్ని సంవత్సరాలు ఆస్థలం ఖాళీగా ఉన్నది లెక్కించి, అన్ని సంవత్సరాలకు విఎల్‌టి విధించడం జరుగుతుంది. మున్సిపాలిటీలు కార్పొరేషన్లలో కేవలం విఎల్‌టి మాత్రమే వసూలు చేస్తుండగా, జిహెచ్ఎంసి పరిధిలో అదనంగా లైబ్రరీసెస్ కూడా వసూలు చేస్తున్నారు. ఇవన్నీ కూడా భూముల మార్కెట్ విలువ ఆధారంగానే నిర్ణయించడం వల్ల సామాన్య మధ్యతరగతి ప్రజలకు ఇంటి నిర్మాణం సాధ్యం కాదు.

**శాస్త్రీయత లోపించిన భూముల విలువ పెంపు విధానం:**

రాష్ట్ర ప్రభుత్వ నికర ఆదాయం సంక్షేమ పథకాలకు భారీ మొత్తంలో ఖర్చు చేయడం వల్ల ప్రతి నెల ఉద్యోగులకు వేతనాలు చెల్లించలేని పరిస్థితిలో ఉన్నందున ఆదాయాన్ని పెంచుకునేందుకు రియల్ ఎస్టేట్ రంగంపై దృష్టిసారించింది. ప్రభుత్వం ఉత్పాదక రంగంపై దృష్టిపెట్టి ఆదాయాన్ని పెంచుకునే మార్గాలను అనుసరించకుండా, సంపదను సృష్టించే కార్యక్రమాలను చేపట్టకుండా, వచ్చిన ఆదాయాన్ని ఓటు బ్యాంకు రాజకీయాల కోసం ఇబ్బడి ముబ్బడిగా ఉచితంగా సంక్షేమ కార్యక్రమాల పేరిట పంచి పెట్టడం, చిల్లి వడ్డ జేబులో డబ్బులు దాయడమే అవుతుంది. తిరిగి రాబట్టుకునేందుకు ప్రజలపైనే పన్నులు, రిజిస్ట్రేషన్ ఛార్జీలు, యూజర్ ఛార్జీల పేరిట అధికంగా వసూలు చేస్తూ ఉండటం ఆశ్చర్యకరం.

రాష్ట్రమంతటా ప్రధాన రహదారుల వెంట ఎకరం భూమి కోటి రూపాయలకు పైగా పలుకుతున్న నేపథ్యంలో వాటి మార్కెట్ ధరలను పెంచడం ద్వారా ఆదాయం పెంచుకోవచ్చని వ్యవసాయ, వ్యవసాయేతర, అపార్ట్‌మెంట్ల ఫ్లాట్ల విలువలను పెంచుతూ ఉత్తర్వులు జారీ చేసింది. ఉమ్మడి రాష్ట్రంలో ప్రతి మూడు సంవత్సరాలకు ఒకసారి భూముల ధరలు సవరించే వారు. 2013 ఏప్రిల్ 1న చివరిసారిగా భూముల విలువను పెంచారు. 2014లో తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తర్వాత 8 ఏళ్ల వరకు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం భూముల విలువలను పెంచలేదు. ఇంతకాలం భూముల విలువ పెంచకపోవడానికి కారణం ప్రభుత్వం చేపట్టే అభివృద్ధి కార్యక్రమాలు అయిన నీటిపారుదల ప్రాజెక్టు నిర్మాణాలకు, రహదారుల నిర్మాణానికి, భారీ పరిశ్రమల స్థాపనకు భూసేకరణ చేయడమే. భూనిర్వాసితులకు ప్రభుత్వం మార్కెట్ విలువ ప్రకారం నష్ట పరిహారం చెల్లించవలసి ఉన్నందున భూముల విలువ పెంపుపై ఎలాంటి నిర్ణయం తీసుకోలేదు. భూసేకరణ పూర్తయిన తర్వాత లోటును పూడ్చుకోవడానికి ఆరు నెలల్లోనే రెండుసార్లు భూముల విలువ పెంచడం గమనార్హం.

భూముల విలువ పెంచే క్రమంలో కూడా ఎలాంటి శాస్త్రీయత పాటించలేదు. వ్యవసాయ, వ్యవసాయేతర భూములకు ఒకే విధంగా పెంచారు. జాతీయ, రాష్ట్ర రహదారుల ప్రాతిపదికన భూముల విలువ పెంచడం జరిగింది. అలాకాకుండా డిమాండ్ అధికంగా ఉన్న పొటెన్షియల్ ఏరియాలో పెంచితే బాగుండేది. వ్యవసాయ భూములకు మినహాయింపు ఇవ్వకపోవడం నష్టదాయకం. 1971 వరకు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ భూమి కొనుగోలు చేయాలంటే తహసిల్దార్ పర్మిషన్ తీసుకోవాల్సి ఉండేది. దానిని రద్దు చేయడం వలన నేడు వ్యవసాయ భూమి వ్యవసాయేతర భూమిగా మారింది. అందులో సాగు చేయకపోవడం వలన బీడుగా ఉంచడం వలన ఉత్పత్తులు తగ్గిపోతున్నాయి. కర్ణాటక, మహారాష్ట్ర, ఉత్తర ప్రదేశ్, బెంగాల్ రాష్ట్రాలలో వ్యవసాయ భూమి కొనాలంటే వ్యవసాయదారుడై ఉండాలనే నిబంధన ఉంది. అలా కాకుండా బహిరంగ మార్కెట్లో పెట్టడం వలన భూములు ఖాళీగా ఉంటున్నాయి. ఉత్పత్తి తగ్గి వ్యవసాయ రంగం కనుమరుగయ్యే అవకాశం ఉంది. వ్యవసాయ భూములకు విలువ పెంచకుండా తగ్గించి, రిజిస్ట్రేషన్ ఛార్జీలు కూడా తగ్గించి ప్రోత్సహించడం వల్ల వ్యవసాయ రంగ అభివృద్ధికి పాటు పడవచ్చు. బహిరంగ మార్కెట్లో భారీగా డిమాండ్ ఉన్న ప్రాంతాల్లో కేవలం 10 నుంచి 20 శాతం వరకు మార్కెట్ విలువలు పెంచారు. ఐదు కోట్ల నుంచి 10 కోట్ల మధ్య ధరలు పెరుగుతున్న ప్రాంతాల్లో 20 శాతానికి సవరిస్తే, పది కోట్ల పైగా ధరలు ఉన్న భూములకు 10 శాతం వరకే పెంచారు. అలాగే రహదారుల పక్కనే ఉన్న ప్రాంతాల భూములకు, దూరంగా లోపలి ప్రాంతాల భూములకు ఒకే విధంగా రిజిస్ట్రేషన్ ఛార్జీలు ఉండడం సరి అయినది కాదు. భూముల విలువ పెంపులో సీలింగ్ విధానం ఉంటే బాగుండేది. డిమాండ్ ఉన్న ప్రాంతాల్లో భూములకు అధికంగా, డిమాండ్ లేని ప్రాంతాల భూములకు అత్యల్పంగా స్టాంప్ డ్యూటీ నిర్ణయిస్తే బాగుంటుంది. స్టాంప్ డ్యూటీ తక్కువగా ఉండటం వల్ల, చెల్లించడానికి సులభంగా ముందుకొస్తారు. అది ఎక్కువగా ఉంటే ఎగ్గొట్టడానికి ప్రయత్నం చేస్తారు. కర్ణాటక రాష్ట్రంలో అతి తక్కువగా 3 శాతం మాత్రమే స్టాంప్ డ్యూటీ ఉంది. మహారాష్ట్రలో రిజిస్ట్రేషన్ ఛార్జీలు గరిష్ఠంగా 30 వేలు మాత్రమే. ఇతర దేశాలలో కూడా స్టాంప్ డ్యూటీ తక్కువగా ఉంటుంది. అదే విధంగా తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కూడా స్టాంప్ డ్యూటీని తగ్గించాల్సిన అవసరం ఉంది.

భూముల విలువ పెంపు నిజాయితీగా డబ్బు సంపాదించిన వారికి ఇబ్బందిగా, అవినీతిపరులు, అక్రమార్జన చేసే వాళ్లకు అనుకూలంగా ఉంటుంది. ప్రైవేట్ మార్కెట్ విలువ, ప్రభుత్వ మార్కెట్ విలువల మధ్య అంతరాలు ఎక్కువగా ఉండడం వల్ల నల్ల ధనం ఉన్నవారికి

# వనదేవతలుగా మారుతున్న మన్యం వీరులు

***ఒకప్పుడు ఆదివాసి హక్కుల కోసం పోరాడిన వీరయోధులను ఇవాళ మనువాద పాలకవర్గాలు వనదేవతలుగా మార్చడం వెనుక కుట్రను వివరిస్తున్నారు* పొరండ్ల శ్రీనివాస్**

ఆదివాసీ పోరాటాల చరిత్రంతా ఆత్మగౌరవ పోరాటాల చరిత్రే. అడవి పైన అటవీ సంపద పైన హక్కుల కొరకు సాగిన సాయుధ పోరాటాల సమరాలే. హక్కులకోసం ఆయుధాలు పట్టి రక్త తర్పణలతో ప్రాణత్యాగాలతో చట్టాలను సాధించుకున్నారు.

నేడు ఆదివాసులకున్న రక్షణ చట్టాలన్ని నాటి ఆదివాసీ అమరుల త్యాగాల ఫలితాలు. మన్యం తిరుగుబాట్ల విజయాలు. ఏ పాలకవర్గాలు ఏ ప్రభుత్వాల దయా దాక్షిణ్యాలతో వచ్చినవికావు. ఎవరు ఆదివాసులపై ప్రేమ కరుణ జాలితో ఇచ్చినవి అసలే కాదు. ప్రతి రక్షణ చట్టం వెనక ప్రాణత్యాగాలు ఎన్నో ఉన్నాయి. ప్రతి హక్కు వెనకాల రక్త తర్పణలెన్నో ఉన్నాయి. అడవితల్లి బిడ్డలుగా అడవి అందించిన సాంప్రదాయ ఆయుధాలతో వీరోచితంగా పోరాడి యుద్ధరంగంలో అసువులు బాసిన అరుణతారలు, పొద్దు పొడుపులు, వేగుచుక్కలు బిర్సాముండా, కొమరం భీం, రాంజీ గోండ్, ద్వారబంధాల చంద్రయ్య, సోయం గంగులు, సమ్మక్క, సారలమ్మ, జంపన్నలు. వీరి పోరు స్ఫూర్తి, వీరి త్యాగనిరతి, అంకితభావం, నేటి ఆదివాసీ సమాజం పుణికిపుచ్చుకొని వర్తమాన ఉద్యమాలను నిర్మిస్తూ పాలకుల, ప్రభుత్వాల కుట్రలను తిప్పికొట్టుతున్నారు. ఆదివాసీ వ్యతిరేక విధానాలపై అడవిబిడ్డలు మన్యంలో విల్లంబులెత్తుతున్నారు. ప్రభుత్వాలపైన తిరుగుబాటును ప్రకటించి చట్టాల రక్షణ కోసం హక్కుల హరింపుకు వ్యతిరేకంగా జీవించే హక్కుకోసం పోరాటాలు సాగిస్తున్నారు. ఇది నిన్న నేడు జరుగుతున్న గిరిజనం చరిత్ర. మరి పాలకులు ఇప్పుడు చేస్తున్నది ఏమిటి? రేపు ఏమి జరుగబోతుంది? ఆదివాసీ సమాజం ఆలోచన చేయాలి. అసలు విషయాన్ని గ్రహించాలి.

పాలకులు సమ్మక్క సారలమ్మలను వన దేవతలుగా మార్చి మేడారంలో ఘనంగా జతర జరుపుతున్నారు. ప్రజలు పెద్ద ఎత్తున మొక్కిన మొక్కులు తీర్చే తల్లులంటూ బెల్లం గద్దల తూకంతో మొక్కులు తీర్చుకుంటున్నారు. వన దేవతలంటూ మనువు సంతతి వారసులు ప్రోత్సహిస్తున్నారు. భక్తులు సమర్పిస్తున్న కానుకలను ఖజానాలో నింపుకుంటున్నారు పాలకులు. జల్, జంగల్, జమీన్ కోసం పోరాడి అమరులైన ఆదివాసీ అమరవీరులను వన దేవతలుగా ఎందుకు మార్చారు? సమ్మక్క, సారలమ్మ, జంపన్నల నిజమైన జీవిత చరిత్రలను మరుగుపర్చి మసకబార్చడం దేనికి? ఆదివాసీ సమాజానికి అసలు చరిత్ర తెలియకుండా చేయడంలో పాలకుల పెద్ద కుట్ర

---

సులభంగా, నిజాయితీగా కష్టపడి చెమటోడ్చి సంపాదించిన వారికి, వేతనశర్మలకు బహు భారంగా ఉంటుంది. ఒక ఉద్యోగి, తన జీవితం, సర్వీస్ అంతా తాకట్టు పెట్టి లోన్ తీసుకొని ఇల్లు నిర్మించుకుంటే 7.5 శాతంతో, లైబ్రరీ సెస్ కలిపి రిజిస్ట్రేషన్ ఛార్జీలు వసూలు చేయడం వల్ల తీవ్ర నష్టదాయకం. అక్రమార్జన దారులకు నల్లధనం చలామణిలో తేవడానికి పనికి వస్తుంది. కష్టపడి సంపాదించిన వారికి అతి కష్టంగా, అవినీతి పరులకు అక్రమార్కులకు బహుమతి ఇవ్వడం లాంటిదిగా ఉంది.

**ముగింపు :**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఆరు నెలలు కాకముందే రెండోసారి భూముల విలువను పెంచడం సమంజసం కాదు. 30 శాతం పెంచుతున్నామని చెబుతున్నా కొన్ని ప్రాంతాల్లో వంద శాతం పైగా పెరిగింది. ఇది వినియోగదారులకు భారమే కాకుండా స్థిరాస్తి రంగానికి కూడా తీవ్ర నష్టదాయకం. ధరణితో రైతుల సమస్యలు తీరకముందే ధరల పెంపు భూతం పేద, మధ్యతరగతి వారిని వెంటాడుతున్న తరుణంలో భూముల మార్కెట్ విలువ పెంచడం దుర్మార్గం. ఆకాశాన్నంటుతున్న భూముల విలువలు అవకాశవాదులకు కోట్ల రూపాయలు కురిపిస్తున్నాయి. దీంతో తెలంగాణ రాష్ట్రంలో స్థిరాస్తి మోసాలు, నేరాలు అధికమయ్యాయి. ప్రజాప్రతినిధుల, వారి అనుచరుల భూకబ్జాలు అధికమయ్యాయి. ప్రజల సంక్షేమం, సామాజిక న్యాయం కోసం ఆలోచించే ప్రభుత్వాలు అయితే కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డ అందించేందుకు కృషి చేయాలి తప్ప, జీవితాంతం కష్టపడ్డ చిన్న ఇల్లు నిర్మించుకోలేని పరిస్థితులు కల్పించడం, భూముల విలువ పెంపుతో రిజిస్ట్రేషన్ ఛార్జీల భారం వేయడం విచారకరం. రిజిస్ట్రేషన్ చార్జీలు 3.5 శాతం నుండి నాలుగు శాతం కంటే ఎక్కువ ఉండకూడదు. భూముల విలువల్లో వ్యత్యాసం ఉన్న చోట పెంచుకుంటే ప్రభుత్వానికి ఆదాయం వస్తుంది. కానీ సగటు వ్యక్తి కూడా ఇల్లు పొందే విధంగా ప్రభుత్వ విధానాలు ఉంటే మంచిది. ప్రజలపై ప్రభావితమయ్యే అంశం కాబట్టి ప్రజలతో చర్చించి, రియల్ ఎస్టేట్ రంగంపై ఆధారపడిన వారితో సంప్రదింపులు చేసి భూముల కొత్త విలువలు నిర్ధారిస్తే శాస్త్రీయంగా ఉండేది. రాజ్యాంగంలోని ఆర్టికల్ 21 ఎ ప్రకారం గౌరవప్రదంగా జీవించేందుకు ప్రభుత్వం సత్వర చర్యలు తీసుకోవాల్సి ఉండగా, అందుకు వ్యతిరేకంగా ప్రభుత్వ విధానాలు ఉండటం రాజ్యాంగ ఉల్లంఘనే. రాజ్యాంగం ఉల్లంఘించే పాలకులు రాజ్యాంగాన్ని మార్చాలని కోరడం హాస్యాస్పదం.

*(రచయిత టిపిటిఎఫ్ జిల్లా ఉపాధ్యక్షుడు, మహబూబాబాద్)*

# సింగరేణిలో తెలంగాణ ఆకాంక్షలు కొనసాగాలి

*తెలంగాణ రాష్ట్ర సమితి పాలనలో సింగరేణి గనులలో కొనసాగుతున్న అస్తవ్యస్త, కార్మిక వ్యతిరేక, ప్రజా వ్యతిరేక విధానాలను వివరిస్తున్నారు* **మేరుగు రాజయ్య**

**భూ**విజ్ఞాన శాస్త్రవేత్త డబ్ల్యూటి బ్లేన్‌ఫోర్ట్ 1871లో గోదావరి నది పరీవాహక ప్రాంతాల్లో కామ్తి సముదాయంకు చెందిన ఇసుక రాతి పొరలను పరీక్షించి బొగ్గు లభించే అవకాశాలు ఉన్నాయని నిర్ధారించాడు. 1872 నుండి 1886ల మధ్య కాలంలో సర్ విలియమ్ కింగ్ అనే భూవిజ్ఞాన శాస్త్రవేత్త కూడా సర్వే చేసి బొగ్గు నిక్షేపాలను కనుగొన్నారు. 1886లో ఇంగ్లాండ్‌లో ఉన్న హైదరాబాద్ (దక్కన్) కంపెనీ లిమిటెడ్ ఇల్లందు ప్రాంతంలో బొగ్గును తవ్వుకునే హక్కును పొందింది. 1889లో ఖమ్మం జిల్లా సింగరేణి గ్రామంలో పూసపల్లి అండర్‌గ్రౌండ్ మైన్ ద్వారా బొగ్గు ఉత్పత్తిని ప్రారంభించి 59,671 టన్నుల బొగ్గును వెలికితీశారు. 1920 డిసెంబర్ 23న హైదరాబాద్ కంపెనీస్ చట్టం ప్రకారం పబ్లిక్ కంపెనీగా ది సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్‌గా పురుడు పోసుకుంది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు అనుగుణంగా 1956లో సింగరేణిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. 1974 జూన్ 10న కేంద్ర ప్రభుత్వం కూడా సింగరేణిలో భాగస్వామ్యమైంది. 5వ పంచవర్ష ప్రణాళిక కాలంలో 1977 డిసెంబర్ 13 నుండి కేంద్ర ప్రభుత్వం 49 శాతం వాటా, రాష్ట్ర ప్రభుత్వం 51 శాతం వాటా భాగస్వామ్యంతో సింగరేణి వెలుగొందుతుంది. 1889 నుండి 2020 మార్చి నాటికి సింగరేణిలో 1501 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి జరిగింది.

ఇక ఇప్పటి కోల్ ఇండియాకు చెందిన బొగ్గు గనులు దేశంలోనే మొదటగా 1774లో పశ్చిమ బెంగాల్ దామోదర నది పరీవాహకంలోని రాణిగంజ్‌లో ఈస్టిండియా కంపెనీ ఆధ్వర్యంలో బొగ్గు తవ్వకాలు ప్రారంభమైనవి. కేంద్ర ప్రభుత్వం అక్టోబర్ 1956లో నేషనల్ కోల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌ను ఏర్పాటు చేసింది. దేశీయ అవసరాలకు అనుగుణంగా బొగ్గు ఉత్పత్తిని పెంచుకోవలసిన అవసరం ఏర్పడింది. కాని ప్రైవేట్ సంస్థల వద్ద తగిన మూలధన పెట్టుబడి లేనందువలన బొగ్గు గనుల విస్తరణ కుంటుపడింది. లాభాపేక్షతో రక్షణ ఏర్పాట్లు తక్కువ అయినందున ప్రైవేట్ బొగ్గు గనులలో ప్రమాదాలు పెరిగినవి. దానితో కేంద్ర ప్రభుత్వం బొగ్గు గనుల జాతీయీకరణ చట్టం 1973 రూపొందించి మే 1 నుండి అమల్లోకి తెచ్చింది. 1975 నవంబర్ 1న కోల్ ఇండియా లిమిటెడ్‌ను కేంద్ర ప్రభుత్వ సంస్థగా స్థాపించింది.

---

ఉంది. అబద్ధాలను ప్రచారం చేసి వన దేవతలు అనే పేరున భక్తి ఊబిలోకి దించి మతం మత్తును ఆదివాసీ సమాజానికి ఎక్కిస్తున్నది. పాలకులపై పిడికిళ్లను బిగియించే చేతులతోనే దేవతలకు చేతులు జోడించి పబ్బం పట్టిస్తున్నారు. పాలకులపై ఉరుములై ఉరిమే గిరిజనం గర్జన గొంతులతో పూనకాల అమ్మవార్లుగా ఆదివాసీ సమాజాన్ని మారుస్తున్నారు. జోడేఘాట్‌లో పాలకులు పూజారులతో పూజలు నిర్వహిస్తున్నారు. కొమరం భీం వర్ధంతి రోజు కొమరం భీంకు నివాళలు అర్పించడానికి, తన ఆశయాల కోసం పోరాడుతున్న ఆదివాసీ సంఘాలకు, నాయకులకు అనుమతి లేదు. ఆదివాసీ సాంప్రదాయాలను, ఆచారాలను, సంస్కృతిని మొక్కుబడిగా సాగిస్తూ జోడేఘాట్‌ను టూరిజంగా మార్చి పర్యాటక కేంద్రంగా మార్చింది.

గిరిజన వీరుల ఘనమైన చరిత్రను పాతర వేయడానికి పాలకులు పన్నిన పన్నాగం. ఆదివాసీ అమరుల అసలు చరిత్రకు ఎసరు పెట్టే పాలకుల ఎత్తులు. మన్యం తిరుగుబాట్లను, పితూరీల చైతన్యాన్ని మసకబార్చే జిత్తులు. మనువు మన్యాన్ని ఆక్రమిస్తున్నాడు మెల్లమెల్లగా. అడవిపై మనువు కన్నేసి తన వారసులకు పురమాయించాడు అటవీ సంపదను దోపిడీ దారులకు దోచిపెట్టమని. అందుకే ఆదివాసీ పోరు చరితలను తెరమరుగు చేసి వన దేవతలుగా మార్చుమని. ఆదివాసుల చేతిలో విల్లు బాణం తీసి నిరాయుధున్ని చేయమని. అదే చేతుల్లో తాళాలు పెట్టి భజన చేయించాలని డోల్లు కొట్టించి పూనకాలాడించాలని మనువు మహా తహతహలాడుతుండు.

పాలకులు ఎన్ని ఎత్తులు వేసినా, ఎన్ని కుట్రలు పన్నినా ఆదివాసులు ఆ ఆటలు సాగనివ్వరు. నెత్తురు పారిన అడవి అమరుల స్మృతి గీతాలను ఆలపిస్తూనే ఉంది. పోరు క్షేత్రాలు సాక్షాత్తు అమరుల గుర్తులను గుప్పిట పట్టుకోనే ఉన్నాయి. అడవి అందించిన విల్లు బాణం గురి తగ్గలేదు, బరి వీడ లేదు. మన్యం మండుతూనే ఉంది పాలకుల పన్నాగాల మీద. కార్పొరేట్ శక్తుల కుయుక్తులను కూల్చివేయడానికి కదం తొక్కి కవాతు చేస్తుంది. మనువు ఎన్ని మతలబులు చేసినా వనవాసులు మనువు మాడు పగలగొడతారు. వన పోరు వీర చరితల కంటికి రెప్పలా కాపాడుకుంటారు. సమర కొలిమిలో ఆదివాసీ అమర కణికల ప్రతి ఇంటిలో రగిలించుకుంటారు. గూడెం గట్టలను ఏకం చేసి మైదానం మనువు వారసుల అంతం చూస్తారు. అదే పంతంగా ఆదివాసులు ఏకమై గండు చీమల దండై సాగాలి. తేనెటీగల తుట్టెలేవాలి. అడవి సంపదను కాపాడుకోవాలి. ఆదివాసీ వీరుల చరితలను రక్షించుకోవాలి. నేటి తరానికి రేపటి తరానికి నిజాలను నూరిపోయాలి. మనువు అబద్ధాలను అమాంతం సమాది చేయాలి. అప్పుడే ఆదివాసీ అమరుల అసలు చరితలు వర్ధిల్లుతాయి. అడవి తల్లి ఆనందపడుతుంది. సంతోషంతో పులకరించిపోతుంది.

*(రచయిత అఖిలభారత రైతు-కూలీ సంఘం రాష్ట్రకార్యవర్గ సభ్యులు, ఆంధ్రప్రదేశ్)* వీ

కేంద్రంలో బిజెపి పార్టీ అధికారంలోకి వచ్చినప్పటి నుండి వేగిరమైన సంస్కరణల్లో బొగ్గు గనుల జాతీయీకరణ చట్టం 1973ను రద్దు చేసే దానికి 2000, 2012, 2014లలో ప్రయత్నాలు జరిగినవి. చివరకు బొగ్గు గనుల (ప్రత్యేక నిబంధనలు) చట్టం 2015 మార్చి 4, 20 తేదీల్లో పార్లమెంట్‌లో ఆమోదింపచేసి 2014 అక్టోబర్ 21 నుండి అమల్లోకి తెచ్చారు. 2018 జనవరి 8న బొగ్గు గనుల జాతీయీకరణ చట్టం 1973ను రద్దు చేశారు. ఫిబ్రవరి 20న ఆర్థిక వ్యవహారాల కేంద్ర మంత్రివర్గ సంఘం (సిసిఇఎ) పెద్ద, మధ్య, చిన్న స్థాయి బొగ్గు గనులను ప్రైవేట్‌కు ఇవ్వడానికి ఆమోదం తెలిపింది. 2019 ఆగస్ట్ 28న కేంద్ర క్యాబినెట్ బొగ్గు రంగంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతించింది. 2019 సెప్టెంబర్ 13న రెవెన్యూ, బొగ్గు మంత్రిత్వ శాఖల కార్యదర్శులు, నీతి అయోగ్ వైస్ చైర్మన్ పాల్గొన్న సమావేశం బొగ్గు రంగాన్ని ప్రైవేటీకరించే సంస్కరణలను సిఫారసు చేసింది.

సాక్షాత్తూ ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ 2020 జూన్ 18న కమర్షియల్ మైనింగ్ ప్రాతిపదికగా బొగ్గు తవ్వకాలకు 44 బొగ్గు బ్లాక్‌లను కేటాయించడానికి వేలం పాటను ప్రారంభించాడు.వేలం పాటలో బొగ్గు బ్లాక్ లను దక్కించుకున్న వారికి మౌలిక సదుపాయాల కల్పనకు 50 వేల కోట్ల రూపాయల ఆర్థిక సహాయం చేస్తామని కూడా ప్రకటించాడు.

దానికి నిరసనగా కోల్ ఇండియా లిమిటెడ్, సింగరేణిలో జూలై 2,3,4 తేదీలలో 72 గంటల సమ్మె జరిగింది. మరల సెప్టెంబర్ 24న టోకెన్ సమ్మె జరిగింది. అయినా కేంద్ర బొగ్గు మంత్రిత్వ శాఖ 88 బొగ్గు బ్లాక్‌లను వేలం వేస్తున్నట్లుగా 2021 అక్టోబర్ 11న ప్రకటన జారీ చేసింది. వేలం పాటతో బొగ్గు బ్లాక్‌లను ప్రైవేట్‌కు అప్పజెప్పింది.

కోల్ ఇండియా లిమిటెడ్, సింగరేణి కాలరీస్ కంపెనీ లిమిటెడ్‌లు గడిచిన 2020-21 ఆర్థిక సంవత్సరంలో 647.017 మిలియన్ టన్నుల బొగ్గును ఉత్పత్తి చేసినవి. సీఐఎల్ కేంద్ర ప్రభుత్వానికి రాయల్టీ ఇతరత్ర పన్నుల రూపకంగా రు. 44,075.81 కోట్లు చెల్లించింది. ప్రధాన మంత్రి ఖనిజ క్షేత్ర కళ్యాణ్ యోజన కింద డిస్ట్రిక్ట్ మినరల్ ఫండ్‌కు రు. 5,800 కోట్లు చెల్లించింది. కార్పొరేట్ సోషల్ రెస్పాన్స్‌బిలిటీ (సి.ఎస్.ఆర్.) కింద రు. 449.31 కోట్లు చెల్లించింది.

సింగరేణి కంపెనీ 2014 - 2015 ఆర్థిక సంవత్సరం నుండి 2018 - 2019 ఆర్థిక సంవత్సరం వరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు రు. 27,702.17 కోట్లు, డిస్ట్రిక్ట్ మినరల్ ఫండ్‌కు 2018 ఏప్రిల్ నుండి 2020 ఆగస్ట్ వరకు రు. 2,262.85 కోట్లు, సి.ఎస్.ఆర్‌కు రు. 20 కోట్లు చెల్లించింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి ఏవిధమైన బడ్జెట్ సపోర్ట్ గాని, నయాపైసా సహాయం లేకుండానే కోల్ ఇండియా, సింగరేణి కంపెనీలు బొగ్గు ఉత్పత్తిని కొనసాగిస్తూ దేశాభివృద్ధిలో పాలుపంచుకుంటున్నవి. సెంట్రల్ ఎలక్ట్రిసిటీ అథారిటీ (సిఇఎ) చెప్పిన 2020 నవంబర్ 30 నాటి లెక్కల ప్రకారం బొగ్గుతో సెంట్రల్ సెక్టార్‌లో 59,790 మెగావాట్లు, స్టేట్స్ సెక్టార్‌లో 65,631 మెగావాట్లు, ప్రైవేట్ సెక్టార్‌లో 74,173 మెగావాట్ల థర్మల్ విద్యుత్ ఉత్పత్తికి బొగ్గు సరఫరా చేస్తున్నవి. కోల్ రెగ్యులేటరీ అథారిటీ ఆఫ్ ఇండియా 2013 మార్గదర్శకాలను అనుసరించి బొగ్గు ఉత్పత్తి వ్యయం కంటే తక్కువ ధరకు బొగ్గు సరఫరాను చేస్తున్నవి. ఇంకా బొగ్గు వనరుల సంరక్షణతో పాటు గనుల మూసివేత సమయంలో పర్యావరణ పరిరక్షణకు కృషి చేస్తున్నవి. బొగ్గు నాణ్యత ప్రమాణాలకు అనుగుణంగా బొగ్గు సరఫరాను కొనసాగిస్తున్నవి.

సింగరేణి కంపెనీ బొగ్గు ఉత్పత్తిని పెంచడానికి కోయగూడెం, సత్తుపల్లి, శ్రావణ్‌పల్లి, కళ్యాణ్‌ఖని బొగ్గు బ్లాక్‌ల భూగర్భ పరిశోధనకు రు. 66 కోట్లు ఖర్చు చేసింది. సత్తుపల్లి నుండి కొత్తగూడెం రైల్వే మార్గం నిర్మాణం గురించి రు. 750 కోట్లు ఇండియన్ రైల్వేస్‌కు చెల్లించింది. అటవీ భూముల పరిహారానికి రు. 450 కోట్లు అటవీ శాఖకు చెల్లించింది. నాలుగు బొగ్గు బ్లాక్‌లలో బొగ్గు తవ్వకాలకు అనుమతిని ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వానికి అర్జీ కూడా పెట్టింది. కాని కేంద్ర ప్రభుత్వం గత రెండు సంవత్సరాలుగా పర్యావరణ, జీవావరణ అనుమతులను ఇవ్వకుండా కాలయాపన చేసింది. తీరా సింగరేణికి చెందిన నాలుగు బొగ్గు బ్లాక్‌లను కూడా డిసెంబర్ 13న వేలం పాటలో కేటాయిస్తున్నట్లుగా ప్రకటించింది.

వేలం పాటను విరమించుకుని సింగరేణికి చెందిన నాలుగు బొగ్గు బ్లాక్‌లను సింగరేణికే కేటాయించాలని టిబిజికెఎస్, ఎఐటియుసి, ఐఎన్‌టియుసి, హెచ్ఎంఎస్, సిఐటియు, బిఎంఎస్ కార్మిక సంఘాలు జాయింట్ యాక్షన్ కమిటీగా, అలాగే గోదావరి లోయ బొగ్గుగని కార్మిక సంఘం, తెలంగాణ గోదావరి లోయ బొగ్గుగని కార్మిక సంఘం, తెలంగాణ సింగరేణి ఉద్యోగుల సంఘం, శ్రామిక శక్తి గోదావరి లోయ బొగ్గుగని కార్మిక సంఘం మరో జెఏసిగా డిసెంబర్ 9,10,11 మూడు రోజులు సింగరేణిలో సమ్మె చేసినవి. తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంత్రిని కలవడానికి ప్రయత్నించగా అవకాశం ఇవ్వలేదు. కేరళ రాష్ట్రంలోని ఉత్తర కాసరగోడ్ జిల్లాలోని బిహెచ్ఇఎల్ (భారత్ హెవీ ఎలక్ట్రికల్ లిమిటెడ్)కి సంబంధించిన ఇఎంఎల్ (ఎలక్ట్రికల్ మెషిన్స్ లిమిటెడ్) ప్రైవేటైజేషన్ కాకుండా అక్కడి రాష్ట్ర ప్రభుత్వం 2021 సెప్టెంబర్ 8న స్వాధీనం చేసుకున్నది. గతంలో అవిభక్త ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విజయవాడ దగ్గర ఉన్న అమ్మెల్ (ఆంధ్రప్రదేశ్ హెవీ ఎర్త్ మూవర్స్ లిమిటెడ్) నష్టాలతో మూసివేస్తున్న క్రమంలో సింగరేణి కంపెనీకి దత్తత ఇచ్చారు. కాని తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం 4 బొగ్గు బ్లాకులను సింగరేణి కంపెనీకి కేటాయించడానికి గాను ఆర్థికంగా, రాజకీయంగా కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడిని పెంచలేదు.

సింగరేణి ఉపాధి అవకాశాలకు కొంగు బంగారం. పోరాటాలకు పురిటి గడ్డ. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం నుండి రాష్ట్ర సాధన ఉద్యమం వరకు బాసటగా నిలిచింది. విద్యార్థులతో సమాంతరంగా ఉద్యమంలో పాల్గొన్నారు. ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులపై జరిపిన రబ్బర్ బుల్లెట్ కాల్పులకు వ్యతిరేకంగా, తెలంగాణ ప్రాంత ఎంపీలు రాజీనామా చేయాలని, శ్రీకృష్ణ కమిటీ పర్యటనకు వ్యతిరేకంగా, పార్లమెంటులో తెలంగాణ రాష్ట్ర బిల్లు పెట్టాలని, రాష్ట్ర ఏర్పాటు అలసత్వంపై యువత ఆత్మ బలిదానాలకు బాసటగా వివిధ సమయాల్లో 9 రోజులు సమ్మె చేశారు. మరల 2011 సెప్టెంబర్ 13 నుండి చేసిన 35 రోజుల సకల జనుల సమ్మె వలన దక్షిణ భారతదేశంలో విద్యుత్ కొరత ఏర్పడింది. దానితో

రాజకీయ ఒత్తిడి పెరిగింది. అలాగే ప్రజల, ప్రజా సంఘాల ఉద్యమ భాగస్వామ్య పోరాటం వలన అన్ని రాజకీయ పార్టీలు కూడా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు సహకరించక తప్పలేదు. దానితో 2014 జూన్ 2న తెలంగాణ రాష్ట్రం ఆవిర్భవించింది.

స్వరాష్ట్రం తెలంగాణలో సింగరేణిలో ఉద్యోగ అవకాశాలు పెరుగుతాయని అందరూ ఆశించారు. 2017 జనవరి 5న అసెంబ్లీలో సింగరేణిపై సుదీర్ఘ చర్చ జరిగింది. చర్చలో 15 మంది శాసన సభ్యులు పాల్గొన్నారు. స్వయంగా ముఖ్యమంత్రి అనేక హామీలు ఇచ్చాడు. 'అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లో కార్మికులందరూ తెలంగాణ వాళ్లయితే అధికారులందరూ ఆంధ్రోళ్లు అధ్యక్షా!' అంటూ అనేక కార్మిక, సింగరేణి అనుకూల ముచ్చట్లు మాట్లాడిండు. కాని కాలక్రమంలో సింగరేణి పరిస్థితి తుంట ఎత్తేసి మొద్దు ఎత్తుకున్న చందంగా తయారైంది. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటైన 2014లో సింగరేణిలో 36 అండర్ గ్రౌండ్, 14 ఓపెన్ కాస్ట్ బొగ్గు గనుల్లో బొగ్గు ఉత్పత్తి జరిగింది. 2014 మార్చి 31 నాటి లెక్కల ప్రకారంగా 50.47 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి జరిగింది. 61,778 మంది కార్మికులు పనిచేశారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో బొగ్గు బాయి, బొంబాయి, దుబాయి కొలువులు నినాదంగా ప్రచారం జరిగింది. ఓపెన్ కాస్ట్ ప్రాజెక్టులతో తెలంగాణ బొందల గడ్డలు అవుతున్నాయని ఆందోళనలు జరిగినవి.

కాని నేడు అండర్‌గ్రౌండ్ బొగ్గు గనులను బంద్ పెట్టి ఓపెన్ కాస్ట్ ప్రాజెక్ట్ గనుల తవ్వకాలు వేగిరమైనవి. 20 వేల మంది కార్మికులు పదవీ విరమణ పొందిన వారి స్థానంలో కొత్త ఉద్యోగ నియామకాలు భర్తీ కాలేదు. నేడు 23 అండర్ గ్రౌండ్, 21 ఓపెన్ కాస్ట్ గనులలో (2022 ఫిబ్రవరి 5 గోదావరిఖని - 5 ఓపెన్ కాస్ట్ ప్రాజెక్ట్‌లో బొగ్గు ఉత్పత్తి ప్రారంభమైంది) బొగ్గు ఉత్పత్తి జరుగుతుంది. 2019-20లో 64.02 మిలియన్ టన్నుల బొగ్గు, 2020-21లో భారీ వర్షాలు, కరోనా వైరస్ మహమ్మారి ప్రభావం వలన 50.58 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి జరిగింది. 2021 మార్చి 31 లెక్కల ప్రకారంగా 43,895 మంది కార్మికులు, అధికారులు (అధికారులు 2,500) పనిచేస్తున్నారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు అయిన 2014లో వార్షిక సంవత్సర బొగ్గు ఉత్పత్తి 50.47 మిలియన్ టన్నులు జరుగగా, అనంతర ఆర్థిక సంవత్సరాల్లో 2014-15లో 52.54 మిలియన్ టన్నులు, 2015-16లో 60.38 మిలియన్ టన్నులు, 2016-17లో 61.34 మిలియన్ టన్నులు, 2017-18లో 62.01 మిలియన్ టన్నులు, 2018-19లో 64.40 మిలియన్ టన్నులు, 2019-20లో 64.02 మిలియన్ టన్నులు, 2020-21లో 50.58 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి జరిగింది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు అనంతరం వార్షికంగా 10 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి పెరిగింది.

ముఖ్యమంత్రి చాలా సందర్భాల్లో కాంట్రాక్టీకరణకు వ్యతిరేకంగా, కాంట్రాక్ట్ కార్మికులకు మద్దతుగా మాట్లాడిండు. ప్రతి విభాగంలో కాంట్రాక్ట్‌ను పెడుతున్న ప్రభుత్వాలు మంత్రులను, ముఖ్యమంత్రి, ప్రధాన మంత్రి పోస్ట్‌లను కూడా కాంట్రాక్ట్ ప్రాతిపదికన నియమించుకుంటే కూడా బాగుంటుందని ఎద్దేవా చేసిండు. కాని సింగరేణిలో కాంట్రాక్ట్, ప్రైవేటీకరణ వేగిరమైంది. అండర్ గ్రౌండు బొగ్గు గనులలో కూడా కాంట్రాక్టు కార్మికులు పనిచేస్తున్నారు. హాస్పిటల్స్‌లో, క్యాంటీన్లలో, వర్క్ షాప్, కోల్ హ్యాండిలింగ్ (సిహెచ్‌పి) ప్లాంట్లలో, కోల్ ట్రాన్స్‌పోర్ట్ విభాగాల్లో ప్రైవేటీకరణ పెరిగింది. ఓపెన్ కాస్ట్ ప్రాజెక్టులలో మట్టి తొలగింపు, బొగ్గు ఉత్పత్తి, డంపర్స్, డోజర్స్, షావెల్స్, లోడర్స్ ఇతర యంత్రాల మరమ్మతు పనులలో కూడా కాంట్రాక్టీకరణ పెరిగింది. తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావం అనంతరం 20 వేల మంది పర్మనెంట్ కార్మికులు తగ్గగా, 30 వేల మంది కాంట్రాక్ట్ కార్మికుల సంఖ్య పెరిగింది.

కోల్ ఇండియా లిమిటెడ్‌లోని దాదాపు 80 వేల మంది కాంట్రాక్ట్ కార్మికులకు 2014 నుండి హైఫవర్ కమిటీ సిఫార్సు చేసిన వేతనాలను చెల్లించుకున్నారు. 2017 జనవరి 5న అసెంబ్లీలో సింగరేణిపై జరిగిన చర్చలో అప్పటి ఎంఎల్ఎ జి. కిషన్‌రెడ్డి సింగరేణిలోని కాంట్రాక్ట్ కార్మికులకు కోల్ ఇండియా మాదిరిగా హైపవర్ కమిటీ సిఫార్సు చేసిన వేతనాలను చెల్లించాలని కోరగా స్వయంగా ముఖ్యమంత్రి కేసీఆర్ లేచి 'అధ్యక్షా! సింగరేణిలో కాంట్రాక్ట్ కార్మికులు లేర'ని సమాధానం చెప్పాడు. ఇప్పటివరకు సింగరేణిలో కాంట్రాక్ట్ కార్మికులు హైపవర్ కమిటీ సిఫార్సు వేతనాలను పొందడం లేదు.

సింగరేణిలో కార్మికుల చైతన్యాన్ని నిలువరించడానికి అప్పటి రాష్ట్ర ప్రభుత్వం 1998 సెప్టెంబర్ 9 నుండి రహస్య బ్యాలెట్ విధానంతో గుర్తింపు కార్మిక సంఘం ఎన్నికలను ప్రవేశపెట్టింది. ఏడు సార్లు ఎన్నికలు జరిగినవి. ఎనిమిదవ సారి సింగరేణిలో గుర్తింపు కార్మిక సంఘం ఎన్నికలను నిర్వహించాలని సెంట్రల్ లేబర్ కమిషనర్ న్యూఢిల్లీ ఇచ్చిన ఆదేశాలు బుట్టదాఖలు అయినవి. కొవిడ్, బొగ్గు ఉత్పత్తికి ఆటంకం జరుగుతుందనే కారణాలతో ఎన్నికల నిర్వహణను వాయిదా వేస్తున్నారు. గతంలో సింగరేణి గుర్తింపు కార్మిక సంఘం ఎన్నికలలో రాష్ట్ర ప్రభుత్వ జోక్యం అంతగా లేదు. కాని స్వరాష్ట్రంలో టీఆర్ఎస్ సర్పంచ్‌ల నుండి మొదలుకుని ముఖ్యమంత్రి వరకు ప్రచారంలో పాల్గొన్నారు. 2017 అక్టోబర్ 5న జరిగిన ఎన్నికలకు ముందు అక్టోబర్ 3న ముఖ్యమంత్రి ప్రెస్‌మీట్ పెట్టి అనేక హామీలను ఇచ్చి తెలంగాణ బొగ్గు గని కార్మిక సంఘంను గెలిపించాలని కోరినాడు. ఎన్నికలకు 15 రోజుల ముందు నుండి కార్మికులకు ఫంక్షన్ హాల్‌లలో మద్యం, మాంసాహారం డిన్నర్‌లను ఇచ్చినారు. డబ్బులు, వెండి గిఫ్ట్‌లు బహుకరించి సార్వత్రిక ఎన్నికలను తలపింప చేశారు. ఎన్నికల్లో తెలంగాణ కార్మిక సంఘం గెలిచిన అనంతరం రాజకీయ జోక్యం బాగా పెరిగింది.

కోడ్ ఆఫ్ డిసిప్లిన్ ప్రకారంగా ప్రతి మూడు నెలలకు ఒకసారి కార్పొరేట్ స్థాయిలో స్ట్రక్చర్ కమిటీ, అలాగే జాయింట్ కన్సల్‌టెంట్ కమిటీ మీటింగ్‌లను నిర్వహించి, సమస్యలను చర్చించి పరిష్కరించడానికి కృషి చేయాలి. కాని గడచిన నాలుగేండ్ల కాలంలో కేవలం రెండే రెండు మీటింగ్‌లు జరిగినవి. అంటే కనీస ప్రజాస్వామిక విధానాలు కొనసాగడం బంద్ అయినవి. తెలంగాణ ప్రగతి భవన్ రాజకీయ నియంతృత్వం సింగరేణిలో కూడా కొనసాగుతున్నది. తెలంగాణ ఆకాంక్షలలో భాగంగా అండర్ గ్రౌండ్ మైన్స్ విధానంతో, పర్యావరణ, జీవావరణ పరిరక్షణతో, కాంట్రాక్టీకరణ, ప్రైవేటీకరణ లేని బొగ్గు ఉత్పత్తితో కూడిన ఉపాధి, ఉద్యోగ అవకాశాలు కలిగిన సింగరేణి కావాలని కార్మికులు కోరుకుంటున్నారు.

*(రచయిత కేంద్ర కార్యదర్శి, సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియన్ ఎఐటియుసి)*

వీ

# ఉవ్వెత్తున లేచిన ఉద్యమంపై నీళ్లు చల్లిన నాయకత్వం

*ఆంధ్రప్రదేశ్ ఉద్యోగ, ఉపాధ్యాయ, పెన్షనర్ వర్గాల అసంతృప్తికీ, ఆందోళనకూ కారణాలను వివరిస్తూ, ఉద్యమ గతిని సమీక్షిస్తున్నారు* **పి. పాండురంగ వరప్రసాదరావు**

ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు, పెన్షనర్లు 11వ పి.ఆర్.సి. అమలు కొరకు ఉద్యమించారు. ఫిబ్రవరి 3వ తేదీన పి.ఆర్.సి. సాధన సమితి పిలుపు మేరకు దాదాపు లక్షమంది ఉద్యోగ, ఉపాధ్యాయ, పెన్షనర్లు విజయవాడ నగరంలో మహాప్రదర్శన చేశారు. వారిలో అత్యధికులు ఉపాధ్యాయులేనని పరిశీలకులు అంటున్నారు. ప్రభుత్వం తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగించింది. చాలా జిల్లాల్లో, మండల స్థాయి నాయకులను ఇళ్ల వద్దే అరెస్టు చేశారు. బస్సులను, కార్లను ఆపి తనిఖీలు చేసి దించివేశారు. పోలీస్ స్టేషన్‌కు పిలిపించి 'విజయవాడ వెళ్లం' అని లేఖలు రాయించుకున్నారు. కొన్ని జిల్లాలలో పాఠశాలలకు వెళ్లి ఉపాధ్యాయులను, ఉపాధ్యాయల సంఘ నాయకులను విజయవాడ వెళ్లరాదని నోటీసులు ఇచ్చారు. ఛలో విజయవాడకు హాజరయ్యే వారికి వాహనాలు అద్దెకు ఇవ్వవద్దని ట్రావెల్ సంస్థలకు ఆదేశాలను జారీ చేశారు. అంతేకాక అధికార పార్టీ కార్యకర్తలతో ప్రజల్లో ఉద్యోగ, ఉపాధ్యాయ వ్యతిరేక ప్రచారాన్ని సాగించారు. కరపత్రాలు వేసి పంచారు. ప్రభుత్వం, అధికార పార్టీ ఇంత వ్యతిరేక ప్రచారాన్ని చేసినా, నిర్బంధకాండ కొనసాగించినా లక్ష మందికి పైగా విజయవాడ చేరుకున్నారు. ఉద్యమకారులతో 4 కిలోమీటర్ల పొడవున్న బి.ఆర్.టి.ఎస్. రోడ్డు నిండిపోయింది. నగరంలోని అనేక మైదానాలు పోలీసులు అరెస్టు చేసిన వారితో నిండిపోయాయి. బెజవాడ ఎరుపెక్కింది. ఎర్ర జెండాలతో బి.ఆర్.టి.ఎస్. రోడ్డు, ఆ పరిసర ప్రాంతాలు అరుణరవనంలా కనిపించాయి. కొంతమంది ఉద్యోగులు, ఉపాధ్యాయులు ముందుగానే విజయవాడ వచ్చి బంధుమిత్రుల ఇళ్లలో ఉన్నారు. కొందరు హెూటల్ రూములలో అద్దెకు తీసుకున్నారు. సంఘ కార్యాలయాలన్నింటి పైనా పోలీసులు నిఘా ఉంచారు. అయినప్పటికీ ఉద్యోగులు, ఉపాధ్యాయులు, పెన్షనర్లు అనేక సంఘాలకు చెందిన వారయినప్పటికీ సమన్వయంతో వ్యవహరించారు.

9.30 గంటల వరకు బి.ఆర్.టి.ఎస్. రోడ్డు ఖాళీగా కనిపించింది. అప్పుడే వస్తున్న ఉద్యోగులు, ఉపాధ్యాయులు, విలేకరులు, మీడియా రిపోర్టర్లు జనం లేరని, రారని భావించారు. కాని సరిగ్గా పది గంటలయ్యే సరికి అన్ని వైపుల నుండి ప్రభంజనంలా విరుచుకుపడ్డారు. క్షణాల్లో బి.ఆర్.టి.ఎస్. రోడ్ నిండిపోయింది. వేల సంఖ్యలో వస్తున్న వారిని అదుపు చేయలేక పోలీసులు చేతులెత్తేశారు. అనేక చోట్ల పోలీసులే బారికేడ్లు తొలగించి ప్రవేశానికి అనుమతించారు. సాధారణ పోలీసులలో ప్రభుత్వం పట్ల ఉన్న ఆగ్రహాన్ని ఇది సూచించింది. పోలీసులు చూపించిన అభిమానానికి ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాలు ఆశ్చర్యపోయాయి. మంచినీరు లేక ఎండ వేడిమికి తట్టుకోలేని ఉద్యోగులను చూసిన పోలీసులు కొందరు మూసివేసిన షాపులను తెరిపించి ఆందోళనకారులకు అవసరమైన మంచినీరు, శీతల పానీయాలను అందుబాటులోనికి తెచ్చారు. సాధారణ పోలీసులు, ఆందోళనకారులకు అందించిన సహకారం చూస్తే (భారతదేశంలో గతంలో ఎన్నడు ఇటువంటి స్థితిని చూడలేదు) సుంకర సత్యనారాయణ వాసిన "నిరంకుశత్వమేదియైన నిలువలేదు జగతిలో దురాత్ములైన హిట్లరాదులొరిగిపోయి రుర్విపై ప్రజాబలాల ధాటినాప నెవడితరం కాదుపో!"

అను పంక్తులు జ్ఞప్తికి వస్తాయి. అంతేకాదు సరియైన దశలో ప్రజా ఉద్యమాలను నిర్వహిస్తే ఈ దేశానికి మంచి రోజులు వస్తాయనే ఆశలు చిగురిస్తున్నాయి. పోలీసు వారి వైఫల్యంగా భావించిన ప్రభుత్వం, తనకు నమ్మిన బంటులా పనిచేసిన డి.జి.పి. గౌతం సవాంగ్ ను ఆ పోస్టునుండి తొలగించింది. తమ విధానాలు సక్రమంగా లేకపోతే పై స్థాయి అధికారులు ఏమి చేయలేరనే విషయాన్ని ప్రభుత్వం ఇంకా గ్రహించలేదని ఈ చర్య ద్వారా అర్థమవుతోంది.

వేలాదిగా తరలివచ్చిన ఆందోళన కారులకు ప్రజలు స్వాగతం పలికారు. అతి పేద ప్రజలు నివసించే ప్రాంతం అది. అందరూ ఇళ్లలో నుండి బయటకు వచ్చి బిందెలతో మంచినీళ్లు అందించారు. వెసులుబాటు ఉన్న వాళ్లు మజ్జిగ ఇచ్చారు. మహిళలకు తమ ఇండ్లలో టాయిలెట్లు వాడుకోవడానికి అవకాశం ఇచ్చారు. నీరసపడిన వాళ్లను తమ ఇంట్లో విశ్రాంతి తీసుకోనిచ్చారు. ప్రభుత్వ ఉద్యోగుల పట్ల ప్రజలకు వైముఖ్యం కలిగించడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయని ఈ మహాప్రదర్శన నిరూపించింది. అంతేకాదు ఉద్యోగ, ఉపాధ్యాయుల పట్ల ప్రజలలో తీవ్ర వ్యతిరేకత ఉన్నదనే అభిప్రాయం కూడా పటాపంచలయింది.

ఇంతటి ఉద్యమానికి నేపథ్యాన్ని పరిశీలించవలసిన అవసరం ఉన్నది. 'నా చిన్ని బొజ్జకు శ్రీరామరక్ష' అనుకునే పెటీ బూర్జువా లక్షణాలు కలిగిన మధ్యతరగతి ఉద్యోగ ఉపాధ్యాయ వర్గాలకు ఎందుకింత ఆగ్రహం కలిగింది? ఉద్యోగులను కదిలించడానికి నాయకత్వం పెద్దగా ప్రయత్నించకపోయినా వారంతట వారు ఎందుకు తరలివచ్చారు? కేవలం పి.ఆర్.సి. కోసమేనా? ఉద్యోగ, ఉపాధ్యాయుల కదలికకు కారణాలేమిటి పరిశీలించాలి. జగన్‌మోహన్‌రెడ్డి అధికారంలోనికి రాకముందు చేసిన ఓదార్పుయాత్ర సందర్భంలోను, ఆ తరువాత ఎన్నికల ప్రచారంలోను ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాలకు చేసిన వాగ్దానాలు వారిలో ఆశలను రేకెత్తించాయి. పి.ఆర్.సి. కోసం ఎదురు చూడవలసిన అవసరం లేదని, సమయానికి పి.ఆర్.సి. ఇస్తామనీ కరువుభత్యం ఆలస్యం చేయకుండా మంజూరు చేస్తామని పదేపదే ప్రకటించారు. కంట్రిబ్యుటరీ పెన్షన్ పథకాన్ని నాటి తెలుగుదేశం ప్రభుత్వం రద్దుచేయలేమని ప్రకటించింది. దానిపై మాజీ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి టక్కర్ ఆధ్వర్యాన ఒక కమిటీని నియమించింది.

తన ఎన్నికల ప్రచార పత్రంలో భాగంగా వై.ఎస్. జగన్‌మోహన్‌రెడ్డి మాట్లాడుతూ అధికారంలోనికి వచ్చిన వారం రోజులలోగా సి.పి.ఎస్.ను రద్దు చేస్తానని, కాలయాపన కమిటీలు వేయనని దాదాపు 80 సభలలో ప్రకటించారు. కాంట్రాక్టు ఉద్యోగులను సర్వీసులను క్రమబద్ధీకరిస్తామని, అవుట్ సోర్సింగ్ విధానాన్ని రద్దు చేస్తామని వాగ్దానం చేశారు. ఈ వాగ్దానాలను నమ్మిన ప్రభుత్వ ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కాంట్రాక్టు అవుట్ సోర్సింగ్ కార్మికులు వై.ఎస్.ఆర్. పార్టీకి పూర్తి మద్దతునిచ్చారు. 90 శాతానికి పైగా నియోజక వర్గాలలో పోస్టల్ బ్యాలెట్లలో వై.ఎస్.ఆర్. పార్టీకి మెజారిటీ వచ్చింది. 175 స్థానాలకు గాను తెలుగుదేశం పార్టీకి పది స్థానాలలోపే పోస్టల్ బ్యాలెట్స్‌లో ఆధిక్యత లభించింది. నాటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు కూడా కుప్పం నియోజకవర్గంలో పోస్టల్ బ్యాలెట్స్ ప్రత్యర్థి కంటే చాలా తక్కువ వచ్చాయి. ఇంతగా ఉద్యోగ వర్గాలు విశ్వసించగా అధికారంలోనికి వచ్చిన తరువాత ఆ విశ్వాసాన్ని వమ్ము చేసే విధంగా ప్రభుత్వం వ్యవహరించింది.

ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలకు దాదాపు రెండున్నర సంవత్సరాల పాటు ముఖ్యమంత్రి అపాయింట్‌మెంట్ లభించలేదు. ఏ రాష్ట్రంలో లేని విధంగా ఏ.పి.లో ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక, పెన్షనర్ల ఐక్య కార్యాచరణ సమితి జె.ఎ.సి. ఒక్కటిగా ఉండేది. గత ప్రభుత్వ హయాంలో అది రెండుగా చీలిపోయింది. ఈ ప్రభుత్వం వచ్చిన తరువాత కేవలం సెక్రటేరియట్‌కే పరిమితమై ఉన్న సచివాలయ ఉద్యోగుల సంఘం ఇతర ఉద్యోగ సంఘాలను కొన్నింటిని కలుపుకొని కొత్తగా జె.ఎ.సి.ని ప్రారంభించింది. ఈ జె.ఎ.సి. ప్రభుత్వానికి అనుకూలంగా వ్యవహరించింది.

అదే సమయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉద్యోగుల సంఘం మరొక జె.ఎ.సి.ని ప్రారంభించింది. ఈ సంఘం ప్రభుత్వానికి గుర్తింపు కొరకు దరఖాస్తు చేసుకున్న రోజునే గుర్తింపునిస్తూ ఉత్తర్వులు జారీ అయ్యాయి. గుర్తింపు వచ్చిన 3 సంవత్సరాల తరువాత సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో సభ్యత్వం పొందుటకు అనుమతి లభిస్తుంది. కాని ఈ సంఘానికి గుర్తింపు పొందిన రెండు, మూడు రోజులలోనే సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో సభ్యత్వం ఇస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఆ సంఘం అది ఏర్పాటు చేసిన జె.ఎ.సి. కూడా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎటువంటి ఉద్యమం చేయలేదు.

రెండు సంవత్సరాలు గడిచినా ప్రభుత్వం పి.ఆర్.సి. పైన, సి.పి.ఎస్. పైన స్పందించకపోవడంతో మొదటిగా ఎపిటిఎఫ్ దశల వారీ ఉద్యమాలకి పిలుపునిచ్చింది. పాత తాలూకా కేంద్రాలలో ధర్నాలను విజయవంతంగా నిర్వహించింది. ఏపిటియఫ్ పిలుపునివ్వడంతో ఉపాధ్యాయ సంఘాల సమాఖ్య (ఫ్యాప్టో) ముందుకు వచ్చి ఉద్యమానికి పిలుపు నిచ్చింది. దానితో ఏపిటియఫ్ తదుపరి దశ ఉద్యమాన్ని విరమించి ఫ్యాప్టో ఉద్యమాలలో పాల్గొనాలని నిర్ణయించింది. కాని ఫ్యాప్టో ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్లలేదు. జె.ఎ.సి. సమావేశమై ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయడంతో, ఫ్యాప్టో ముందుకు వెళ్లకుండా ఆగింది. జె.ఎ.సి. ఎటువంటి ఉద్యమాన్ని చేపట్టకుండా మిన్నకుండిపోయింది.

ఈ దశలో ఎపిటిఎఫ్ మరల రెండవ దశ పోరాటానికి పిలుపునిచ్చింది. అక్టోబర్ 19, 20, 21, 22 తేదీలలో విజయవాడలో 4 రోజులపాటు ధర్నాలను నిర్వహించింది. నవంబర్ 2న 'ఛలో విజయవాడ'కు పిలుపునివ్వగా పోలీసులు అనుమతించక పోవడంతో బెంజిసర్కిల్‌లోని ఒక ఫంక్షన్ హాల్‌లో దాదాపు మూడు వేల మందితో నిరసన సభను నిర్వహించింది. ఈ సభకు హాజరైన జె.ఎ.సి. చైర్మన్ బండి శ్రీనివాసరావు నెలాఖరు వరకు ప్రభుత్వానికి సమయమిస్తున్నామని, ఆ తరువాత జె.ఎ.సి. ఉద్యమాన్ని చేపడుతుందని ప్రకటించారు.

ఈలోపుగానే జె.ఎ.సి. ఏ.పి, జె.ఎ.సి ఏ.పి. అమరావతి రెండు సంస్థలు ఐక్యవేదికను ఏర్పాటు చేసి ఉద్యమానికి పిలుపునిచ్చాయి. మొదటి దశ జరుగుతుండగానే ప్రభుత్వం జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లోని 12 సంఘాలను చర్చలకు పిలిచింది. జె.ఎ.సి.ల ఐక్యవేదికను పిలవాల్సిన ప్రభుత్వం జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లోని సంఘాలను పిలవటం సరియైనది కాదు. దానిని వ్యతిరేకించవలసిన జె.ఎ.సి. నాయకులు వ్యతిరేకించకుండా చర్చలకు వెళ్లారు. ఆర్థిక మంత్రి హామీ ఇచ్చారంటూ ఉద్యమాన్ని విరమించారు. 12 సార్లు ప్రభుత్వంతో చర్చలు జరిపారు. ప్రయోజనం లేదు. జనవరి 6న ముఖ్యమంత్రితో 12 సంఘాల సమావేశం జరిగింది. జనవరి 7న మరొకసారి సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ముఖ్యమంత్రి ఫిట్మెంట్ 23 శాతం అని ప్రకటించారు. మిగిలిన అంశాలను అధికారులతో మాట్లాడమని చెప్పారు.

జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లోని సంఘాలు ముఖ్యమంత్రిని అభినందిస్తూ మాట్లాడాయి. కాని ఏపిటియఫ్ అదే రోజున ప్రభుత్వ చర్చలను ఖండిస్తూ ప్రకటన వెలువరించింది. దశల వారీ ఉద్యమానికి మరోసారి పిలుపునిచ్చింది. జనవరి 10, 11తేదీలలో పాత తాలూకా కేంద్రాలలో నిరసన ప్రదర్శనలు నిర్వహించి మెమోరాండం ఇవ్వడం జరిగింది. అప్పుడు ఇతర సంఘాలు స్పందించాయి. ఫ్యాప్టో 19వ తేదీన జిల్లా కలెక్టరేట్ల ముట్టడికి పిలుపునిచ్చింది.

ఇంతలో జనవరి 17వ తేదీన ప్రభుత్వం పి.ఆర్.సి జివోలను జారీ చేసింది. ఫిట్ మెంట్‌ను 23 శాతంగా నిర్ణయించింది. హెచ్.ఆర్.ఏ. శ్లాబులను గణనీయంగా తగ్గించింది. ఎడిషనల్ క్వాంటమ్ ఆఫ్ పెన్షను తగ్గించింది. సి.పి.ఎస్. రద్దు ప్రస్తావనే లేదు. ఇచ్చిన మధ్యంతర ఉపశమనాన్ని (ఐ. ఆర్.) కూడా రికవరీ చేస్తామని ప్రకటించింది. దానితో ఉద్యోగ, ఉపాధ్యాయ కార్మికులలో ఆగ్రహం పెల్లుబికింది. జిల్లా కలెక్టరేట్ల ముట్టడికి వేలాదిగా తరలివచ్చారు. ప్రతి జిల్లాలోను ఐదారువేలమంది హాజరయ్యారు. స్పందన చూసిన తరువాత జె.ఎ.సి. నాయకత్వం ఇతర జె.ఎ.సి.ల.తో చర్చలు ప్రారంభించింది. నాలుగు జె.ఎ.సిలు కలిసి పి.ఆర్.సి. సాధనా సమితిని ఏర్పరిచాయి. 12 సంఘాలతో స్టీరింగ్ కమిటీని ఏర్పాటు చేసుకున్నారు. రెండు రోజుల తరువాత స్టీరింగ్ కమిటీలోకి మరో 8 సంఘాలను చేర్చుకున్నాయి. ఈ ఉద్యమాన్ని ప్రారంభించిన ఏపిటిఎఫ్‌కు ఈ 20 మంది స్టీరింగ్ కమిటీలో స్థానం లభించలేదు. జనవరి 25న జిల్లా కేంద్రాలలో ధర్నాలకు సాధన సమితి పిలుపునిచ్చింది. అది విజయవంతంగా జరిగింది. ఫిబ్రవరి 3 'ఛలో విజయవాడ'కు స్టీరింగ్ కమిటీ పిలుపునిచ్చింది.

ప్రభుత్వ వైఖరితో ఆగ్రహావేశాలతో రగిలిపోతున్న ఉద్యోగులు, ఉపాధ్యాయులు ఈ పిలుపును విజయవంతం చేశారు. దీనితో బెంబేలెత్తిన ప్రభుత్వం చర్చలకు ఆహ్వానించింది. దాదాపు లక్షమంది మహాప్రదర్శనతో వచ్చిన పై చేయిని సద్వినియోగం చేసుకొని ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికుల ప్రయోజనాలను కాపాడడంలో స్టీరింగ్ కమిటీ విఫలమయింది. అశుతోష్ మిశ్రా కమీషన్ రిపోర్టు విడుదలచేయాలని, పి.ఆర్.సి. జీ.వో.లను ఉపసంహరిస్తేనే చర్చలకు వెళ్లాలని స్టీరింగ్ కమిటీలో నిర్ణయించారు. కాని ఆ రెండు షరతులను ప్రభుత్వం నెరవేర్చకపోయినా చర్చలకు వెళ్ళారు. ప్రధానమైన డిమాండ్లలో ఒక్కటి తప్ప దేనిని సాధించకుండానే 6వ తేదీన సమ్మె పిలుపును ఉపసంహరించుకుంటున్నట్లుగా ప్రకటించారు.

# ఆంధ్రప్రదేశ్‌లో జిల్లాల విభజన - ప్రజాందోళనలు

*ఆంధ్రప్రదేశ్‌లో జిల్లాల విభజన, కొత్త జిల్లాల ఏర్పాటు తొందరపాటుతో అస్తవ్యస్తంగా జరిగిందని, ప్రజాందోళనకు దారితీసిందని అంటున్నారు* **చిమ్మె. జాన్ బర్నబాస్**

**ఆం**ధ్రప్రదేశ్ రాష్ట్రంలో ప్రస్తుతం ఉన్న 13 జిల్లాల స్థానంలో 26 జిల్లాలను ఏర్పాటు చేస్తూ 2022 జనవరి 25న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నోటిఫికేషన్ విడుదల చేసింది. రానున్న ఉగాది పండుగ (2022 ఏప్రిల్ 2) నాటికి నూతన జిల్లాలను ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటించింది. ఆలోపుగా ఏమైనా అభ్యంతరాలు ఉంటే ఫిబ్రవరి 28 నాటికి రాష్ట్ర ప్రభుత్వానికి తెలియజేయాలని ప్రజలను కోరింది. రాష్ట్రంలో లోక్‌సభ నియోజకవర్గాన్ని జిల్లాగా ఏర్పాటు చేస్తామని ఎన్నికల హామీగా ముఖ్యమంత్రి జగన్‌మోహన్‌రెడ్డి గతంలో ప్రకటించారు. కానీ ఆ విధంగా జరుగలేదు. లోక్‌సభ నియోజక వర్గాలలోని కొన్ని మండలాలు మరొక లోక్‌సభ నియోజకవర్గంలో కలుపుతూ జిల్లాల ఏర్పాటు ప్రక్రియను ప్రకటించారు. అయితే అది పూర్తి కాకముందే వివిధ జిల్లాలలో ప్రజా నిరసనలు, ఆందోళనలను కొనసాగుతున్నాయి.

రాష్ట్రంలో 25 లోక్‌సభ స్థానాలుండగా జిల్లాలను 26గా ప్రకటించారు. రాష్ట్రంలో ఒక్కో లోక్‌సభ నియోజకవర్గాన్ని ఒక జిల్లాగా ప్రకటించాలన్న ప్రతిపాదన ఉండగా, భౌగోళిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితులను, సౌలభ్యాలను దృష్టిలో ఉంచుకొని జిల్లాలను ప్రకటించడంలో రాష్ట్ర ప్రభుత్వం విఫలం అయింది. ఇప్పుడున్న జిల్లా కేంద్రాలకు దగ్గరగా ఉన్న మండలాలను కొత్తగా ఏర్పాటు చేస్తున్న జిల్లా కేంద్రాలకు కలపడం ప్రజలకు అనేక ఇబ్బందులకు గురిచేస్తుంది. ఇప్పుడున్న జిల్లాలకు 20-25 కిలోమీటర్ల దూరంలో ఉన్న మండలాలను తీసుకొని పోయి, 70-100 కిలోమీర్ల దూరంలో ఉన్న జిల్లా కేంద్రాలకు కలిపారు. తద్వారా ప్రజలకు దాదాపుగా మూడు గంటల అదనపు ప్రయాణ భారం పడుతుంది. ప్రజలకు రవాణా సౌకర్యం, వ్యాపార లావాదేవీలు అనుకూలంగా ఉన్న ప్రాంతాలను తీసుకొని పోయి కొత్త ప్రాంతానికి కలపడం వలన వారి సాంఘిక, సాంస్కృతిక అనుబంధం తెంచివేసినట్లు అవుతుంది. అందువలన ప్రజలు నష్టాలకు శ్రమకు గురికావలసి వస్తుంది. ప్రజల రవాణా సౌకర్యం, భౌగోళిక దూరాన్ని పరిగణనలోకి తీసుకోకుండా కొత్త ప్రాంతానికి ప్రజలను అనుసంధానం చేయడం వలన వారు మరొక ప్రాంతానికి అధికారులతో కలవడానికి, తమ తమ ప్రభుత్వ పనులను పొందడానికి సుదూరం ప్రయాణించవలసి రావడం ప్రజలలో తీవ్ర నిరసన, ఆందోళనలు వ్యక్తమవుతున్నాయి. ఎక్కడికక్కడ ఐక్య కార్యాచరణ కమిటీ (జెఎసి)లు ఏర్పాటు చేసుకొని విద్యార్థులు, యువకులు, రైతులు, మహిళలు, ప్రజా సంఘాలు పోరుబాట పట్టాయి.

దీనిపై ప్రభుత్వం నుంచి స్పందన రావలసి ఉంది. ప్రభుత్వం

---

ప్రధానడిమాండ్లు :

1. ఫిట్ మెంట్ కనీసం 27 శాతానికి తగ్గరాదు.
2. హెచ్.ఆర్.ఎ. శ్లాబులు, రేట్లను పూర్వస్థితికి పునరుద్ధరించాలి.
3. ఎడిషనల్ క్వాంటమ్ ఆఫ్ పెన్షన్ పూర్వస్థితికి పునరుద్ధరించాలి.
4. సి.పి.ఎస్.ను రద్దు చేయాలి.
5. ఐ.ఆర్. రికవరీని (01-07-2018 నుండి 01-04-2020 వరకు) నిలుపుదల చేయాలి.
6. పెంచిన గ్రాట్యుటీని మానిటరీ బెనిఫిట్ ఇచ్చిన తేదీ నుండి అమలుచేయాలి.
7. కాంట్రాక్టు ఉద్యోగులను రెగ్యులర్ చేయాలి. అవుట్‌సోర్సింగ్ ఉద్యోగులకు మినిమం టైం స్కేలు ఇవ్వాలి.
8. గ్రామ సచివాలయ ఉద్యోగుల సర్వీసును అక్టోబర్ 2020 నుండి క్రమబద్ధీకరించి వారికి కొత్త స్కేళ్లలో వేతన స్కేలు ఇవ్వాలి.
9. పి.ఆర్.సి.ని 5 సంవత్సరాలకు ఒకసారి నియమించాలి.

పై తొమ్మిది డిమాండ్లలో 9వ డిమాండ్ తప్ప ఏదీ ప్రభుత్వం అంగీకరించలేదు. హెచ్.ఆర్.ఏ., ఎడిషనల్ క్వాంటమ్ ఆఫ్ పెన్షన్లను, పి.ఆర్.సి. జీ.వో.లో ఇచ్చిన దానికంటే కొంత పెంచారు. కాని పూర్వపు స్థాయికి పునరుద్ధరించలేదు.

ఈ సమస్యలేవీ పరిష్కారం కాకుండానే స్టీరింగ్ కమిటీ ఆందోళనను విరమించింది. ఏ ఒక్క సంఘమూ చర్చలలో తమ అసమ్మతిని నోట్ చేయించలేదు. ప్రెస్ మీట్‌లో మాత్రం మూడు ఉపాధ్యాయ సంఘాలు పాల్గొనలేదు. ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ వెంటనే ఈ ఒప్పందాన్ని, ఆందోళన విరమించడాన్ని ఖండించింది. ఇతర ఉపాధ్యాయ సంఘాలతో కలిసి మరొక ఉద్యమాన్ని నిర్మించడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. సాధనసమితి స్టీరింగ్ కమిటీ చేసిన ద్రోహంతో ఉద్యోగులు, ఉపాధ్యాయులు, పెన్షనర్లు తీవ్ర నిరాశకు గురయ్యారు. రగులుతున్న ఉద్యమంపై ప్రభుత్వంతో చేతులు కలిపి నీళ్లు చల్లి చల్లార్చిన స్టీరింగ్ కమిటీ రాష్ట్రంలోని ఉద్యోగ, ఉపాధ్యాయ, పెన్షనర్లకు తీవ్ర నష్టాన్ని కలుగచేసింది. ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక, పెన్షనర్లలో ఆత్మస్థైర్యాన్ని నింపి వారికి విశ్వాసం కలిగించి ఈ స్థాయి ఉద్యమాన్ని మరల నిర్మించడానికి కొంత సమయం పడుతుంది. అయితే ఈ ఉద్యమం రాష్ట్రంలోని వివిధ రంగాలకు చెందిన ప్రజలకు స్ఫూర్తిదాయకంగా నిలిచింది. గత రెండున్నర సంవత్సరాలుగా నిద్రాణంగా ఉన్నవారు మేల్కొని ఉద్యమబాట పట్టడానికి ఉద్యోగుల, ఉపాధ్యాయుల ఉద్యమం మేలుకొల్పుగా పనిచేసింది.

*(రచయిత రాష్ట్ర ప్రధానకార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్)*

సానుకూలంగా స్పందిస్తే బాగుంటుంది. లేనిచో ఇప్పటికే ప్రజలు తీవ్ర ఆగ్రహావేశాలకు లోనవుతున్నారు. అంతేకాకుండా అధికార పార్టీకి చెందిన వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీ నాయకులు కూడా ఈ ఆందోళనలలో అక్కడక్కడ పాల్గొంటున్నారు. చిత్తూరు జిల్లా మదనపల్లె, కడప జిల్లా రాజంపేట ప్రాంతాలను నూతనంగా ఏర్పాటు చేయబోయే జిల్లా కేంద్రాలుగా ప్రకటించాలని ప్రజల నుంచి పెద్ద ఎత్తున ఆందోళన ప్రారంభమైంది. అదే విధంగా శ్రీ సత్యసాయి జిల్లా కేంద్రంగా పుట్టపర్తిని ప్రకటించారు. అది హిందూపురం పార్లమెంట్ పరిధిలోకి వస్తుంది. హిందూపురం పార్లమెంట్ కేంద్రం అయినప్పుడు హిందూపురం కాకుండా పుట్టపర్తిని ఎందుకు ప్రకటించారో వారికే తెలియాలి. అదీకాక పుట్టపర్తి ఒక ఆధ్యాత్మిక కేంద్రం. అక్కడ ప్రజలు కేవలం ఆధ్యాత్మిక ప్రాంతంగానే దానిని చూస్తారు. అక్కడ సమస్యల కోసం ఆందోళనలు చేయడానికి, పోరాడడానికి అనేక ఆంక్షలు ఉంటాయి. హిందూపురం పెద్ద పట్టణం, నేషనల్ హైవే 7 (నాగపూర్ – కన్యాకుమారి) పోతుంది, పట్టు పరిశ్రమకు పెద్ద కేంద్రం, బెంగుళూరు నగరానికి కేవలం గంటన్నర ప్రయాణం మాత్రమే ఉంటుంది. అనేక సౌలభ్యాలున్న ప్రాంతాన్ని తీసుకొని పోయి, పుట్టపర్తి కేంద్రంగా ప్రకటించడం ప్రజలకు తీవ్ర ఆగ్రహం తెప్పిస్తుంది.

కొత్త జిల్లాలను ఏర్పాటు చేసే క్రమంలో ఒక శాసన సభ నియోజకవర్గం ఒకే జిల్లాలోనికే రావాలనే ప్రతిపాదన ఒకందుకు మంచిదైనా ఇది బెడిసి కొట్టింది. ఉదాహరణకు పాణ్యం అసెంబ్లీ నియోజకవర్గంలోని ప్రధాన మండలాలు అయిన పాణ్యం, గడివేముల మండలాలు రెండూ నంద్యాల పట్టణానికి చాలా దగ్గరి ప్రాంతాలు వాటిని మొత్తాన్ని తీసుకొని పోయి కర్నూలు జిల్లాలో కలిపారు. ఎందుకంటే కర్నూలుకు దగ్గరగా ఉన్న ఇదే నియోజకవర్గంలోని ఓర్వకల్లు, కల్లూరు మండలాలు కర్నూలు పట్టణానికి అత్యంత సమీపంలోని గ్రామాలను కలిగి ఉన్నవి. దీని విషయమై చాలా తీవ్రమైన ప్రజాందోళనలు కొనసాగుతున్నాయి. గడివేముల, పాణ్యం మండలాలను నంద్యాల జిల్లాలో కొనసాగించాలని ఆందోళనలు జరుగుతున్నవి.

ఈ విధంగా శ్రీకాకుళం జిల్లా నుంచి చిత్తూరు జిల్లా (బాలాజీ జిల్లా) వరకు ఏదో ఒక రూపంలో ఆందోళనలు కొనసాగుతూ ఉన్నవి. ప్రజల అభిప్రాయాన్ని మొదట తెలుసుకొని తర్వాత జిల్లాలను ప్రకటించి ఉంటే బాగుండేది. ఆ విధంగా కాకుండా మొదట వారొక నిర్ణయం తీసుకొని ఆ తర్వాత ప్రజలపై దానిని రుద్దే ప్రయత్నం చేస్తున్నారు. ఇది ఒక రకంగా అప్రజాస్వామిక నిర్ణయమే. ప్రజాభిప్రాయానికి పూర్తిగా విరుద్ధంగా ఈ మొత్తం ప్రక్రియ జరుగుతోంది.

విజయనగరం జిల్లాలోని పార్వతీపురం కేంద్రంగా 'మన్యం జిల్లా'ను ఏర్పాటు చేశారు. విశాఖపట్టణం జిల్లాలోని పాడేరు కేంద్రంగా ఏర్పాటు చేసిన జిల్లాకు అల్లూరి సీతారామరాజు జిల్లాగా నామకరణం చేశారు. తిరుపతి కేంద్రంగా శ్రీ బాలాజీ జిల్లాను, విజయవాడ కేంద్రంగా ఎన్టిఆర్ జిల్లాను, రాయచోటి కేంద్రంగా అన్నమయ్య జిల్లాను, పుట్టపర్తి కేంద్రంగా శ్రీ సత్యసాయి జిల్లాను ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటించారు. ప్రస్తుతం ఉన్న తూర్పు గోదావరి జిల్లాను రెండు భాగాలుగా విభజించి అమలాపురం కేంద్రంగా 'కోనసీమ' జిల్లాను, నరసరావుపేట కేంద్రంగా 'పలనాడు' జిల్లాను ఆయా ప్రాంతాల వ్యవహారిక భాషలతో ప్రకటించారు.

ఒక లోక్‌సభ నియోజకవర్గం పరిధిలోని శాసనసభ స్థానాలన్నీ కచ్చితంగా ఒకే జిల్లాలోనే ఉండాలనే నిబంధన పెట్టుకోలేదు. ఒక లోక్‌సభ నియోజకవర్గంలోని ఏదైనా శాసనసభ స్థానం కొత్తగా ఏర్పడే పక్క జిల్లా కేంద్రానికి దగ్గరగా ఉంటే దాన్ని అదే పరిధిలోకి తీసుకొచ్చారు. ఉదాహరణకు గుంటూరు జిల్లాలోని బాపట్ల పార్లమెంట్ స్థానంలోని సంతనూతలపాడు నియోజకవర్గాన్ని ఒంగోలులో కలిపారు. సంతనూతలపాడు నియోజకవర్గం పూర్వపు ప్రకాశం జిల్లా కేంద్రం ఒంగోలుకు చాలా సమీపంలో ఉంటుంది. అయితే అదే ప్రకాశం జిల్లాలోని కందుకూరు మొత్తం రెవెన్యూ డివిజన్‌ను రద్దుచేసి శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లాలో కొంత కలిపారు. కొంత మార్కాపురం ఒంగోలులో కలిపారు. కందుకూరు పట్టణం ప్రకాశం జిల్లాలో చాలా ప్రాముఖ్యమైనది. అటువంటి దానికి ఉనికి లేకుండా చేశారు. కందుకూరు నియోజకవర్గాన్ని మొత్తం శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లాలోని కావలి రెవెన్యూ డివిజన్ కిందకు తీసుకొని రావడం కందుకూరు ప్రాంత ప్రజలు జీర్ణించుకోలేకపోతున్నారు. ఈ విధంగా ప్రతి జిల్లాలో ఏదో ఒక సమస్య తలెత్తుతూ ఉంది. దీనికంతటికీ రాష్ట్ర ప్రభుత్వ తొందరపాటుతనమే కారణం.

జిల్లాల ఏర్పాటు చట్టం 1974 లోని సెక్షన్ 3(5) ప్రకారం కొత్తగా 13 జిల్లాలు, 12 రెవెన్యూ డివిజన్‌లు ఏర్పాటు ప్రతిపాదనలు చేశారు. ఇప్పటివరకూ ఉన్న వాటిని కలుపుకొని మొత్తం 26 జిల్లాలు, 63 రెవెన్యూ డివిజన్‌లు ఏర్పాటు కానున్నాయి. రెవెన్యూ డివిజన్‌ల పునర్వ్యవస్థీకరణలో కొత్తగా మండలాలను విభజించలేదు. కొత్త మండల కేంద్రాలను ప్రకటించలేదు. ఇది కూడా కొంత గందరగోళానికి దారితీసింది. దీనిపై కూడా ప్రభుత్వం రాష్ట్ర ప్రజలకు వివరణ ఇవ్వవలసి ఉంది.

రాష్ట్ర ప్రభుత్వం ఇంత తొందరగా జిల్లాల విభజనను ప్రకటించడానికి అసలు కారణం రాష్ట్రంలోని ఉద్యోగుల, ఉపాధ్యాయుల ఐక్య కార్యాచరణ కమిటీ కొత్త పిఆర్‌సికి వ్యతిరేకంగా, పాత పిఆర్‌సినే కొనసాగించాలని కోరుతూ ఫిబ్రవరి 24న రాష్ట్ర ప్రభుత్వానికి సమ్మె నోటీసు ఇచ్చారు. ఈ సమ్మెను పక్కదొవ పట్టించడానికి, ప్రజల దృష్టి మరల్చడానికి ఎత్తుగడలో భాగంగానే ఈ కొత్త జిల్లాల ప్రకటన ఆగమేఘాల మీద రాత్రికి రాత్రి ప్రకటించారు. ఇది పూర్తిగా ఏకపక్షంగా జరిగిన ప్రక్రియగానే భావించాలి. ఇందులో మరొక కోణం కూడా ఉంది. ఇప్పటికే వివిధ జిల్లాలో రాజకీయంగా ప్రాధాన్యం కలిగిన ప్రత్యర్థి పార్టీల నాయకుల, కుటుంబాల ఆధిపత్యాన్ని తగ్గించడానికి, వారి మూలాలను తొలగించి వేయడానికి అల్లిన పథకంగా కూడా భావించవచ్చు. దీనిని దృష్టిలో పెట్టుకొని జిల్లా కేంద్రాలను, రెవెన్యూ డివిజన్‌లను ఏర్పాటు చేసినట్లుగా కూడా తెలుస్తున్నది.

నూతన జిల్లాల ప్రకటన మొత్తంగా కూడా రాష్ట్ర ప్రజలను ఏదో ఒక మేరకు ఆందోళన కలిగిస్తున్న అంశంగా ఉంది. తేనెతుట్టె కదిలినట్లుగా ఉంది. తేనెటీగల దాడిలో రాష్ట్ర ప్రభుత్వ పెద్దలకు ఏదో ఒక మేరకు దెబ్బ తగలక మానదు. ప్రజాభిప్రాయం మేరకు రాష్ట్ర ప్రభుత్వం నడుచుకోకపోతే ప్రజాగ్రహానికి గురికాక తప్పదు.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# కరోనాతో కకావికలైన హోటల్ పరిశ్రమ

***కరోనా సంక్షోభం ఆర్థిక వ్యవస్థలో అనేక రంగాలను అతలాకుతలం చేసిందని, అలా విధ్వంసానికి గురైన హోటల్ పరిశ్రమ అనుభవాన్ని వివరిన్నారు* రాజేంద్రబాబు అర్విణి**

కరోనా! అతి భయంకరంగా ప్రపంచాన్ని చుట్టేసిన వ్యాధి. రెండు సంవత్సరాలుగా సమాజాన్ని ఎన్నో ఆటుపోట్లకు గురిచేస్తున్న వ్యాధి. దేశం ఆర్థికంగా ఎన్నో ఒడిదుడుకులకు లోనయ్యింది. 80 శాతం మంది ప్రజలు తీవ్రమయిన ఇబ్బందులకు లోనయ్యారు. నిరుద్యోగిత ఎన్నడూ లేనంత నీచ స్థాయికి చేరుకుంది. ఉపాధి అవకాశాలు కరువయ్యాయి. కరోనా కొంత తెరపి ఇచ్చిన ఈ సందర్భంలో ఆ మహమ్మారి ఒక్కొక్క రంగంలో కలగ జేసిన దుష్ప్రభావాన్ని అంచనా వెయ్యడానికి అధ్యయనాలు ప్రారంభమయ్యాయి. జనవరి 23, 2022 నాటి ఎకనామిక్ టైమ్స్ పత్రికలో కరోనా వల్ల దేశంలో హోటల్ రంగం ఎంత సంక్షోభ స్థితి కి నెట్టబడ్డదో కొన్ని వివరాలను ఓ కథన రూపంలో ప్రచురించారు. ఇతర రంగాలలో కూడా అంతకంటే ఎక్కువ స్థాయిలో దారుణ పరిస్థితులు నెలకొని ఉంటాయి. వాటన్నిటి మీద అధ్యయనాలు జరగాలి. ఔత్సాహికులు తమకు వీలయిన రంగాలలో పరిశోధన చేసి సమాజంలోని అన్ని రంగాలు కరోనా వలన ఎలా అతలాకుతలం అయ్యాయో రికార్డ్ చేసే ఆలోచన చేస్తారన్న ఉద్దేశ్యంతో ప్రేరణగా ఉంటుందని 'వీక్షణం కలెక్టివ్' నిర్ణయం మేరకు ఎకనామిక్ టైమ్స్ పత్రిక వారు ప్రచురించిన వివరాలకు నా అభిప్రాయాలు కూడా జోడించి హోటల్ రంగంలోని అస్తవ్యస్థంగా ఉన్న పరిస్థితిని పాఠకుల ముందుంచుతున్నాను. ఎకనామిక్ టైమ్స్ పత్రిక వారి ఆ వ్యాసానికి ఆధారం 'నేషనల్ రెస్టారెంట్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా అన్న సంస్థ వారు 'ఆహార సేవా రంగ పరిశ్రమపై కోవిడ్ ప్రభావం' అన్న శీర్షికతో విడుదల చేసిన నివేదిక.

హోటల్ రంగం చాలా మందికి ఉపాధి కల్పించే పరిశ్రమ. ఒక్కో పెద్ద రెస్టారెంట్ లో కొన్ని వందలమంది పనివాళ్లు ఉంటారు. సప్లయర్లు, వంట పనివాళ్లు, క్లీనర్లు, డెలివరీ బాయ్స్, మేనేజర్లు, కాషియర్లు, కూరగాయలు సరఫరా చేసేవాళ్లు, కూరగాయలు తరిగేవాళ్లు, శాకాహారానికి మాంసాహారానికి ప్రత్యేకంగా ఏర్పాట్లు చేసేవారు, గూర్ఖాలు ఇంకా ఇలా రకరకాల విధులు నిర్వర్తించే వాళ్లు ఉంటారు. నేషనల్ రెస్టారెంట్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా వారి గణాంకాల ప్రకారం 73 లక్షల మందికి ఈ పరిశ్రమ ఉపాధి కల్పిస్తున్నది. అయితే ఈ లెక్కలు ఆ సంస్థలో సభ్యత్వం ఉన్న హోటళ్ల కు సంబంధించినవి మాత్రమే. ఆ సంస్థలో సభ్యత్వం లేని చిన్న హోటళ్లు, రెస్టారెంట్లు దేశ వ్యాప్తంగా లక్షల సంఖ్యలో ఉన్నాయి. వాటిని కూడా కలుపుకుంటే ఈ రంగంలో ఉపాధి పొందుతున్న వారి సంఖ్య కోట్లల్లో ఉంటుంది. ఆ సంస్థ వారి నివేదిక ప్రకారం ఈ కరోనా కాలంలో 23 లక్షలకు పైగా పనివారు తమ ఉపాధిని కోల్పోయారు. ఈ గణాంకాలలో చోటు దక్కని ఉపాధి కోల్పోయిన వారి సంఖ్య కోట్లలో ఉండినా ఆశ్చర్యం లేదు. ఈ పరిశ్రమలో పని చేసే వారి మొత్తం సంఖ్యలో కరోనా మొదటి పద్దెనిమిది నెలల కాలంలో 31 శాతం తరుగుదల కనిపించింది. 25 శాతం రెస్టారెంట్లు శాశ్వతంగా మూతపడ్డాయి. ఆహార సేవలు అందించే ఈ పరిశ్రమ మార్కెట్ విలువ కోవిడ్ కంటే ముందు రు. 4.9 లక్షల కోట్లయితే ఆ విలువ కోవిడ్ మొదటి సంవత్సరంన్నర కాలం లో రు. 2 లక్షల కోట్లకు పడిపోయింది. హోటల్‌లలో ప్రత్యక్షంగా పనిచేయకపోయినా ఆ పరిశ్రమ మీద ఆధారపడి జీవనం సాగించే కుటుంబాలు కూడా దేశవ్యాప్తంగా కోట్ల సంఖ్యలో ఉంటాయి. ఉదాహరణకు పాలు అమ్ముకొనే వాళ్లు, పాన్ షాపుల వాళ్లు, కూరగాయలు పండించే వాళ్లు, వెచ్చాలు సరఫరా చేసే వ్యాపారులు ఇంకా అనేక రకాలుగా జీవనం గడుపుతున్న వాళ్లు. ఇక రోడ్ల పక్కన బండీల మీద ఇడ్లీలు, దోశలు అమ్ముకునే వాళ్లు, బాబాయి హోటల్, టిఫిన్ సెంటర్‌ల వాళ్ల సంగతి చెప్పనక్కరలేదు. వాళ్ల జీవితాలు, వాళ్ల నష్టాలు ఎవరి లెక్కల్లోకి రావు.

హోటల్ పరిశ్రమలో ఈ పరిస్థితి దాపురించడానికి కారణాలు ఏమిటి? బెంగుళూరు నగరం నడిబొడ్డున ఉన్న ఒక హోటల్ యజమాని నరేన్ బెలియప్ప తన హోటల్‌ను ఈ సంవత్సరం జనవరి 8 నుండి మూసివేసాడు. చాలా బాధాకరమైన నిర్ణయమైనప్పటికీ మూసివేయక తప్పలేదంటున్నాడు. ఆయన హోటల్ లో 50 మంది పనివాళ్లున్నారు. వాళ్లంతా రోడ్డున పడ్డారు. "ఈ హోటల్ భవనానికి కిరాయి ఎలా కట్టాలి? బెంగుళూరు నడిబొడ్డున ఉన్న హోటల్. అద్దె లక్షల్లో ఉంటుంది. నెలనెలా పనివాళ్లకు జీతాలెలా ఇవ్వాలి? ఈ రెండేళ్లలో అప్పులు లక్షలల్లో పేరుకు పోయాయి. రెండేళ్ల నుండి నష్టాలు భరిస్తున్నాను. ఇంకా ఎంతకాలం భరించాలి!" అని ఆయన ఆవేదన. కరోనా వల్ల హోటల్‌కు వచ్చి భోంచేసే వారి సంఖ్య దారుణంగా పడిపోయింది.

బెంగుళూరు, ఢిల్లీ, ముంబాయి, తిరువనంతపురం, చెన్నయ్ లాంటి నగరాలు ఈ రెండు సంవత్సరాల కాలంలో ఎక్కువ కర్ఫ్యూల బారిన పడ్డాయి. అవి లేకపోతే రాత్రి 9 గంటలకు లేదా 10 గంటలకు హోటళ్లు మూసేయాలని ప్రభుత్వ ఉత్తర్వులు. చాలా పట్టణాల్లో, నగరాల్లో 50 శాతం సీట్ల కంటే ఎక్కువ మందిని అనుమతించకూడదని ఆంక్షలు.

న్యూ ఢిల్లీలోని ఖాన్ మార్కెట్ లేదా ముంబాయ్‌లోని బాంద్రా లాంటి ప్రదేశాలలో హోటళ్లు నడపడం అంటే కత్తి మీద సాము లాంటిది. ఆకాశాన్నంటే అద్దెలు, రెస్టారెంట్ల మధ్య అధికమవుతున్న పోటీ, రోజురోజుకూ పెరుగుతున్న జీవన వ్యయం వలన పెంచాల్సిన పనివారి జీతాలు, వినియోగదారుల మారుతున్న రుచులు – వీటన్నింటి వల్ల ఆహార సేవల రంగం సంక్షోభంలో పడిపోయిందని రాహుల్ అక్రేకర్ అంటున్నాడు. ముంబాయ్ నగరంలో ఆయన ప్రసిద్ధ వంటల మాస్టారు. వంటలు వండడంలో నైపుణ్యం కలిగిన వాడని పేరు. ఎన్నో ఆశలతో, మరెన్నో ఊహలతో క్వాలియా అన్న రెస్టారెంట్‌ను 2019లో ప్రారంభించాడు. అనతి కాలంలోనే ముంబాయిలోని 50 మంచి రెస్టారెంట్‌లలో ఒకటని పురస్కారం కూడా లభించింది. కానీ, 2021 లోనే దానిని మూసివేయవలసి వచ్చింది. "ఈ బిల్డింగ్ యజమాని మొదటి లాక్‌డౌన్‌లో మా పట్ల దయతోనే

# యుక్రెయిన్‌లో యుద్ధం వస్తుందా?

*అమెరికా, రష్యా, యూరోపియన్ యూనియన్‌ల రాజకీయార్థిక ప్రయోజనాల క్రీడలో పావుగా మారిన యుక్రెయిన్‌లో తీవ్రతరమవుతున్న ఉద్రిక్తతలను వివరిస్తున్నారు* **డా. కొల్లా రాజమోహన్**

**యు**క్రెయిన్ సమస్యకు పరిష్కారం కనుక్కోటానికి ఫ్రెంచ్ ప్రెసిడెంట్ మాక్రాన్ ఈ వారం మాస్కోకు వెళ్లారు. రష్యా అధ్యక్షుడు పుతిన్‌తో ఐదు గంటలపాటు చర్చించారు. మరుసటి రోజు యుక్రెయిన్ అధ్యక్షుడు జెలెన్స్‌కీతో కీవ్‌లో చర్చలు జరిపారు. అమెరికా అధ్యక్షుడు జో బిడెన్ తో ఫోన్‌లో చర్చించారు. బెర్లిన్‌లో జర్మనీ ఛాన్సలర్ ఉల్ఫ్ షుల్జ్‌తో భేటీ అయ్యారు. చర్చల తర్వాత మాట్లాడుతూ దౌత్య మార్గాల ద్వారా సమస్య పరిష్కారానికి కృషి చేస్తున్నామన్నారు. ఉద్రిక్తతలను తగ్గించడానికి ఆచరణాత్మక పరిష్కారం సాధ్యమే అన్నారు. అయితే సంక్షోభాన్ని కొద్ది గంటలలో పరిష్కరించ లేమన్నారు. కొన్ని రోజులు, వారాలు, నెలలు పట్టవచ్చున్నారు. యుక్రెయిన్ లేక యూరప్ లోని ఏ దేశం సార్వభౌమాధికారం గూర్చి రాజీ పడేది లేదన్నారు. అలానే రష్యా తన రక్షణ అవసరాలను లేవనెత్తడం సరైనదేనన్నారు. రష్యా ధ్యేయం యుక్రెయిన్‌ని ఆక్రమించుకోవడం కాదని కూడా అన్నారు. అమెరికా అధికారుల కథనం ప్రకారం లక్ష పదివేల సైన్యాన్ని యుక్రెయిన్ సరిహద్దులలో రష్యా మోహరించింది. ఫిబ్రవరి మధ్యకి లక్షా యాభై వేల మంది సైనికులతో పూర్తిస్థాయిలో యుక్రెయిన్‌పై దాడి చేయాలని నిర్ణయించుకుందని, ఏ క్షణమైనా దాడి చేయవచ్చని అమెరికా చెప్తూంది. రష్యా ఈ కథనాన్ని నిరాకరిస్తోంది. యుక్రెయిన్‌ను నాటోలో చేర్చుకుంటే రష్యా చూస్తూ ఊరుకోదని పుతిన్ మాక్రాన్‌కి స్పష్టం చేశారు. యుక్రెయిన్‌పై దాడి తమ ధ్యేయం కాదంటూనే, రష్యా రక్షణ గ్యారెంటీలే ప్రధాన ధ్యేయమని చెప్తున్నది. యుక్రెయిన్‌కు నాటో సైనిక కూటమిలో స్థానం కల్పించకుండా పశ్చిమ దేశాలు రక్షణ పరమైన హామీ ఇవ్వాలని, మే 1997 తర్వాత నాటోలో

---

ఉన్నాడు. అద్దె గురించి తకరారు చెయ్యలేదు. కానీ, రెండవ సారి ఆంక్షల ప్రకటన వెలువడినప్పుడు తానేమీ చేయలేనని తన నిస్సహాయతను వెలిబుచ్చాడు". నెల నెలా రు 16 లక్షల అద్దె చెల్లించి ఆహార సేవలు కొనసాగించే పరిస్థితి లేదని, భారీగా చెల్లింపులు చేయాల్సిన బాధ్యత పైన బడ్డదని, మూసివేయక తప్పలేదని అక్రేకర్ తన బాధను వెళ్లబోసుకున్నాడు. "ముందే ఈ నిర్ణయం తీసుకొని ఉంటే కోట్ల రూపాయల అప్పు మీద పడేది కూడా కాద"ని చెదిరిన మనస్సుతో అన్నాడు.

హొటల్‌కు వచ్చి టిఫిన్స్, భోజనం చేసే పరిస్థితులు లేక రెస్టారెంట్‌లు వెలవెల బోయిన కరోనా సందర్భంలో, తయారైన ఆహారాన్ని ఇంటి గుమ్మం దాకా తీసుకు వచ్చి సరఫరా చేసే సంస్థలు బాగా లాభాలు గడించాయి. ప్రధాన నగరాలలో, పట్టణాలలో అంతర్జాతీయ పెట్టుబడిదారీ సంస్థలయిన జొమాటో, స్విగ్గీలు అంచనాలకందని రీతిలో కోట్లకు పడగలెత్తాయి. నూతన సంవత్సర వేడుకల సందర్భంగా ఒక్క జనవరి 1 నాడు ఈ సంస్థలకు చెరో 20 లక్షల వరకు అంటే రెండింటికి కలిపి ఒకే ఒక్క రోజు 40 లక్షల దాకా ఆర్డర్‌లు వచ్చాయంటే రెస్టారెంట్‌లకు ఉన్న ఈ దయనీయ పరిస్థితి వారికెంత బాగా ఉపయోగపడిందో తెలుస్తూ ఉన్నది. ఉద్యోగాలు కోల్పోయిన హొటల్ వర్కర్లు చాలా మంది జొమాటో, స్విగ్గీలలో డెలివరీ బాయ్స్‌గా ఉపాధి సంపాదించటానికి ప్రయత్నాలు చేశారు. అలవాటు తప్పిన తిరుగుడు పని కాబట్టి రోడ్డు ప్రమాదాలకు గురయిన వారు కోకొల్లలు.

సలీల్ త్రిపాఠి ఢిల్లీలో ఒక ప్రతిష్టాత్మక హొటల్‌లో మేనేజర్‌గా పని చేసేవాడు. ఆయన హొటల్ మానేజ్‌మెంట్ కోర్స్‌లో పట్టభద్రుడు కూడా. మహమ్మారి వ్యాధి మూలంగా ఆ హొటల్ మూత బడ్డది. దాంతో జీవిక కోసం డెలివరీ బాయ్‌గా జీవితం ప్రారంభించాడు. ఒక వినియోగదారునికి కావలిసిన ఆహారం ప్యాకెట్‌ను సకాలంలో అందివ్వాలని తొందరలో మోటారు సైకిల్ మీద వెళుతూ మార్గమధ్యంలో రోడ్డు ప్రమాదానికి గురై అక్కడికక్కడే మరణించాడని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రిక వెల్లడించింది. పత్రికల కెక్కని డెలివరీ బాయ్స్ రోడ్డు ప్రమాద మరణాలు ఎన్నో!

ఇలా హొటల్ పరిశ్రమ సమస్యల వలయంలో చిక్కుకున్నప్పుడు ప్రభుత్వం వైపు నుండి స్పందన ఏమిటి అన్నది ప్రశ్న. 2020వ సంవత్సరంలో కరోనా వల్ల నష్టపోతున్నారన్న నెపంతో బడా పెట్టుబడిదారులకు, కార్పొరేట్ సంస్థలకు 20 లక్షల కోట్ల రూపాయల ఉద్దీపన ప్రకటించిన భారత ప్రభుత్వం ప్రజల కనీస అవసరాలలో ఒకటయిన ఆహారానికి సంబంధించిన సేవా రంగానికి ఏమీ చేయ లేదు. దానిని పుర్తిగా విస్మరించింది. తమ పట్ల ప్రభుత్వ వైఖరి అన్యాయంగా, అసమంజసంగా ఉందని హొటల్ పరిశ్రమ వారు అభిప్రాయ పడుతున్నారు. కోవిడ్ కాస్త తెరపి ఇచ్చినప్పుడు మెల్ల మెల్లగా పుంజుకుంటున్న సందర్భంలో మళ్లీ కొత్త ఆంక్షలు విధించి మమ్మల్ని నీరసానికి గురి చేస్తున్నారని వారు ఆవేదన చెందుతున్నారు. ఈ సమస్య నుండి కొంతయినా ఉపశమనం పొందడానికి ఆలోచించి, మా ప్రతినిధులతో చర్చించి ప్రభుత్వం పరిష్కార మార్గాలు వెతకొచ్చు కదా అని వారు ప్రశ్నిస్తున్నారు.

ఒక్క అంతర్జాతీయ వ్యాపార సంస్థలతో, దేశీయ కార్పొరేట్ దిగ్గజాలతో తప్ప అది రైతులయినా, మరే వర్గమయినా చర్చించే అలవాటే లేదు కదా ఈ ప్రభుత్వానికి! కోవిడ్‌తో ఇక ఎల్లకాలము సహజీవనం చేయాల్సిందేనని ప్రభుత్వ వర్గాలు ప్రకటిస్తున్న నేపథ్యంలో దానికనుగుణంగా విధానాలు రూపొందించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదే కదా!

అశాస్త్రీయమయిన జిఎస్‌టి వలన కూడా వారి ఇబ్బందులు రెట్టింపయ్యాయి. ఈ విషయంలో ఇంగ్లాండ్ ప్రభుత్వాన్ని వారు ఉదాహరణగా చూపుతున్నారు. యునైటెడ్ కింగ్డమ్‌లో ఆహార సేవారంగం పరిశ్రమను కోవిడ్ బారి నుండి రక్షించే విధంగా చర్యలు చేపట్టిందని, హొటల్ యజమానులకు ఆర్థిక వెసులుబాటు కల్పించిందని, పరిశ్రమ ప్రతినిధులతో చర్చించి సంక్షోభం బారి నుండి కాపాడిందని వారు గుర్తు చేశారు.

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)*

సభ్యులుగా చేరిన దేశాల్లో నాటో ఆయుధాలను, బలగాలను మోహరించరాదని రష్యా డిమాండ్ చేస్తున్నది.

**అమెరికా నాయకత్వాన నాటో యుద్ధ సన్నాహాలు**

నాటో మిలిటరీ కోసం 1.1 ట్రిలియన్ డాలర్లను ఖర్చు పెడ్తూ ఉండగా రష్యా 65 బిలియన్ డాలర్లను ఖర్చు పెడ్తూ ఉన్నది. నాటోకి నాయకత్వం వహిస్తున్న అమెరికా కూడా ఫిబ్రవరి 5వ తేదీన 82 డివిజన్ నుంచి పోలెండ్ దేశానికి 1700 సైన్యాన్ని తరలించింది. ఇంకా జర్మనీ నుంచి 1000 మంది సైనికులు రుమేనియాలో ఉన్న 900 మంది అమెరికా సైన్యంతో కలుస్తారు. యూరప్‌లో 70,000 సైన్యం ఉంది. నాటో దేశాలు యఫ్-16 ఫైటర్స్, యఫ్-35 ఫైటర్స్, యాంటీ ట్యాంక్ మిస్సైల్స్, మిలిటరీ షిప్‌లు, జెట్ విమానాలు, సైనిక సామాగ్రి విరివిగా పంపుతున్నారు. సైనికులను పంపుతామన్న వారెవరూ కన్పించటం లేదు. యుక్రెయిన్‌కి 250,000 సైన్యం ఉంది. అమెరికా సైన్యం కొద్దిరోజుల్లో రాబోతుందని పోలెండ్ సైనికాధికారులు చెప్పారు. జావలిన్ యాంటీ-ట్యాంక్ మిసైళ్లు, స్టింగర్ యాంటీ-ఎయిర్‌క్రాఫ్ట్ మిసైళ్లు సహా 20 కోట్ల డాలర్ల విలువైన ఆయుధాలను యుక్రెయిన్‌కు పంపిస్తున్నట్లు అమెరికా చెప్తోంది. నాటో ఇతర సభ్య దేశాలు తమవద్ద ఉన్న అమెరికా తయారీ ఆయుధాలను యుక్రెయిన్‌కు పంపించేందుకు అనుమతిచ్చింది.

బ్రిటన్ కూడా షార్ట్-రేంజ్ యాంటీ-ట్యాంక్ మిసైళ్లను యుక్రెయిన్‌కు సరఫరా చేస్తోంది. వాటిని ఎలా ఉపయోగించాలో యుక్రెయిన్ సైన్యానికి శిక్షణ ఇవ్వడానికి తమ సైనిక సిబ్బందిని కూడా పంపించింది. డెన్మార్క్, స్పెయిన్, ఫ్రాన్స్, నెదర్లాండ్స్ సహా కొన్ని నాటో సభ్యదేశాలు యుద్ధ విమానాలు, యుద్ధనౌకలను తూర్పు యూరప్‌లో రక్షణను బలోపేతం చేయటానికి పంపిస్తున్నాయి.

అయితే సంఘర్షణలు జరుగుతున్న ప్రాంతాలకు ప్రాణాంతక ఆయుధాలను పంపించరాదనేది జర్మనీ విధానం. దీనికి అనుగుణంగానే ఆయుధాలు పంపించాలన్న యుక్రెయిన్ విజ్ఞప్తిని జర్మనీ తిరస్కరించింది. ఆయుధాలకు బదులుగా వైద్య సహాయం, 5,000 హెల్మెట్లను జర్మనీ పంపిస్తోంది.

అసలు యుక్రెయిన్‌కు రష్యాకు తగాదా ఏమిటి? మధ్యలో అమెరికా ఎందుకు వచ్చింది?తగాదా వలన ఎవరి ప్రయోజనాలు నెరవేరతాయి? రష్యా, యుక్రెయిన్‌లు రెండు ప్రాంతాలూ సోవియట్ యూనియన్ లో భాగంగా ఉన్నపుడు, వివిధ జాతుల మధ్య ఐక్యతను సాధించారు. రాష్ట్రాల మధ్య భౌగోళికంగా సరిహద్దులు నిర్ణయించారు.జాతుల మధ్య వైరుధ్యాలు లేకుండా ప్రజలంతా ఐక్యంగా సమసమాజ స్థాపన చేసుకుంటూ రెండవ ప్రపంచ యుద్ధంలో 27,000,000 మంది ప్రాణత్యాగంతో ఫాసిజం ప్రమాదం నుంచి ప్రపంచ ప్రజలను కాపాడారు. అమెరికా కుట్రలకు అంతర్గత సిద్ధాంత దివాళాకోరుతనం తోడయి 1991లో యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్ విచ్ఛిన్నమయింది. రాష్ట్రాలన్నీ స్వతంత్ర దేశాలయ్యాయి. యుక్రెయిన్ ఒక దేశంగా అవతరించింది. యుక్రెయిన్‌కి తూర్పున రష్యా, పశ్చిమంగా పోలండ్ ఉన్నాయి. పోలండ్ పక్కన జర్మనీ, ఫ్రాన్స్ దేశాలున్నాయి. తూర్పు యుక్రెయిన్ ప్రజలు రష్యన్ భాష మాట్లాడుతుండగా పశ్చిమ యుక్రెయిన్ ప్రజలు యుక్రెయిన్ భాష మాట్లాడుతున్నారు. శతాబ్దాలుగా ఒకటై జీవించిన రష్యన్లు-యుక్రెయిన్ల మధ్య అమెరికా భాషా భేదాలనూ, జాతి బేధాలనూ రెచ్చగొట్టింది.

నాటో సైనిక కూటమి 1949లో సోవియట్‌కి వ్యతిరేకంగా ఏర్పడింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా, కెనడా, బ్రిటన్, ఫ్రాన్స్ సహా 12 దేశాలతో ఏర్పాటైన సైనిక కూటమి నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్ - నాటో. ఈ కూటమి సభ్య దేశాల్లో ఏ ఒక్క దేశం పైన అయినా సాయుధ దాడి జరిగినట్లయితే ఆ దేశానికి మిగతా దేశాలన్నీ సహాయంగా రావాలన్నది ఈ కూటమి ఒప్పందం. 1991లో సోవియట్ యూనియన్ కుప్పకూలడంతో వార్సా ఒప్పందం సభ్య దేశాలు చాలా వరకు నాటో సభ్య దేశాలయ్యాయి. ఇప్పుడు నాటో సభ్య దేశాల సంఖ్య 30కి పెరిగింది. సోవియట్ యూనియన్ విఛిన్నం తరువాత నాటో అవసరం ముగిసిందనుకున్నారు. కానీ దురాక్రమణ యుద్ధాలతో ప్రపంచ ప్రజలను యుద్ధాలలోకి నెడ్తూనే ఉంది.

యూరోపియన్ యూనియన్‌లో యుక్రెయిన్‌ను చేర్చుకుని ఆర్థిక బంధాలను బలపరచి రష్యా నుండి దూరం చేసి యూరోపియన్ యూనియన్‌ను విస్తరించాలని అమెరికా, యూరప్‌లు కుట్రలు పన్నాయి. కుట్రలు ఫలించాయి. ప్రజలు యుద్ధం వద్దంటున్నా మిలటరిజం యుద్ధం కావాలని రాజకీయం నడుపుతున్నది.

సంభాషణల ద్వారా మిన్స్ - 2 అగ్రిమెంట్ 2014-15ని అమలుపరచి శాంతిని సాధించాలని ఉక్రెయిన్, రష్యా, జర్మనీ, ఫ్రాన్స్ దేశాలు ప్రయత్నించాయి. దురాక్రమణ ప్రయోజనాల దృష్ట్యా అమెరికా సంభాషణలకు దూరంగా ఉంది. యూరప్‌తో సఖ్యంగా ఉండాలని రష్యా చేస్తున్న ప్రయత్నాలకు అమెరికా అడ్డుపడ్తాంది. సంప్రదింపులకు బదులుగా తగాదా రాజకీయాలను నడుపుతున్నది. యుక్రెయిన్‌లో ఎన్నికలు జరిపి, కీలకమైన సరిహద్దును కంట్రోల్ చేయాలని నిర్ణయించారు. అమెరికా ఎక్కువ సైన్యాన్ని, ఎక్కువ ఆయుధాలను సరిహద్దులకు తరలించి ఉద్రిక్తతలను పెంచుతున్నది. యుక్రెయిన్‌ను రష్యాకు దూరం చేయాలనే ధ్యేయంతో అమెరికా, యూరప్ దేశాలు కృషి చేస్తున్నాయి. నాటో సైనిక కూటమిని విస్తరించాలనీ యుక్రెయిన్‌ను నాటో సైనిక కూటమిలో సభ్య దేశంగా చేర్చుకుని రష్యాకు వ్యతిరేకంగా నిలపాలని అమెరికా ప్రయత్నిస్తాంది. ఎట్టి పరిస్థితులలోనూ పక్కలో బల్లెంగా ఉండే నాటోను సహించేది లేదని రష్యా అడ్డం తిరిగింది. రష్యా సరిహద్దు దేశంలో నాటో మిస్సైల్స్‌ను ఏర్పాటు చేస్తే కొన్ని నిమిషాలలో రష్యాను భస్మీపటలం చేయవచ్చు.

1962లో అమెరికాకు 90 మైళ్ల దూరంలో ఉన్న క్యూబాలో రష్యా మిస్సైల్స్ ను ఏర్పాటు చేయడం అమెరికా సహించలేకపోయింది. అణు యద్ధ ప్రమాదం అమెరికా ముంగిట్లోకి వచ్చిందని గగ్గోలు పెట్టింది. అమెరికాలోని ఏ పట్టణాన్నైనా క్షణాలలో భస్మీపటలం చేయగలిగినంత శక్తివంతమైన మిస్సైల్స్‌ని క్యూబా రక్షణ కోసం సోవియట్ రష్యా క్యూబాలో ఏర్పాటు చేసింది. అణు యుద్ధపుటంచులకు మిస్సైల్స్ సంక్షోభం వెళ్లింది.13 రోజులు అమెరికా వణికిపోయింది.

రష్యాకు వ్యతిరేకంగా టర్కీలో ఎక్కుపెట్టిన మిస్సైల్స్‌ని తీసేసిన తర్వాత క్యూబాలోని మిస్సైల్స్‌ని రష్యా తీసివేసింది.సంక్షోభం సమసిపోయింది.

రష్యా సరిహద్దులలో వున్న దేశాలను నాటో సభ్యులుగా చేర్చుకుని రష్యాను చుట్టుముట్టి అంతం చేయాలనేది అమెరికా కోర్కె అని పుతిన్ అంటున్నాడు. 'మా మిస్సైల్స్‌ని అమెరికా సరిహద్దులలో ఏర్పాటు చేయలేదు. మేము బ్రిటన్, అమెరికా సరిహద్దులకు రాలేదు. మా ఇంటి పైన మిస్సైల్స్ ని ఎందుకు పెడ్తున్నార'ని పుతిన్ అడుగుతున్నాడు. 'అమెరికా సరిహద్దులో ఉన్న కెనడా లోనో మెక్సికో లోనో మా మిస్సైల్స్‌ని ఏర్పాటు చేస్తే మీరేం చేస్తార'ని కూడా పుతిన్ అడుగుతున్నాడు.

సంక్షోభాన్ని ఎవరు ప్రారంభించారని ప్రశ్నించాడు. '1990లో మేము ఒక్క అంగుళం కూడా తూర్పుకి రాము అని నాటో గారంటీ ఇచ్చింది. మేము అమెరికాతో స్నేహంగా ఉండడానికి ప్రయత్నించాం, మా న్యూక్లియర్ సైట్స్ అమెరికా సీఐఏ పరిశీలించటానికి అనుమతించాం. అయినా రష్యన్ ఫెడరేషన్‌ని విచ్ఛిన్నం చేశార'ని పుటిన్ అన్నారు.

**గ్యాస్ రాజకీయం**

యుక్రెయిన్-రష్యా వివాదంలో అతి కీలకమైనది గ్యాస్ పైపులైన్ సమస్య. రష్యాపై యూరోపియన్ యూనియన్ ఆంక్షలను విధించాలని అమెరికా నాటో ద్వారా ఒత్తిడి చేస్తోంది. రష్యా పై ఆంక్షలు విధిస్తే యూరోపియన్ యూనియన్‌కు గ్యాస్ సరఫరాలో అంతరాయం ఏర్పడితే మా పరిస్థితి ఏంటని యూరోపియన్ దేశాలు ఆందోళన చెందుతున్నాయి. రష్యాపై ఆంక్షలు విధిస్తే తనకే నష్టమని యూరోపియన్ దేశాలు భావిస్తున్నాయి. యూరప్ దేశాల గ్యాస్ దిగుమతుల్లో 40 శాతానికి పైగా రష్యా నుంచే ఉంది. రష్యా గ్యాస్‌కు యూరప్‌లో ఎలాంటి ప్రత్యామ్నాయం లేదు. అయితే యూరప్ ఆర్థిక ఆంక్షలు విధించిన పక్షంలో వాటిని ఎదుర్కొనేందుకు రష్యా ముందుగానే విదేశీ కరెన్సీ నిల్వలు పెంచుకుంది.

రష్యా నుంచి ఐరోపా దేశాలకు గ్యాస్, పెట్రోలు సరఫరా చేయాలంటే యుక్రెయిన్ భూభాగం మీదుగా వేసిన పైపులైన్‌లే ఆధారం. ఇందుకోసం యుక్రెయిన్‌కు రష్యా ఏటా మిలియన్ల డాలర్లు రాయల్టీగా కూడా చెల్లిస్తోంది.

అయితే యుక్రెయిన్ పాలకులు తరచూ ఈ పైపులైన్లను స్తంభింపజేస్తామని బెదిరిస్తుండడంతో రష్యా ప్రత్యామ్నాయం ఆలోచించింది. బాల్టిక్ సముద్రగర్భం గుండా నార్డ్ స్ట్రీమ్ 2 గాస్ పైప్ లైన్ నిర్మాణం చేపట్టింది. జర్మనీ వరకు పూర్తి చేసింది కూడా. ఫ్రాన్స్‌కు కూడా దీని ద్వారా ఇంధన సరఫరా చేస్తానని ప్రతిపాదించింది. యుక్రెయిన్‌ను తప్పించి యూరప్‌కు నేరుగా వేస్తున్న నార్డ్ స్ట్రీమ్ 2 గాస్ పైప్ లైన్ వేయడం పూర్తి కావస్తోంది. ఎలాగోలా తగాదా సృష్టించి కొత్త పైప్ లైను పూర్తి కాకుండా చూడాలని అమెరికా తహతహలాడుతోంది.

నాటో సైనిక కూటమిలో సభ్యదేశాలైన జర్మనీ, ఫ్రాన్స్‌లు యుద్ధానికి సిద్ధంగా లేవు. అమెరికా దూకుడు తమ ప్రయోజనాలకు విఘాతం కలిగిస్తుందని భావిస్తున్నాయి. యుద్ధాన్ని నివారించాలని చర్చలు జరుపుతున్నాయి. ఐరోపాలో రష్యాను తీవ్రంగా వ్యతిరేకించే జర్మనీ, సైనికులను పంపడానికి నిరాకరించింది. రష్యాతో గ్యాస్ సరఫరాపై ఒప్పందం కుదుర్చుకోవడానికి ఫ్రాన్స్, జర్మనీలు సుముఖంగా ఉండడంతో అమెరికాకు ఆందోళన మొదలైంది. ఇలా ఉండగా, యుక్రెయిన్‌కు గ్యాస్ రాయల్టీ రాకపోతే దాని ఆర్థిక పరిస్థితి దెబ్బ తింటుందని, అందుకే దీనిని తాము ఆక్రమించబోతున్నట్లు ప్రచారం చేస్తున్నాయని యుద్ధ విన్యాసాలను సమర సన్నాహాలుగా పేర్కొంటూ తమపై దాడి చేయాలని చూస్తున్నాయని పుతిన్ విమర్శిస్తున్నారు.

**బయట పడుతున్న నాటో బండారం**

2006లో సద్దాం హుస్సేన్‌ని ఉరి తీశారు. మానవ హనన రసాయన ఆయుధాల ఉన్నాయని పచ్చి అబద్ధాలు చెప్పి ఇరాక్ నాయకుడిని హత్య చేశారు. లిబియాలో నాటో జోక్యం చేసుకుని కల్నల్ గద్దాఫీ హత్య తప్పితే సాధించిందేమీ లేదు. 20 సంవత్సరాలు ఆఫ్ఘనిస్థాన్‌లో యుద్ధం చేసి బాంబు దాడులలో వేల మందిని హతమార్చినా గెలవలేక తిరిగి వచ్చింది. వియత్నాం, కొరియా, ఇరాక్, లిబియా, యుగోస్లేవియా, ఆఫ్ఘనిస్థాన్ యుద్ధాలలో చావు దెబ్బతిన్నా 200 సైనిక స్థావరాలను మూసేయలేదు. అధిపత్య ధోరణితో విశ్వవ్యాపితంగా తమ సైనిక కార్యకలాపాలను పెంచుకుంటున్నాయి. నాటో వలన ప్రభుత్వ ధనం ప్రవహించడం వలన ఖర్చు తప్ప ఉపయోగం లేదని ట్రంప్ అన్నాడు. నాటోకి బ్రెయిన్ డెడ్ అయి మెదడు పని చేయడం లేదని ఫ్రెంచ్ అధ్యక్షుడు మాక్రాన్ అన్నాడు. అమెరికా, ఆస్ట్రేలియా, బ్రిటన్‌లతో ఏర్పడిన ఆకస్‌పై ఫ్రాన్స్ అమెరికాపై మండిపడి తన రాయబారిని వెనక్కి పిలిచింది. నాటో అణ్వాయుధాలను నిల్వ చేయడానికి ఏ దేశమూ ముందుకు రావడం లేదు. అననుకూల పరిస్థితులలో జో బిడెన్ నాటోకు, పూర్వ వైభవాన్ని తేవాలని ప్రయత్నం చేస్తున్నాడు. యుక్రెయిన్‌లోనూ, ఆసియా పసిఫిక్ ప్రాంతాలలోనూ తగాదాలను పెట్టి యుద్ధ వాతావరణాన్ని సృష్టించి ఆయుధాలను అమ్ముకుంటూ తన నాయకత్వాన్ని కాపాడుకోవాలని అనుకుంటున్నాడు. నాటో విస్తరణను, యూరోపియన్ యూనియన్ విస్తరణను ఆపి రష్యా సరిహద్దులను కాపాడుకోవాలని పుతిన్ పావులు కదుపుతున్నాడు.

అమెరికాకు యుద్ధ వాతావరణం కావాలి కానీ యుద్ధం అవసరం లేదు. యుద్ధం చేయాలంటే కొరియా, వియత్నాం, ఆఫ్ఘనిస్థాన్‌లు గుర్తొస్తున్నాయి. తమ దేశ ప్రజలు యుద్ధంలోకి రారు. వేరెవరినైనా రెచ్చగొట్టి ఆయుధాలు, డబ్బులు ఇచ్చి యుద్ధాలు చేయించి ఆయుధాలను అమ్మి కార్పొరేట్ కంపెనీల మిలిటరీ ఇండస్ట్రియల్ కాంప్లెక్స్‌కు లాభాలను పంచుతూ ఉండాలి. ప్రభావిత ప్రాంతాలను కాపాడుకోవడమే ధ్యేయంగా అమెరికా అడుగులు వేస్తున్నది. వలసలు లేని వలసవాదాన్ని కొనసాగిస్తున్నాయి. నూతన ప్రపంచంలో కార్పొరేట్ కంపెనీల దోపిడీని రక్షించడమే ప్రభుత్వాల ప్రధాన కర్తవ్యమయింది. కార్పొరేట్ కంపెనీల వ్యాపార ప్రయోజనాలే రాజకీయాలను నడిపిస్తున్నాయి. ఫలితంగా ప్రజల ఆదాయాలు క్షీణిస్తూ ఉండగా కార్పొరేట్ కంపెనీల ఆదాయాలు అనూహ్య రీతిలో పెరిగి ఆర్థిక అసమానతలు తీవ్రమవుతున్నాయి. అంతర్జాతీయ సోషలిస్టు శక్తుల ఐక్యకార్యాచరణతో ఫైనాన్స్ పెట్టుబడిని నియంత్రించి యుద్ధోన్మాదుల ఆటలు కట్టించి ప్రపంచ శాంతిని నెలకొల్పవచ్చు.

*(రచయిత నల్లమడ రైతు సంఘం, గుంటూరు నాయకులు)* వీ

# యుక్రెయిన్-సామ్రాజ్యవాదుల మధ్య యుద్ధం - లెనిన్ వైఖరి

*యుక్రెయిన్‌లో యుద్ధాన్ని సామ్రాజ్యవాదుల మధ్య యుద్ధంగా అర్థం చేసుకోవడమే లెనినిస్టు వైఖరి అవుతుందని అంటున్నారు* **నికోస్ మొట్టాస్**

"చైతన్యవంతమైన కార్మికవర్గం సామ్రాజ్యవాద తోడేళ్ల గుంపులో ఏ ఒక్కదాన్నీ బలపరచదు" అని లెనిన్ వక్కాణించాడు. (లెనిన్ కలెక్టెడ్ వర్క్స్, వాల్యూమ్-27, పుట.335-336). సామ్రాజ్యవాదుల పట్ల శ్రామికవర్గ ఉద్యమ వైఖరికి సంబంధించి మరింత నిర్దిష్టంగా మాట్లాడుతూ ఆయన విలక్షణమైన ఈ క్రింది ఉదాహరణను పేర్కొన్నారు.

"ఆఫ్రికాలో మూడోవంతు భాగం ఒక దేశం అధీనంలోనూ, మిగిలిన ఒకవంతు భాగం మరొక దేశం అధీనంలోనూ ఉందని అనుకొందాం. ఆఫ్రికా పునర్విభజన గురించి ఆ రెండు దేశాల మధ్య యుద్ధం జరిగిందనుకోండి. ఆ రెండింటిలో ఏ పక్షానికి విజయం చేకూరాలని మనం కోరుకోవాలి? ఈ సమస్యను అది గతంలో తలెత్తినప్పుడు వివరించినట్లుగా ఇప్పుడు వివరించడం అసంబద్ధం. ఎందుకంటే దాన్ని అంచనా వేయడానికి మనవద్ద వున్న పాతపద్ధతులు ఇప్పటికి సరిపోవు. దశాబ్దాలుగా కొనసాగుతున్న బూర్జువా విముక్తి ఉద్యమంగాని, భూస్వామ్యం నాశనమయే దీర్ఘ కాలిక క్రమంగాని ఇప్పుడు లేవు. ఆఫ్రికాలో మూడోవంతు భాగంపై తనకున్న 'హక్కు'ను పటిష్టం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న మొదటి దేశానికిగానీ, లేదా ఆ మూడోవంతు భూభాగాన్ని దాని నుండి స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న రెండవ దేశానికిగానీ - ఇది మొదటి దేశంకన్నా ఆర్థికంగా వేగంగా అభివృద్ధి చెందుతున్నప్పటికీ - మద్దతు నివ్వడం వర్తమాన ప్రజాస్వామ్యం పనికాదు. ఈ రెండు సామ్రాజ్యవాద బూర్జువాలలో ఏదో ఒకదాని పక్షాన చేరకుండా వున్నప్పుడే, రెండు పక్షాలు ఒకే రకంగా చెడ్డవని అన్నప్పుడే, ప్రతి దేశంలోనూ సామ్రాజ్యవాద బూర్జువావర్గ ఓటమిని కోరుకున్నప్పుడే వర్తమాన ప్రజాస్వామ్యం నిజాయితీ కలిగిందై ఉంటుంది. ఇందుకు భిన్నమైన ఏ నిర్ణయాన్ని తీసుకున్నా అది ఆచరణలో జాతీయ ఉదారవాదమే అవుతుంది. సిసలైన అంతర్జాతీయతా వాదంతో దానికెలాంటి సారూప్యతా ఉండదు... అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాద బూర్జువావర్గం అభివృద్ధి చెందాక- దాని "రంగు ఛాయ" ఎలాంటిదైనప్పటికీ వర్తమాన ప్రజాస్వామ్యం దాన్ని అనుసరించి పోవడం అనే మాటే లేదు" (లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, వాల్యూమ్ - 21, పుట.135-157).

సామ్రాజ్యవాద యుద్ధం పట్ల శ్రామికవర్గం అనుసరించాల్సిన వైఖరికి సంబంధించిన లెనినిస్టు వారసత్వానికి అప్పుడూ ఇప్పుడూ కూడా ఎంతో ప్రాసంగికత ఉంది. ప్రత్యేకించి యుక్రెయిన్‌లో యుద్ధ నగారాలు మోగుతున్న సమకాలీన రోజుల్లో ఈ వారసత్వానికి మరింత ప్రాధాన్యత వుంది. యుద్ధం అంటే ఇతరేతర, హింసాపూరితమైన సైనిక పద్ధతుల ద్వారా రాజకీయాల కొనసాగింపేనని రుజువైంది. బూర్జువావర్గం, దానికి ఊడిగం చేస్తున్న ప్రభుత్వాల ప్రయోజనాల మధ్య తీవ్రమైన ఘర్షణే యుద్ధం.

"యుద్ధానికీ, ప్రభుత్వ, సంబంధిత వర్గాల విధానాలకు సంబంధంలేదనీ, యుద్ధమంటే కేవలం శాంతిని భగ్నం చేసే 'దాడి' అని, యుద్ధం తరవాత ఛిద్రమైన శాంతి మళ్లీ పునరుద్ధరించ బడుతుందని", యుద్ధం గురించి అమాయకులైన సగటు మానవుల భావనలను లెనిన్ నిరాకరించాడు, "ఒక యుద్ధం జరిగింది, వాళ్లలో వాళ్లు రాజీపడ్డారు!"-అని వాళ్లనుకుంటారు. "యుద్ధం అంటే ఇతర పద్ధతుల్లో ఒక విధాన కొనసాగింపు. యుద్ధాన్ని సృష్టించిన రాజకీయ వ్యవస్థల నుండి ఏ యుద్ధాన్నీ విడదీసి చూడకూడదు. ఒక రాజ్యం లేదా ఆ రాజ్యంలోని ఒక వర్గం, యుద్ధానికి ముందు సుదీర్ఘకాలం పాటు ఏ విధానాన్ని అవలంబించాయో - యుద్ధంలో కూడా దాన్నే అనుసరించడం తప్పనిసరి. దాని ఆచరణ రూపం మాత్రమే మారుతుంది" (లెనిన్ : "యుద్ధం-విప్లవం" కలెక్టెడ్ వర్క్స్ వాల్యూమ్ - 24, పుట. 398-421).

ఇదంతా మనమెందుకు ప్రస్తావించుకోవాలి? యూరో అట్లాంటిక్ శక్తులకూ (అమెరికా, నాటో, యూరోపియన్ యూనియన్) రష్యాకూ మధ్య, యుక్రెయిన్‌లో సామ్రాజ్యవాద దేశాల మధ్య వైరం వేగంగా తీవ్రతరమవుతున్న ఈ సందర్భంలో అనేకమైన తప్పుడు భావజాలాలు ముందుకు వస్తున్నాయి. శ్రామిక ప్రజలు ఏదో ఒకపక్షాన్ని బలపరచాలని పిలుపునిస్తున్నాయి. ఉదాహరణకి, నాటోలోనూ, యూరోపియన్ యూనియన్‌లోనూ సభ్యదేశమైన గ్రీస్‌లో - 'నియంతృత్వానికి', పుతిన్‌కి వ్యతిరేకంగా 'ప్రజాస్వామిక' యూరో అట్లాంటిక్ శక్తులకు మద్దతు నివ్వాల్సిన అవసరం గురించి బూర్జువా మీడియా పతాక శీర్షికలతో చేస్తున్న ప్రచారం ఎక్కువ ప్రభావాన్ని కలిగిస్తోంది. ఆ మీడియా ఒక పద్ధతి ప్రకారం రష్యా వ్యతిరేక ప్రచారాన్ని కొనసాగిస్తోంది. మరోవైపు, రష్యా అనుకూల మద్దతుదార్లు పుతిన్ పాలనలోని పెట్టుబడిదారీ రష్యా, "సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తి" అని, యూరో అట్లాంటిక్ మిత్రదేశాల 'కీవ్' ఫాసిస్టులకు వ్యతిరేకంగా

నిలబడ్డ, "ఫాసిస్టు వ్యతిరేక దుర్గమని" ప్రచారం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు.

ఏదో ఒక పక్షానికి మద్దతునివ్వమని కోరే ఈ రెండు అభిప్రాయాలూ తప్పుదోవపట్టిచ్చేవే! అంతకంటే ముఖ్యంగా అవి శ్రామిక వర్గానికీ, ప్రజలకూ ప్రమాదకరమైనవి. మరో మాటలో చెప్పాలంటే రెండు సామ్రాజ్యవాద దేశాలలో ఏది తక్కువ ప్రమాదకారో, దాన్ని ఎంచుకోమని వాళ్ల ప్రజలకు పిలుపునిస్తున్నారన్నమాట. అంటే మంచి సామ్రాజ్యవాదం, చెడ్డ సామ్రాజ్యవాదం అని ఉంటాయా? ఏదో ఒక సామ్రాజ్యవాదం పతాకం కింద బలవంతంగా చేరాల్సిన అవసరం శ్రామిక వర్గానికి ఏముంటుంది?

పెట్టుబడిదారీ విధానంలోని అసమ అభివృద్ధి, గత రెండు దశాబ్దాలలో చైనా, రష్యా వంటి నూతన ప్రపంచ ఆర్థికశక్తుల ఆవిర్భావానికి, అవి వేగంగా శక్తివంతం కావడానికి దారి తీసిందనే వాస్తవాన్ని మనం తప్పనిసరిగా అర్థం చేసుకోవాలి. ఈ శక్తులు అంతర్జాతీయ మార్కెట్‌లో తమ వాటా పెరగడాన్ని హక్కుగా కోరుకుంటున్నాయి. ఇవి ఆర్థికంగా ఎదుగుదల చెందిన కారణంగా వాటి రాజకీయ, సైనికశక్తి కూడా అభివృద్ధిచెందక తప్పలేదు. ఇది సామ్రాజ్యవాద చదరంగం బల్లపై పావుల స్థానాలను మార్చడానికి దారితీసింది. అంతేగాక, ఇప్పటివరకు అప్రతిహతంగా ఆధిక్యతలోవున్న అమెరికా, యూరోపియన్ యూనియన్ వంటి శక్తులతో పోటీ తీవ్రతరతమైంది కూడా. ఈ తీవ్రతరమైన సామ్రాజ్యవాద పోటీ వ్యక్తీకరణనే నేడు యుక్రెయిన్‌లో, తూర్పు యూరప్‌లో చూస్తున్నాం.

యుక్రెయిన్‌లోనూ, తూర్పు యూరోప్ విశాలప్రాంతంలోనూ, యుద్ధోన్మాద యూరో-అట్లాంటిక్ శక్తులైన అమెరికా, నాటో, యూరోపియన్ యూనియన్లకు భయం కలిగించే శత్రువు పెట్టుబడిదారీ రష్యా. అది (వెనకటి) సోవియట్ యూనియన్ కాదని, దానికి పూర్తిగా భిన్నమైన సాంఘిక ఆర్థిక వ్యవస్థలు కలిగిన దేశమని మనం సదా గుర్తుంచుకోవాలి. రష్యా, సామ్రాజ్యవాద శక్తికాదని, అది కేవలం సామ్రాజ్యవాద వ్యవస్థ "అంచులలో" ఉన్న ఒక పెట్టుబడిదారీ దేశం మాత్రమేనని, "సోషలిస్టు చైనా"తో కలిసి అది అంతర్జాతీయ రాజకీయాలలో ప్రజానుకూల ప్రభావాన్ని వేస్తున్నదని భావించడం పూర్తిగా తప్పు. ఇలాంటి వైఖరి సామ్రాజ్యవాదం గురించిన లెనినిస్టు భావనకు పూర్తిగా భిన్నమైనది. రాజకీయాలను ఆర్థికాంశాల నుండి విడదీసి చూస్తున్నంత కాలం ఇలాంటి తప్పుడు దృక్పథాలే ఏర్పడతాయి.

అదే విధంగా ఫాసిస్టు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక, అభ్యుదయకర లక్షణాలు కల సోవియట్ యూనియనే నేటి పెట్టుబడిదారీ రష్యా అని మనం భావించడానికి అవసరమయిన "ముసుగులు" వెయ్యడానికి ప్రయత్నిస్తున్నవాళ్లు - కార్మికోద్యమాన్ని పక్కదోవలు పట్టించడానికి, కుటిల ఎత్తుగడలతో తమకనుకూలంగా మార్చుకోవడానికి-ప్రత్యేకించి సామ్రాజ్యవాద దేశాల మధ్య పోటీ తీవ్రమవుతున్న దశలో ఉపయోగపడతారు.

అధ్యక్షుడు పుతిన్ ఇరవై ఒకటవ శతాబ్దపు స్టాలిన్ లాంటివాడని, ఆయన ఝుకోవ్ లాంటి షోగ్యూ, మాలటోవ్ లాంటి లావ్రోవ్‌లతో కలిసి ఆధునిక నాజీల నుండి మానవ సమాజాన్ని కాపాడడానికి ప్రయత్నిస్తున్నాడని మనలను నమ్మించడానికి తప్ప ఇది ఎందుకూ పనికిరాదు.

సామ్రాజ్యవాద యుగంలో పెట్టుబడిదారీ దేశాలు శాంతియుతంగా ఉండే అవకాశంలేదని మనం తప్పక గుర్తించాలి. యుద్ధం ప్రారంభమైన సమయంలో దాడి చేసిన, దాడిని ఎదుర్కొంటున్న బూర్జువా రాజ్యాల మధ్య వ్యత్యాసం బహుశా సాపేక్షికం మాత్రమే. ఏ యుద్ధంలోనైనా ప్రధానమైన ప్రశ్న ఒక్కటే; ఏ వర్గం ఎందుకోసం, ఏ చారిత్రక అభివృద్ధి దశలో యుద్ధం చేస్తోందన్నదే.

'సోషలిజం, యుద్ధం' - అనే పుస్తకంలో లెనిన్ ఇలా రాశారు:

"ఒక దృశ్యాన్ని మీరు ఊహించుకోండి, వందమంది బానిసలను కలిగిన ఒక బానిస యజమాని, రెండు వందల మంది బానిసలు కలిగిన మరొక యజమానితో, బానిసల పంపిణీ 'న్యాయ'బద్ధంగా వుండటం కోసం యుద్ధం చేస్తున్నాడు. అలాంటి పరిస్థితుల్లో 'ఆత్మరక్షణ' యుద్ధం అనే మాటనుగానీ- లేదా 'పితృదేశ రక్షణకోసం' యుద్ధం అనే పదాన్ని వాడటం చారిత్రకంగా తప్పు. ఇలా మాట్లాడటం అంటే జిత్తులమారి బానిస యజమానులు సాధారణ ప్రజల్ని, అమాయకుల్ని, అజ్ఞానులను ఆచరణలో మోసం చెయ్యడం తప్ప మరొకటి కాదు. వర్తమానంలో సామ్రాజ్యవాద బూర్జువా వర్గం కూడా కచ్చితంగా ఇదే పద్ధతిలో "జాతీయ భావజాలం" అనే పదాన్ని ఉపయోగిస్తూ ప్రజల్ని మోసం చేస్తోంది. బానిసత్వాన్ని శక్తివంతమూ, దుర్భేధ్యమూ చెయ్యడంకోసం బానిస యజమానుల మధ్య జరిగే యుద్ధం లాంటిదే పితృదేశ రక్షణ కోసం ప్రస్తుత యుద్ధం అనడం కూడా" (లెనిన్ : "సోషలిజం-యుద్ధం" చాప్టర్ - 1). యుక్రెయిన్‌లో అమెరికా, నాటో, యూరోపియన్ యూనియన్ కూటమికీ - రష్యాకూ మధ్య నేడు జరుగుతున్న అంతర్ సామ్రాజ్యవాద ఘర్షణలను మనం అర్థం చేసుకోవడానికి పై ఉదాహరణ సరిపోతుంది.

కమ్యూనిస్టు, కార్మిక ఉద్యమాలు అమెరికా, నాటో, యూరోపియన్ యూనియన్‌లతో కూడిన యూరో అట్లాంటిక్ శక్తుల నేరపూరిత సామ్రాజ్యవాద పథకాలకు వ్యతిరేకంగా, దృఢ నిశ్చయంతో నిరంతరాయంగా ఐక్య సంఘటనగా ఏర్పడి పనిచేయాలి. అంతేకాదు, అదే సమయంలో ఆ ఐక్య సంఘటన రష్యాలాంటి మరి ఏ ఇతర పెట్టుబడిదారీ రాజ్యం పక్షానగానీ, లేదా చైనా - రష్యాల కూటమి లాంటి సామ్రాజ్యవాద కూటమికిగానీ మద్దతునివ్వరాదు. అలాంటి మద్దతు నివ్వడమంటే, కమ్యూనిస్టు, కార్మిక ఉద్యమాలు తమ

# మార్క్స్ - లెనిన్ - కొనసాగింపు

**యు. ఎ. ఖారిన్** *రచించిన 'ఫండమెంటల్స్ ఆఫ్ డయలెక్టిక్స్' పుస్తకం లోని రెండవ అధ్యాయం లో అయిదవ ఉపశీర్షిక : అనువాదం - రాజేంద్ర బాబు అర్విణి*

బహిరంగంగా తాను ఎవరి పక్షపాతియో చెప్పడంలో, తనపట్ల కూడా తానే క్లిష్ట వైఖరి ప్రదర్శించడంలో గతితార్కిక భౌతిక వాదం అంతకు ముందు ఉండిన తత్వశాస్త్ర సంప్రదాయాలకు, ఆధునిక బూర్జువా సిద్ధాంతాలకు, రివిజనిస్ట్ ఉపదేశాలకు భిన్నమయినది. మార్క్సిస్టు తత్వశాస్త్రం గతిశీలమయినది, సృజనాత్మకమయినది. సామాజిక ఆచరణ, నూతన శాస్త్రీయ ఆవిష్కరణలు ఆధారంగా అది ఎప్పుడూ అభివృద్ధి చెందుతూ ఉంటుంది. మార్క్స్, ఎంగెల్స్‌లు తాము బోధించిన విషయాలను ఒక నమ్మకంగా గాకుండా సామాజిక కార్యాచరణకు మార్గదర్శకంగా భావించమన్నారు. వారు తమ జీవితపర్యంతం గతితార్కిక, చారిత్రిక భౌతికవాద సిద్ధాంతం గురించే తీవ్రంగా అధ్యయనాలు జరిపారు, అవిరళ కృషి చేశారు.

మార్క్సిస్టు సిద్ధాంతం అభివృద్ధి చెందుతున్న క్రమంలో లెనిన్‌తో సరికొత్త అధ్యాయం ప్రారంభమయ్యిందని చెప్పవచ్చు. అవకాశవాదుల వక్రీకరణలకు వ్యతిరేకంగా, బూర్జువా సిద్ధాంతకర్తల తిరోగమనవాద దాడులకు వ్యతిరేకంగా లెనిన్ మార్క్సిజాన్ని సమర్ధవంతంగా నిలబెట్టాడు. అదే సమయంలో, సామ్రాజ్యవాద శకం ఆరంభమయిన నేపథ్యంలో ఏర్పడిన చారిత్రిక పరిస్థితులను విశ్లేషించి, ఆధునిక సామాన్య శాస్త్రాలు సాధించిన విజయాలను శ్రామిక వర్గ విప్లవానికి సమకూరిన అనుభవాలతో అన్వయించి సోషలిస్టు సమాజ నిర్మాణంలో ప్రధాన పాత్ర వహించి మార్క్సిస్టు తత్వశాస్త్ర బోధనలను సృజనాత్మక రీతిలో అభివృద్ధి పరిచాడు. లెనిన్ రాసిన ప్రఖ్యాత సిద్ధాంత గ్రంథాలలో కొన్ని: "వాట్ ద 'ఫ్రెండ్స్ ఆఫ్ ద పీపుల్' ఆర్ అండ్ హౌ దే ఫైట్ ద సోషల్ డెమొక్రాట్స్" (1894), వాట్ ఈస్ టు బి డన్? (1902), మెటీరియలిజం అండ్ ఎంపిరియో క్రిటిసిజం (1908), ఫిలసాఫికల్ నోట్ బుక్స్ టతత్వశాస్త్రానికి సంబంధించి గుర్తుంచుకోవాల్సిన అంశాలుఊ (1914–1915), ఇంపీరియలిజం, ద హైయెస్ట్ స్టేజ్ ఆఫ్ కాపిటలిజం (1916), ద రైట్స్ ఆఫ్ నేషన్స్ టు సెల్ఫ్ డిటర్మినేషన్ (1914), ద స్టేట్ అండ్ రెవల్యూషన్ (1917), ఆన్ ద సిగ్నిఫికెన్స్ ఆఫ్ మిలిటెంట్ మెటీరియలిజం (1922). లెనిన్ తన తత్వశాస్త్ర అధ్యయన విశ్లేషణను విప్లవాత్మక శ్రామిక వర్గ ఉద్యమానికి అనుబంధం చేసాడు. ఆయన రాజకీయ కార్యాచరణ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర, అంతర్జాతీయ శ్రామికవర్గ ఉద్యమం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాలతో ఆయన అభివృద్ధి చేసిన గతితార్కిక చారిత్రిక భౌతిక వాదం సజీవ సంబంధం కలిగి ఉండింది.

---

ప్రయోజనాలకు సంబంధంలేని జండాలను మోయుడమే! సామ్రాజ్యవాదం శక్తివంతమయినదైనా లేక బలహీనమైనదైనా, అది అమెరికన్, రష్యన్, యూరోపియన్, చైనీస్ సామ్రాజ్యవాదాలలో ఏదైనప్పటికీ వాటి ప్రయోజనాల కోసం కార్మికవర్గం రక్తం ధారపోయనవసరం లేదు.

ఇందుకు భిన్నంగా గ్రీస్‌లోగానీ, ఇంకే దేశంలోనైనాగానీ, కార్మిక–ప్రజా ఉద్యమాలు స్వతంత్రమైన పంథాను ఎంచుకోవాలి. బూర్జువాల, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలతో తెగతెంపులు చేసుకుని, వాటితో పోరాడాలి. శ్రామికవర్గ, ప్రజా బాహుళ్యాల ప్రయోజనాలు మాత్రమే దాని దృష్టిలో వుండాలి. సామ్రాజ్యవాదయుగంలో న్యాయబద్ధమైన యుద్ధం అంటే, శ్రామికవర్గం, దాని మిత్రవర్గాలు అధికారాన్ని స్వాధీనం చేసుకోవడం కోసం జరిపే వర్గ విప్లవ యుద్ధం మాత్రమే.

లెనిన్ భావనలకు వర్తమానంలో ఎప్పటికంటే ఎక్కువ ప్రాసంగికత ఉంది. "శ్రామికవర్గ, కమ్యూనిస్టు విప్లవం ఒక్కటే మానవాళిని సామ్రాజ్యవాదం, సామ్రాజ్యవాద యుద్ధాలు సృష్టించిన ప్రతిష్టంభన నుండి బయటకు తీసుకురాగలదు. విప్లవం ఎలాంటి కష్టాలను ఎదుర్కోవాల్సి వచ్చినా లేక ప్రతీఘాతుక విప్లవ కెరటాలు తాత్కాలికంగా విజయాలు పొందినా, శ్రామికవర్గం తుది విజయాన్ని సాధించడం తప్పని సరి" (రష్యన్ కమ్యూనిస్ట్ పార్టీ 1919 మార్చి 22న ఎనిమిద కాంగ్రెస్‌లో ఆమోదించిన రాజకీయ తీర్మానం).

....

ఝకోవ్ : సోవియట్ యూనియన్‌లో రక్షణ మంత్రి

మాలటోవ్ : 1930–41 మధ్య కాలంలో సోవియట్ యూనియన్ విదేశాంగ మంత్రి

షోగ్యో : పుతిన్ ప్రభుత్వంలో రక్షణశాఖ మంత్రి

లావ్రోవ్ : పుతిన్ ప్రభుత్వంలో విదేశాంగ మంత్రి

*(రచయిత గ్రీస్‌కు చెందిన In Defense of Communism పత్రిక ప్రధాన సంపాదకుడు)*

*(అనువాదం : సి.యస్.ఆర్. ప్రసాద్)*

వీ

మార్క్స్, లెనిన్ ఇద్దరు చెప్పింది వేరువేరు అని ఎవరయినా అనుకుంటే అది పూర్తిగా తప్పని ఖండించాల్సి ఉంటుంది. కొంతమంది అభిప్రాయంలో మార్క్స్ తత్వవేత్త, ఒక సిద్ధాంత కర్త అయితే లెనిన్ క్లిష్టమయిన తత్వశాస్త్ర సమస్యల గురించి పెద్దగా పట్టించుకోకుండా చేయాల్సిన పనికి ప్రాముఖ్యత నిచ్చిన వ్యవహారకర్త. లెనిన్ చరిత్రలో ఒక క్రమపద్ధతిలో జరిగే వాస్తవాలను గుర్తించ నిరాకరించి పూర్తిగా బలప్రయోగం మీద ఆధారపడితే మార్క్స్ తాను గుర్తించిన వస్తుగతమయిన ఆర్థిక అవసరాల పైనే ఎక్కువ ఆధారపడ్డాడని, ఆయనొక మానవతావాది అని కూడా లెనిన్ గురించి కొంతమంది కొన్ని ఆరోపణలు చేశారు. మరి కొంత మంది లెనినిజం అంటే మరేమీ కాదు అది 'రష్యా మార్క్సిజం' మాత్రమే అని, కాబట్టి అది ఇతర దేశాలకు ముఖ్యంగా భారతదేశానికి వర్తించే వీలు లేదని వాదన కూడా చేశారు. చైనా, యుగోస్లావియా తదితర దేశాల 'జాతీయ మార్క్సిజం'లు కూడా ఉన్నాయని ఊహాగానాలు కొన్ని ఉన్నాయి.

ఈ రకంగా లెనిన్ గురించి చేసే వ్యాఖ్యలన్నీ లోపభూయిష్టమైనవి, అసలు విషయాన్ని తప్పుదోవ పట్టించే దురుద్దేశంతో కూడినవి. లెనిన్ కచ్చితంగా తత్వశాస్త్ర సమస్యల గురించి ఆలోచించకుండా వ్యవహార జ్ఞానం మాత్రమే కలిగిన మామూలు లౌకికుడు మాత్రం కాదు. సరి అయిన సిద్ధాంత బలం లేకుండా ఏ విప్లవ పోరాటం విజయవంతం కాలేదు. లెనిన్ మార్క్సిస్టు సిద్ధాంతంలోని అన్ని విడి భాగాలను సృజనాత్మకంగా అభివృద్ధి పరచాడు. ఆయన అన్ని సమకాలీన సిద్ధాంత సమస్యల గురించి లోతైన విశ్లేషణ అందించాడు. ఆయన గతితార్కిక భౌతిక వాదాన్ని అన్ని కోణాలనుండి పరిశీలించి సమగ్రమయిన అవగాహనను కలిపించాడు. ఆయన 'పదార్థం' అంటే ఏమిటో శాస్త్రీయమయిన నిర్వచనం ఇచ్చాడు. చలనము, పదార్థము రెండూ విడివిడిగా లేవు అన్న సిద్ధాంతానికి ఎన్నో వివరణలు ఇచ్చాడు. వాస్తవాన్ని అనుభవం ద్వారా గ్రహించి జ్ఞానాన్ని పొందే సూత్రాలను వివరించాడు. ప్రకృతి విజ్ఞాన శాస్త్రాలకు, తత్వశాస్త్రానికి మధ్య విడదీయడానికి వీలు లేని సంబంధం ఉంటుందన్న భావనకు ఆయన ఇచ్చిన సమర్థన చాలా విలువ కలది. సమకాలీన ప్రకృతి శాస్త్రాలు సాధించిన విజయాలతో సైన్స్ రంగంలో గొప్ప శక్తివంతమయిన విప్లవాలు సంభవించనున్నాయని గ్రహించిన 20వ శతాబ్దపు మొట్టమొదటి ఆలోచనాపరుడు లెనిన్. గొప్ప ప్రకృతి శాస్త్రవేత్తల ప్రాథమిక ఆవిష్కరణలలో ఇమిడిఉన్న విప్లవ అంశాలను విప్పి చెప్పి వాటిని తత్వశాస్త్రానికి అన్వయించినవాడు లెనిన్. పదార్థం అపరిమితమయినదని, ఎన్నటికీ తరిగిపోదని చెప్పిన ఆయన సూత్రీకరణ ఆ తర్వాతి కాలంలో ఆధునిక శాస్త్రంలో సాధారణ సూత్రం అయిపోయింది.

మార్క్సిస్టు గతితర్కం, చారిత్రిక భౌతిక వాదా లను ఇంకా అభివృద్ధి పరచడంపై లెనిన్ ప్రత్యేక శ్రద్ధ వహించాడు. సామాజిక అభివృద్ధిలోని చలన గతి సూత్రాలు, ఆర్థిక విషయాలకు రాజకీయాలకు మధ్య ఉన్న పరస్పర సంబంధం, సమాజ పరమయిన మనిషికి, సామాజిక చైతన్యానికి మధ్య ఉండే సంబంధం – వీటిని గూర్చి ఆయన సమగ్రంగా అధ్యయనం చేసాడు. సరికొత్త చారిత్రిక యుగంలో పెట్టుబడిదారి వ్యవస్థలో నూతనంగా వస్తున్న ప్రక్రియలను లెనిన్ మార్క్సిస్టు కోణంలో విశ్లేషించి, సామ్రాజ్యవాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఆ సిద్ధాంతమే ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టుల, శ్రామికుల పార్టీలు వ్యూహ రీత్యా, ఎత్తుగడల రీత్యా అనుసరించదగ్గ శాస్త్రీయమయిన పంథాగా ఉపయోగపడింది. సామ్రాజ్యవాదం కృశించిపోతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ అని, అది చివరి దశలో పరాన్నజీవిగా మారి సోషలిస్టు విప్లవానికి దారులు పరుస్తుందని లెనిన్ సోదాహరణంగా వివరించాడు.

మార్క్స్ లాగే లెనిన్ కూడా సామాజిక ఘటనలు సూత్రబద్ధంగా జరుగుతాయని, పెట్టుబడిదారీ వ్యవస్థ విప్లవాత్మక పరిణామాల వలన మార్పు చెందడం సామాజిక అవసరం అని బోధించాడు. చారిత్రిక కార్యాచరణలో సామాన్య ప్రజానీకం పాత్ర నిర్ణయాత్మకంగా ఉంటున్న మార్క్స్ సిద్ధాంతాన్ని లెనిన్ అభివృద్ధి పరచాడు. సామాజిక అభివృద్ధి, మానవతా వాదం గురించి మార్క్స్ అభిప్రాయాలు లెనిన్ ఆలోచనలు వేరు వేరని వాదించడం పూర్తిగా నిరాధారమయినది. ఈ విషయంలో, ఇంకా తదితర విషయాలలో కూడా వారిద్దరూ ఒకే రకంగా ఆలోచించారు. అందులో కొన్ని: నిజమయిన మానవతావాదం అమలులోకి రావాలంటే చారిత్రిక అవసరమయిన సోషలిస్టు విప్లవం ద్వారా తప్ప మరో మార్గం లేదు. నిజమయిన మానవతా వాదం లక్ష్యం అందరికీ స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం. శ్రమ, శాంతి, సంతోషం అనే భావనలు అందమయిన భావాలుగా మిగిలి పోకుండా అవి వాస్తవాలు కావాలి. అది జరగాలంటే అనివార్యమయిన షరతు కమ్యూనిస్టు సమాజాన్ని తయారు చెయ్యడమే.

పెట్టుబడిదారి వ్యవస్థ స్థానంలో సోషలిస్టు వ్యవస్థను నెలకొల్పడానికి అనువయిన పరిస్థితులు పరిపక్వం కాని దశలో విప్లవ కార్యక్రమాన్ని వేగవంతం చెయ్యడానికి తన వ్యక్తిగత అనుభవాల నేపథ్యంలో నూతన అవకాశాలకోసం వెతికి వాటిని సాధించిన వాడు లెనిన్. లెనిన్ అధినాయకుడుగా బోల్షివిక్ పార్టీ రష్యా దేశ ప్రజలకు నాయకత్వం వహించి 1917లో మహోన్నతమయిన అక్టోబర్ విప్లవాన్ని విజయ తీరాలకు చేర్చింది. విప్లవాత్మక మార్పులో శాస్త్రీయ మార్క్సిస్టు లెనినిస్ట్ సిద్ధాంతం పాత్ర, అది విప్లవ కార్యాచరణలో భాగం అయ్యిందన్న వాస్తవానికి రష్యన్ విప్లవ విజయం ఒక రూఢి అయిన ఉదాహరణ. అయితే, చారిత్రిక అనుభవాలు, ప్రపంచంలో నేడు జరుగుతున్న సామాజిక పరిణామాలు లెనినిజం రష్యాకే పరిమితమయినదన్న వాదన తప్పని రుజువు పరుస్తున్నాయి.

ప్రపంచ సోషలిస్టు విప్లవానికి మార్గదర్శక సిద్ధాంత ప్రాతిపదిక ఏర్పాటు చేయడంలో లెనిన్ తీవ్రంగా కృషి సల్పాడు. సోషలిస్టు విప్లవం విజయవంతం కావడానికి, అన్ని దేశాలలో సోషలిస్టు సమాజం ఏర్పడడానికి అవసరమయిన సాధారణ నియమాలకు నిర్దిష్ట రూపం ఇవ్వడంలో లెనిన్ పాత్ర గొప్పది. అదే సమయంలో సోషలిస్టు సమాజం సుసంఘటితం కావడానికి నిర్దిష్టమయిన కార్యక్రమాలు ఎలా

అవసరమో అదే రీతిలో సోషలిస్టు విప్లవానికీ వివిధ రూపాలు అవసరమని, శ్రామికవర్గ విప్లవాత్మక చర్యలు వివిధ మార్గాల ద్వారా బహిర్గతమవడం సాధ్యమని, అనివార్యమని కూడా తెలియజెప్పాడు. "వివిధ దేశాలలో నెలకొని ఉన్న ప్రత్యేక పరిస్థితులకు అనుగుణంగా ప్రాథమిక విప్లవ పోరాట సూత్రాలకు ఉపయుక్తమయిన మార్గాలను అన్వేషించాల"ని లెనిన్ బోధించాడు.

వివిధ దేశాలకు సంబంధించిన విముక్తి పోరాటాలు ఆయా దేశాల సామాన్య ప్రజల క్రియాశీలక భాగస్వామ్యం ద్వారానే విజయవంత మవుతాయని, అన్నింటికీ మించి సామాజిక కార్యకలాపాల నిర్వహణలో పెరుగుతున్న శ్రామిక వర్గం అధిక భాగస్వామ్యం వహించడం వలననే ఆయా విప్లవాలు విజయం సాధిస్తాయని, రైతాంగంతో కార్మిక వర్గం ఐక్యత గురించి, విశాల ప్రజాస్వామ్య వ్యవస్థ పెరుగుదల అవసరం గురించి, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అంతర్జాతీయ శ్రామికవర్గ ఉద్యమం గురించి లెనిన్ చేసిన ప్రతిపాదనలు అభివృద్ధి చెందుతున్న దేశాలకు అత్యంత ప్రాముఖ్యత గలిగినవి.

కాబట్టి మార్క్సిజానికి నిజమయిన, స్థిరమయిన, సృజనాత్మకతతో కూడిన అభివృద్ధి దశ కేవలం లెనినిజమే. మార్క్సిజానికి ఎన్నో వివరణలు ఉన్నాయి, అన్నింటికంటే ఉత్కృష్టమయినది లెనినిజం. జవహర్ లాల్ నెహ్రూ 'గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ' పుస్తకంలో రాసినట్టు ''మార్క్సిజం ను వివరణాత్మకంగా ప్రపంచానికి తెలియచెప్పిన వాళ్లలో ప్రముఖుడు లెనిన్. మార్క్సిజాన్ని వివరించడం విశదపరచడం మాత్రమే కాదు, లెనిన్ ఒక గొప్ప మార్క్సిస్టుగా జీవించాడు కూడా. అయినప్పటికీ, మార్క్సిజం మూఢనమ్మకంగా మారకూడదు. మార్క్సిజంలో వైవిధ్యం ఉండదని అనుకోవడం తప్పు." మరొక చోట నెహ్రూ ఇలా అంటాడు: "ఈ సిద్ధాంతాలను గురించి తెలుసుకోవడం చాలా అవసరం. ఎందుచేతనంటే ప్రపంచవ్యాప్తంగా నేడు ఈ సిద్ధాంతాలు అధిక సంఖ్యలో మనుషులను ప్రభావితం చేస్తున్నాయి. మనదేశంలో కూడా ఇవి మనకు ఉపయోగపడవచ్చు" (తన కుమార్తె ఇందిరాగాంధీకి వ్రాసిన లేఖలలో జవహర్ లాల్ నెహ్రూ).

మార్క్స్, ఎంగెల్స్‌లు గతితార్కిక, చారిత్రిక భౌతికవాదాన్ని మొట్టమొదటి సారిగా ప్రతిపాదించారు. ఆ తర్వాత లెనిన్ దానిని అభివృద్ధి పరచాడు. ఈ మార్క్సిస్టు-లెనినిస్ట్ తత్వం సజీవమైన, సృజనాత్మకమైన బోధన. ఇది సతతం సరికొత్త ముక్తాయింపులతో, సిద్ధాంత క్రమబద్ధీకరణలతో ఉన్నతీకరించబడుతున్నది.

కమ్యూనిస్ట్/సోషలిస్టు వ్యవస్థలను ఏర్పాటు చెయ్యడం, ప్రపంచ విప్లవ క్రమాన్ని వృద్ధి పరచడం, జాతీయ విముక్తి పోరాటాలను సర్వవ్యాప్తం చెయ్యడం, భావ సంఘర్షణను తీవ్రతరం చెయ్యడం లాంటివి సజావుగా జరగాలంటే మార్క్సిస్టు-లెనినిస్ట్ సిద్ధాంతం ఇంకా అభివృద్ధి చెందాలి. భావ ఐక్యత కలిగిన కమ్యూనిస్ట్‌ల, కార్మికుల పార్టీల సంయక్త కృషి వలన, వివిధ దేశాల మార్క్సిస్టు మేధావుల అధ్యయనాల ఫలితంగా గతితార్కిక భౌతిక వాద బోధనలలో మరింత లోతైన సిద్ధాంతాలు ఆవిష్కరించబడ్డాయి. సోషలిస్టు విప్లవ పంథాలో, సోషలిస్టు సమాజ నిర్మాణంలో అనుసరించాల్సిన సాధారణ నియమాలు, ఆధునిక యుగంలో ప్రధాన వైరుధ్యాలు, పరిణత దశకు చేరిన సోషలిజం రూపం-సారం, కమ్యూనిస్ట్ సమాజ నిర్మాణం, ప్రజాస్వామ్యం కోసం సోషలిజం కోసం జరిగే పోరాటంలో గతితార్కిక అంశాలు మున్నగువాటి గురించి ప్రత్యేకంగా ఈ అధ్యయనాలు విశేషంగా జరిగాయి.

ప్రస్తుత శాస్త్ర, సాంకేతిక విప్లవంలో వేగవంతంగా అభివృద్ధి పొందుతున్న ప్రకృతి శాస్త్రాల అధ్యయనానికి సంబంధించి మార్క్సిస్టు-లెనినిస్ట్ సిద్ధాంతం ఆలోచనా స్ఫోరకమయిన ప్రతిపాదనలు చేసింది. అణుభౌతిక శాస్త్రంలో, సైబర్నెటిక్స్ (మానవ నాడీ వ్యవస్థ జ్ఞానంలో కంప్యూటర్ పద్ధతులు)లో, జీవశాస్త్రంలో, ఇంకా ఇతర సైన్స్ విషయాలలోని ఆవిష్కరణలను గతితార్కిక భౌతికవాద వెలుగులో విశదీకరించింది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్ట్ పార్టీ 26వ కాంగ్రెస్ (23 ఫిబ్రవరి 1981)కు లియోనిద్ బ్రెజ్నెవ్ సమర్పించిన నివేదికలో మార్క్సిస్టు-లెనినిస్ట్ సిద్ధాంతంలో సృజనాత్మక చేరికల ప్రాముఖ్యత గురించి, జీవన గమనంలో వస్తున్న మార్పుల గురించి, మార్క్సిస్టు-లెనినిస్ట్ పార్టీ తన చారిత్రిక పాత్ర నిర్వహించడానికి ప్రపంచంలో సంభవిస్తున్న ప్రతి మార్పును అవగాహన చేసుకోవాల్సిన అవసరం గురించి ప్రత్యేకంగా ప్రస్తావించారు. "ముఖ్యమయిన విషయం ఏమిటంటే, మార్క్సిస్టు-లెనినిస్ట్ సిద్ధాంతం అనే ఆయుధం చేతబూనిన కమ్యూనిస్టులు ప్రపంచ గమనాన్ని, ప్రపంచంలో సంభవిస్తున్న పరిణామాలను, వాటి సారాన్ని మరెవరి కన్నా గాఢంగా, చాలా సరిగ్గా కూడా, అర్థం చేసుకొని కార్మిక వర్గ ప్రయోజనాలకోసం, వారి వారి దేశాలలోని శ్రామికుల హితం కోసం, ప్రజాస్వామ్యం కోసం, ప్రపంచ శాంతి కోసం, సోషలిజం కోసం వాటి నుండి సరి అయిన మార్గదర్శకాలను ఎన్నుకోగలరు'' అని ఆయన ఆ నివేదికలో ఉటంకించారు.

మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతం సృజనాత్మకంగా వృద్ధి చెందడానికి సోవియెట్ యూనియన్ కమ్యూనిస్ట్ పార్టీ 26 వ కాంగ్రెస్ గణనీయమయిన తోడ్పాటునందించింది. సామాజిక అభ్యుదయంలో ఆధునిక పోకడల గురించి ప్రధానంగా విశ్లేషించింది. జ్వలిస్తున్న ముఖ్యమైన వర్తమాన అంతర్జాతీయ పరిణామాలను దృష్టిలో ఉంచుకొని సోవియట్ శాంతి సందేశాన్ని రూపొందించింది. అభివృద్ధి పథంలో ఉన్న సోషలిస్టు సమాజానికి అవసరమైన ఆర్థిక, సామాజిక-రాజకీయ, సాంస్కృతిక ముందంజకై మార్గదర్శకాలు సూచించింది.

సామాజిక, శాస్త్ర రంగాలలో సాధించిన అభివృద్ధికి చెందిన ప్రతి దశలో మనుష్య జాతికి క్రొత్త క్రొత్త సమస్యలు ఎదురవుతాయి. అయితే వాటిని సరి అయిన రీతిలో పరిష్కరించగలిగేది ఒక్క ఆధునిక శాస్త్రీయ తత్వశాస్త్రం దృక్కోణంలో మాత్రమే. మార్క్సిజం-లెనినిజం ఆ రకమైన ఆధునిక శాస్త్రీయ తత్వశాస్త్రం. వీ

## ఆంధ్రప్రదేశ్‌లో పిఆర్‌సిని వ్యతిరేకిస్తూ ఉద్యోగుల నిరసన

ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యోగ, ఉపాధ్యాయులు ఆందోళనకు దిగారు. వైఎస్‌ఆర్ సిపి ప్రభుత్వం హెచ్చరికలు చేసి, బారికేడ్లు పెట్టి, నిఘా కెమెరాలు, పోలీసులతో చుట్టుముట్టినా, అన్నింటిని పక్కకు నెట్టి ప్రభుత్వం ప్రకటించిన పిఆర్‌సిని వ్యతిరేకిస్తూ ఉద్యోగులు తమ ఉద్యమ శక్తిని ప్రదర్శించారు. పిఆర్‌సి సాధనకోసం ఫిబ్రవరి 3న నిర్వహించిన 'ఛలో విజయవాడ'కు పెద్ద ఎత్తున తరలివచ్చారు. వివిధ ప్రాంతాల్లో ఉద్యోగులను దారి మధ్యలోనే ఆపి అరెస్టు చేసి పోలీసుస్టేషన్‌లలో రాత్రి వరకు నిర్బంధించారు. విజయవాడలోని బిఆర్‌టిఎస్ రోడ్డు మొత్తం ఉద్యోగ ఉద్యమకారులతో నిండిపోయింది. విజయవాడ చేరుకున్న ఉద్యోగులు మూడు వైపుల నుంచి ధర్నాచౌక్ వద్దకు చేరుకున్నారు.

## క్షేత్ర సహాయకుల నిరసన

పేద ప్రజల జీవనప్రమాణాల మెరుగుదలకు ఉపయోగపడుతున్న ఉపాధిహామీ క్షేత్రసహాయకుల సంక్షేమాన్ని ప్రభుత్వం పట్టించుకోకపోవడం దారుణమని ఆ సంఘం నాయకులు ఆరోపించారు. క్షేత్రసహాయకుల సంక్షేమ సంఘం జిల్లా శాఖ ఆధ్వర్యాన వారి సమస్యల పరిష్కారం కోరుతూ మచిలీపట్నం కలెక్టరేట్ ధర్నాచౌక్‌లో ఫిబ్రవరి 14న ధర్నా నిర్వహించారు. 2006 నుంచి ఉపాధి హామీ పథకం అమల్లో రాష్ట్రాన్ని దేశంలోనే ముందు స్థానంలో నిలపడంలో తమ పాత్ర ఉందన్నారు. 2016 నుండి ఇతర విభాగాల వారికి వేతనాలు రు. 7,000 నుంచి 9,000 పెంచినా ఎఫ్‌ఏలకు మాత్రం రు. 550 మాత్రమే పెంచారని ఆవేదన వ్యక్తంచేశారు.

## ఆంధ్రప్రదేశ్‌లో కొత్త జిల్లాల ప్రతిపాదనపై నిరసన

జిల్లాల పునర్విభజనకు వ్యతిరేకంగా వివిధ ప్రాంతాల్లో నిరసనలు వ్యక్తమయ్యాయి. ప్రకాశం జిల్లాలోని మార్కాపురంను జిల్లా చేయాలని పిబ్రవరి 15న పట్టణంలో బంద్ నిర్వహించారు. జిల్లా సాధన సమితి ఆధ్వర్యంలో కార్యక్రమం నిర్వహించారు. దుకాణాలు మూసివేసి వ్యాపారులు మద్దతు ప్రకటించారు. ప్రభుత్వ, ప్రైవేట్ కార్యాలయాలు, విద్యాలయాలు మూసివేశారు.

## విశాఖ ఉక్కు పరిరక్షణ కోసం జైలు భరో

దేశ సంపదను కార్పొరేట్ శక్తులకు కట్టబెట్టడమే దేశభక్తా? అని సినీనటుడు ఆర్. నారాయణమూర్తి ప్రశ్నించారు. ఫిబ్రవరి 13న విశాఖపట్నం కూర్మన్నపాలెం కూడలిలో విశాఖ ఉక్కు పరిరక్షణ పోరాట సమితి ఆధ్వర్యంలో నిర్వహించిన జైల్‌భరోలో ఆయన మాట్లాడారు. ఏడాదిగా కార్మికులు ఆందోళనలు చేస్తున్నా కేంద్రం స్పందించకపోవడం దారుణమని ఆయన విమర్శించారు. ఆంధ్రుల హక్కుతో సాధించుకున్న కర్మాగారాన్ని ఐక్య పోరాటాలతో పరిరక్షించుకోవడానికి చేయీ చేయీ కలపాల్సిన సమయం ఆసన్నమైందన్నారు.

## పిడిఎస్‌యు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర 22వ మహాసభలు

ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం (పిడిఎస్‌యు) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర 22వ మహాసభలు 2022 ఫిబ్రవరి 12, 13 తేదీలలో గుంటూరులోని కా. జార్జిరెడ్డి, చాగంటి భాస్కరరావు ప్రాంగణం (ఎన్‌జిఒ కళ్యాణ మండపం)లో విజయవంతంగా జరిగాయి. నల్లమడ రైతు సంఘం నాయకులు డా. కొల్లా రాజమోహన్, 'జాతీయ విద్యా విధానం 2020 – లౌకిక, ప్రజాస్వామ్యం' అనే అంశంపై హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ ప్రొఫెసర్ కె. లక్ష్మినారాయణ, విద్యా పరిరక్షణ కమిటీ కన్వీనర్ రమేష్ పట్నాయక్, ఉస్మానియా యూనివర్సిటీ ప్రొఫెసర్ పద్మజా షా మాట్లాడారు. పిడిఎస్‌యు రాష్ట్ర నూతన అధ్యక్షుడిగా యు. గనిరాజు, రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా కా. ఎల్. రాజశేఖర్‌తో పాటు 23 మందితో నూతన కార్యవర్గాన్ని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

## జిఓ 317ను రద్దుచేయాలని కోరుతూ నిరసనలు

ఉద్యోగ, ఉపాధ్యాయులను ఇబ్బందులకు గురిచేస్తున్న జిఓ 317ను వెంటనే సవరించాలని డిమాండ్ చేస్తూ ఉపాధ్యాయ సంఘాల పోరాట కమిటీ (యుఎస్‌పిసి) ఇచ్చిన పిలుపుమేరకు ఫిబ్రవరి 9న జరిగిన మహాధర్నా ఉద్రిక్తంగా మారింది. ఇందిరాపార్క్ వద్దకు చేరుకున్న ఉపాధ్యాయులను పోలీసులు అనుమతి లేదని అక్కడే అడ్డుకుని అరెస్టు చేశారు. పోలీసుల తీరుపై మండిపడ్డ ఉపాధ్యాయుల పోలీసులకు వ్యతిరేకంగా నినాదాలు చేశారు. దీంతో పరిస్థితి ఉద్రిక్తంగా మారి కొందరు ఉపాధ్యాయులు రోడ్డుపై బైటాయించారు. పోలీసులు వారిని అరెస్టు చేసి వివిధ పోలీస్ స్టేషన్‌లకు తరలించారు.

## నిత్యం కొనసాగుతున్న రైతుల ఆత్మహత్యలు

పంటలు నష్టపోయి, అప్పులు తీర్చేమార్గం లేక ఇద్దరు మిర్చి రైతులు బలవన్మరణానికి పాల్పడగా, తాను సాగుచేసుకుంటున్న భూమి సీతారామ ప్రాజెక్టులో పోయిందన్న ఆవేదనతో మరో రైతు ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ ఘటనలు ఉమ్మడి వరంగల్ జిల్లాలో జనవరి 26న చోటుచేసుకున్నాయి. నర్సింహుల పేట మండలంలోని కొమ్ములవంచకు చెందిన జాటోతు బోద్యా, మహదేవపూర్ మండలం అంబట్‌పల్లికి చెందిన రైతు పుట్ట రవి, డోర్నకల్ మండలం ఉయ్యాలవాడకు చెందిన రైతు కాలుసాని బిక్షం, కేసముద్రం మండలం కోమటిపల్లి శివారు రాంలాల్ తండాలో రమావత్ శ్రీను ఆత్మహత్య చేసుకున్నవారిలో కొందరు.

## కేంద్ర ప్రభుత్వ విధానాలకు నిరసనగా సిఐటియు ర్యాలీ

రైతులకు ఇచ్చిన హామీలను అమలు చేయడంలో మోదీ ప్రభుత్వం విఫలమైందని, కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విద్రోహ చర్యలను ప్రజలు, ప్రజాస్వామిక వాదులు ఖండించాలని సిఐటియు రంగారెడ్డి జిల్లా ఉపాధ్యక్షుడు పేర్కొన్నారు. రైతులకు ఇచ్చిన హామీలను విస్మరించడాన్ని 'రైతు విద్రోహ దినం' పేరిట సిఐటియు ఆధ్వర్యంలో జనవరి 31న ఆటోనగర్‌లో ర్యాలీ నిర్వహించారు. ఏడాది కాలంగా రైతులు చేసిన ఆందోళనల క్రమంలో కేంద్ర ప్రభుత్వం పలు హామీలు ఇచ్చి నిలబెట్టుకోవటంలేదన్నారు. లఖింపూర్ ఘటనకు బాధ్యుడైన కేంద్ర మంత్రిని పదవి నుండి తొలగించాలని డిమాండ్ చేశారు. విద్యుత్ చట్ట సవరణ రద్దు చేయాలని, కార్మిక వ్యతిరేక కోడ్‌లను రద్దుచేయాలని డిమాండ్ చేశారు.

## అసమానతా సముద్రం మధ్య "సమతామూర్తి"

"నేటి సమాజంలో పెరిగిపోతున్న అసమానతలను రూపుమాపడానికి, రామానుజుల స్ఫూర్తిని అందించడానికి సమతామూర్తి కేంద్రం ఏర్పాటు చేస్తున్నాము"ని అంటూ త్రిదండి శ్రీమన్నారాయణ చినజీయర్‌స్వామి, రంగారెడ్డి జిల్లా ముచ్చింతల్ గ్రామం లో వంద ఎకరాల ప్రాంగణం లో వెయ్యి కోట్ల రూపాయల ప్రకటిత ఖర్చుతో, 216 అడుగుల ఎత్తయిన రామానుజాచార్యుల విగ్రహం స్థాపించారు. దానితో పాటు 120 కిలోల బంగారంతో 54 అంగుళాల మరొక విగ్రహాన్ని నెలకొల్పారు. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాని, ఎందరో కేంద్ర మంత్రులు పాల్గొన్న ఈ భారీ కార్యక్రమంలో ఐదువేల మంది రుత్విక్కులతో, 1035 కుండాలతో నిర్వహించిన యాగానికి లక్షా యాభైవేల కిలోల నెయ్యి వాడారు. నిరంతరం సంభాషణల్లో మనువాదాన్ని, కుల అంతరాలను ప్రభోధించే రాజగురువు, రియల్ ఎస్టేట్ వ్యాపారవేత్తల గురువు చిన జీయర్ స్వామి సమత గురించి మాట్లాడడం, అందుకు వెయ్యి సంవత్సరాల కిందటి మతతత్వవేత్త మద్దతు తీసుకోవడం రీజినల్ రింగ్ రోడ్ కూ ఔటర్ రింగ్ రోడ్ కూ మధ్య రియల్ ఎస్టేట్ వ్యాపారానికి ప్రోత్సాహక చిహ్నం తప్ప మరేమీ కాదు. వీ

## దేశ వ్యాప్తంగా ప్రశ్నించే గొంతుల నులిమివేత

**ఝా**ర్ఖండ్‌కు చెందిన ఆదివాసీ-మూల్‌వాసీ వికాస్ మంచ్ సభ్యుడైన బల్దేవ్‌ను జనవరి 29న తన గ్రామం రోహనియా నుంచి విష్ణుగఢ్ పోలీస్‌స్టేషన్‌కు బలవంతంగా ఎత్తుకెళ్లి మానసికంగా, శారీరకంగా చిత్రహింసలకు గురిచేసి 54 గంటల పాటు నిర్బంధించారు. పోలీసుల చర్యకు నిరసనగా హజారీబాగ్ జిల్లా పరిధిలోని విష్ణుగఢ్ బ్లాక్‌లోని నార్కి పంచాయతీ సర్సాస్థల్‌లో చుట్టు పక్కల గ్రామాల ప్రజలు ఫిబ్రవరి 14న నిరసన వ్యక్తంచేశారు. బిహార్‌లోని గయ జిల్లా, బేలాగంజ్ తాలూకా పోలీస్ స్టేషన్ పరిధిలోవున్న ఆడత్‌పూర్ గ్రామం పక్కనున్న మోర్‌హర్ నదిలో ఇసుక తవ్వకాలకు వ్యతిరేకంగా ఫిబ్రవరి 15న నిరసన తెలియచేస్తున్న వారిని నిర్బంధించి పోలీసులు వారి రెక్కలను వెనక్కు కట్టి తీవ్ర హింసలకు గురిచేశారు. పశ్చిమబెంగాల్‌కు చెందిన ప్రజా ఉద్యమ కార్యకర్త, విద్యార్థి నాయకుడు అనీస్ ఖాన్‌ను ఫిబ్రవరి 18 రాత్రి రాష్ట్ర పోలీసు యూనిఫాంలో ఉన్న నలుగురు వ్యక్తులు అతని ఇంటి మూడవ అంతస్తు నుంచి కిందికి తోసి చంపేశారు.

## ఆదివాసీ ప్రాంతాల్లో నిత్యం ఎన్‌కౌంటర్‌లు

**ఛ**త్తీస్‌గఢ్‌లోని సుక్మా జిల్లా చింతల్‌నార్ పోలీస్‌స్టేషన్ పరిధిలోని తిమ్మాపురం అటవీ ప్రాంతంలో జనవరి 30న మావోయిస్టులకు పోలీసులకు మధ్య జరిగిన కాల్పుల్లో ఒక మావోయిస్టు మృతిచెందారని జిల్లా ఎస్‌పి సునీల్‌శర్మ తెలిపారు. బీజాపూర్ జిల్లా పుట్కేల్ అటవీ ప్రాంతంలో మావోయిస్టులకోసం ఫిబ్రవరి 12న సిఆర్‌పిఎఫ్ బలగాలు కూంబింగ్ చేపట్టాయి. ఆ సమయంలో మావోయిస్టులు ఎదురుపడడంతో ఇరుపక్షాల మధ్య కాల్పులు జరగడంతో సిఆర్‌పిఎఫ్ అసిస్టెంట్ కమాండెండ్ మృతిచెందగా మరో జవాను తీవ్రంగా గాయపడ్డారని ఎస్‌పి కమలోచన్ కశ్యప్ తెలిపారు. కుట్రు గ్రామంలో ఒక ప్రభుత్వ ఉపాధ్యాయుడిని పోలీస్ ఇన్‌ఫార్మర్‌గా పనిచేస్తున్నాడని మావోయిస్టులు ఫిబ్రవరి 19న మారణాయుధాలతో చంపారు. దంతెవాడ జిల్లా బుర్గాం అటవీ ప్రాంతంలో ఫిబ్రవరి 20న భద్రతా బలగాలకు మావోయిస్టులకు మధ్య జరిగిన కాల్పుల్లో మావోయిస్టు మృతిచెందారు.

## అహ్మదాబాద్ పేలుళ్ల కేసులో 38 మందికి ఉరిశిక్ష

**గు**జరాత్ రాష్ట్రంలోని అహ్మదాబాద్‌లో 2008లో జరిగిన వరుస బాంబు పేలుళ్ల కేసులో 38 మంది దోషులకు ప్రత్యేక న్యాయస్థానం ఉరిశిక్ష విధించింది. మరో 11 మందికి యావజ్జీవ కారాగార శిక్షను ఖరారు చేసింది. సుదీర్ఘకాల విచారణ అనంతరం ఫిబ్రవరి 18న ఈ తీర్పు వెల్లడించింది. ఈ కేసులో మొత్తం 78 మందిపై అభియోగాలు నమోదుకాగా, వీరిలో ఓ వ్యక్తి అప్రూవర్‌గా మారాడు. మిగతా 77 మందిపై 2009లో విచారణ ఆరంభమైంది. ఫిబ్రవరి 8న 49 మందిని కోర్టు దోషులుగా తేల్చింది. మరో 28 మందిని నిర్దోషులుగా విడుదల చేసింది. దేశంలో ఒక న్యాయస్థానం ఒకేసారి ఇంతమందికి మరణ దండన విధించడం ఇదే తొలిసారి.

## బిహార్‌లో రైలు దగ్ధం చేసిన నిరుద్యోగులు

**రై**ల్వే ఉద్యోగ నియామకాల కోసం నిర్వహిస్తున్న ఆర్ఆర్‌బి పరీక్ష విషయంలో ఆగ్రహించిన అభ్యర్థులు జనవరి 26న బిహార్‌లో ఒక రైలును దహనం చేశారు. అనేక రైళ్లపై రాళ్లతో దాడి చేశారు. యుపిలోనూ అభ్యర్థుల ఆందోళన హింసాత్మకంగా మారడంతో రైల్వేశాఖ అనేక రైళ్లను రద్దుచేసింది. పరీక్షను నిలిపివేయాలని నిర్ణయం తీసుకుంది. రైల్వే ఆస్తుల విధ్వంసానికి పాల్పడినవారిని జీవితాంతం రైల్వే ఉద్యోగాలకు అనర్హులను చేస్తామని హెచ్చరించింది. నాన్ టెక్నికల్ పాపులర్ కేటగిరీస్ పరీక్ష-2021కి ఆర్ఆర్‌బి 2019లో నోటిఫికేషన్ విడుదలచేసింది. లెవల్-2 నుంచి లెవల్-6 వరకు మొత్తం 35 వేల పోస్టులను ఆ నోటిఫికేషన్‌లో పేర్కొంది. ఆ పరీక్ష పూర్తయి ఫలితాలు జనవరి 15న విడుదల చేశారు. అభ్యర్థుల ఎంపికకు మరో పరీక్ష నిర్వహిస్తామని రైల్వే శాఖ ప్రకటించడంతో అభ్యర్థులు ఆందోళనకు దిగారు.

## కశ్మీర్‌లో ఎన్‌కౌంటర్‌లు

జమ్మూ కశ్మీర్‌లోని పుల్వామా, బుద్గాం జిల్లాల్లో ఐదుగురు మిలిటెంట్లను భద్రతా బలగాలు వేర్వేరు ఎన్‌కౌంటర్‌లలో కాల్చివేశాయి. మృతుల్లో జైషే మొహమ్మద్ కశ్మీర్ లోయ చీఫ్ ఉన్నాడని కశ్మీర్ ఐజి విజయ్‌కుమార్ పుల్వామాలో మీడియాకు తెలిపారు. జనవరి 29న పుల్వామా, బుద్గాంలలో మిలిటెంట్లు దాక్కున్నట్లు సమాచారం అందడంతో బలగాలు గాలింపు చేపట్టాయి. అతనితో పాటు మరో ముగ్గురు మృతిచెందారు. అట్లాగే బుద్గాంలోని చరారీ షరీఫ్ ప్రాంతంలో జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఓ మిలిటెంట్ మృతిచెందాడు.

## ఎల్గార్ పరిషత్ నిందితులకు బెయిల్ ఇవ్వాలి

**'ఎ**ల్గార్ పరిషత్' కేసులో అరెస్టయిన నేతలకు బెయిల్ ఇవ్వాలని కోరుతూ ప్రధాని మోదీకి సిపిఎం ఎంపి ఎలమారం కరీం ఇటీవల ఓ లేఖ పంపారు. ఈ లేఖపై సిపిఐ, డిఎంకె, కాంగ్రెస్‌తో పాటు పలు పార్టీలకు చెందిన 19 మంది ఎంపిలు సంతకాలు చేశారు. చట్టవిరుద్ధంగా భారతపౌరులపై సైబర్ దాడులు జరిగాయని మీడియా ప్రతినిధులు, సైబర్ నిపుణులు కూడా చెప్పారంటూ పెగాసస్ అంశాన్ని గుర్తుచేశారు. ఇదే కేసులో మానవ హక్కుల కార్యకర్త రోనా విల్సన్‌ను ఇరికించడం కోసం సైబర్ కుట్ర జరిగినట్టు అమెరికాకు చెందిన సైబర్ నిపుణులు రూపొందించిన నివేదిక వెల్లడించినట్లు అమెరికాకు చెందిన వాషింగ్టన్ పోస్ట్ పత్రిక ఫిబ్రవరి 10న ప్రచురించింది. విరసం నేత వరవరరావుకు కర్ణాటకలోని తుమకూరు జిల్లా మధుగిరి కోర్టు రు. 25 వేల జరిమానా విధించింది. కేసు విచారణకు రానందువల్ల జరిమానా విధించినట్లు తెలిపింది. భీమా-కోరేగావ్ కేసులో వరవరరావు మెడికల్ బెయిల్‌లో ఉన్నారని, ముంబైని విడిచి వెళ్లకూడదని ముంబై హైకోర్టు షరతు విధించిన విషయాన్ని గుర్తుచేస్తూ ఆయనపై జారీచేసిన నాన్‌బెయిలబుల్ వారంట్‌ను రద్దు చేయాలన్న విజ్ఞప్తిని ఫిబ్రవరి 12న మధుగిరి కోర్టు తిరస్కరించింది.

## పాత్రికేయులపై నిబంధనలు-ఎడిటర్స్ గిల్డ్ అభ్యంతరాలు

**పా**త్రికేయుల అక్రెడిటేషన్‌లకు సంబంధించి ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో జారీచేసిన కొత్త మార్గదర్శకాలపై ఎడిటర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా అభ్యంతరాలు వ్యక్తంచేసింది. ఈ మార్గదర్శకాల్లోని క్లాజులు అస్పష్టంగా, నిరంకుశంగా ఉన్నాయని ప్రభుత్వ విధానాలపై పరిశోధనాత్మక కథనాలు చేయకుండా పాత్రికేయులను నిరోధించేలా ఉన్నాయని ఆందోళన వ్యక్తంచేసింది. కనీసం జర్నలిస్టులు తమ వాదన వినిపించుకునే హక్కు కూడా ఇవ్వకపోవడం, పరువునష్టం కేసును కూడా ప్రాతిపదికగా తీసుకోవడం విస్మయం కలిగిస్తోందని పేర్కొంది. కొత్త నిబంధనల్లో అక్రెడిటేషన్లకు సంబంధించి పోలీసు తనిఖీని చేర్చిన ప్రభుత్వం వారి పరిధులను నిర్వచించలేదని దీనివల్ల ప్రభుత్వాన్ని విమర్శించే జర్నలిస్టుల అక్రెడిటేషన్ తిరస్కరించడానికి పోలీసులకు అపరిమితమైన అధికారాలు ఇచ్చినట్లైందని ఆందోళన వ్యక్తంచేశారు.

## ఎన్‌కౌంటర్ ఘటనపై పోలీసులపై ఎఫ్ఐఆర్

**ఉ**త్తరప్రదేశ్‌లోని షాజహాన్‌పూర్ జిల్లాలో 2004లో జరిగిన నకిలీ ఎన్‌కౌంటర్‌కు సంబంధించి ఆనాటి ఎస్‌పి సహా 18 మంది పోలీసులపై కేసు నమోదైంది. ఇద్దరు వ్యక్తులను పోలీసులు ఎన్‌కౌంటర్‌లో చంపిన ఘటనలో చీఫ్ జ్యూడిషియల్ మేజిస్ట్రేట్ ఆదేశాల మేరకు ఈ చర్య తీసుకున్నట్లు ఎస్‌పి ఎస్ ఆనంద్ తెలిపారు. బాధిత కుటుంబాల న్యాయవాది ఇజాజ్ ఖాన్ తెలిపిన వివరాల ప్రకారం 2004 నవంబర్ 3న జలాలాబాద్ పోలీస్ స్టేషన్ పరిధిలో చాచుపూర్ గ్రామానికి చెందిన ఇద్దరు వ్యక్తుల్ని దోపిడీ కేసుల్లో అనుమానితులుగా పోలీసులు అదుపులోకి తీసుకుని ఆ తర్వాత కాల్చిచంపారు. వీ

### అంతర్యుద్ధం అంచున మయన్మార్

**మ**యన్మార్ పౌర ప్రభుత్వంపై సైన్యం 2021 ఫిబ్రవరి 1న తిరుగుబాటు చేసి అధికారాన్ని హస్తగతం చేసుకొని ఏడాది పూర్తి అయింది. పారిశ్రామిక, వాణిజ్యవేత్తలు సైన్యానికి సహకరిస్తున్నారు. ఎన్నికైన నాయకురాలు ఆంగ్ సాన్ సూకికి సైన్యం రెండేళ్ల జైలుశిక్ష విధించింది. ఈ ఏడాది కాలంలో సైన్యం ప్రజలకు చేసింది ఏమీలేదు, హింసతప్ప. ఇవాళ మయన్మార్ ప్రజలు రాజకీయ, సామాజిక, ఆర్థిక, మానవ హక్కుల, మానవత సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నారు. ఐక్యరాజ్య సమితి ప్రచురించిన హ్యూమానిటేరియన్ నీడ్స్ అవలోకనం ప్రకారం దాదాపు సగం జనాభాను పేదరికంలోకి నెట్టివేసి 2022కి స్వాగతం పలికింది. సైనిక తిరుగుబాటుకు వ్యతిరేకంగా సమ్మెలు, సామూహిక నిరసనలు, శాసనోల్లంఘన చేశారు. లైవ్ ఫైర్, వాటర్ ఫిరంగులు, రబ్బరు బుల్లెట్లలో సైన్యం వారిని అణిచి వేసింది. మానవహక్కుల సంస్థల నివేదికలు 12 వేల మంది మరణించి ఉంటారని అంచనా వేశాయి. అయినా తమను తాము రక్షించుకునేందుకు పీపుల్స్ మిలీషియా సైనిక కాన్వాయ్‌లపై దాడులు చేస్తోన్నారు. ప్రజాస్వామ్య పునరుద్ధరణ కోసం, మిలిటరీ పాలన అంతం కోసం ప్రజలు పోరాడుతున్నారు. మయన్మార్ సైన్యం చేసిన నేరాలపై విచారణకు అంతర్జాతీయ సమాజం ప్రయత్నం చేయాలి. ప్రజా ఉద్యమం విజయం సాధిస్తుందని ఆశిద్దాం.

### కాంగోపై యుద్ధానికి కారణమైన యుగాండాకు జరిమానా

**అం**తర్జాతీయ చట్టాలను ఉల్లంఘిస్తూ 1998–2003 మధ్యకాలంలో డెమోక్రటిక్ రిపబ్లిక్ ఆఫ్ కాంగోపై యుద్ధానికి కారణమైనందుకు యుగాండా డీఆర్‌కాంగోకు నష్టపరిహారం చెల్లించాలని ఇంటర్నేషనల్ కోర్ట్ ఆఫ్ జస్టిస్ (ఐసిజె) తీర్పు చెప్పింది. యుద్ధంలో 1,500 మంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారని, బంగారం, కలప, వజ్రాలు వంటివి దోచుకున్నారని ఐసిజె న్యాయమూర్తులు భావించారు. డిఆర్ కాంగో మొత్తంగా 1,100 కోట్ల డాలర్లను (సుమారు రూ. 8 లక్షల కోట్లు) డిమాండ్ చేసింది. న్యాయమూర్తులు డిఆర్ కాంగో కోరిన దానికన్నా తక్కువ మొత్తం పరిహారంగా నిర్ణయించారు. 2022 నుంచి 2026 వరకూ ఏడాదికి 65 మిలియన్ డాలర్ల (సుమారు రు. 480 కోట్లు) చొప్పున యుగాండా చెల్లించాలని ఆదేశించారు.

### కువైట్‌లో స్థానికులకే ఉద్యోగాలు

**గ**ల్ఫ్ దేశం కువైట్ 2017 సెప్టెంబర్‌లో తీసుకువచ్చిన కువైటైజేషన్ పాలసీతో ప్రవాసులకు చుక్కలు చూపిస్తోంది. ఐదేళ్ల కాలపరిమితిలో కువైటీలకు భారీ సంఖ్యలో ఉద్యోగావకాశాలు కల్పించాలనే ఉద్దేశంలో ఈ పాలసీని తీసుకొచ్చింది. దీనిలో భాగంగా ప్రభుత్వ, ప్రైవేట్ రంగాల్లో గడిచిన ఐదేళ్లలో స్థానికులకు భారీగా ఉపాధి అవకాశాలు కల్పిస్తోంది. సాధ్యమైనంతవరకు కీలకమైన రంగాల్లో ప్రవాసులకు ఉద్యోగాలు ఇవ్వడం లేదు. ఇక కువైటైజేషన్ పాలసీలో భాగంగానే ఈ ఏడాది ఆగస్టు నాటికి ప్రభుత్వ సంస్థల్లో పనిచేస్తున్న ప్రవాస ఉద్యోగులను తొలగించి, వారి స్థానంలో కువైటీలను నియమించే ప్రక్రియను పూర్తి చేయాలని ఆ దేశంలోని ఉపాధి ఏజెన్సీ అయిన సివిల్ సర్వీస్ కమీషన్ నిర్ణయించింది. అయితే ఉపాధ్యాయులు, వైద్యులు, సేవా రంగంలో పనిచేస్తున్న వారికి మాత్రం దీని నుంచి మినహాయింపు ఇచ్చింది.

### చిలే మంత్రి పదవుల్లో మహిళలకు అగ్రస్థానం

**చి**లే దేశ చరిత్రలో మొదటిసారిగా, మెజారిటీ క్యాబినెట్ పదవులు మహిళలకే దక్కాయి. చిలే అధ్యక్షునిగా ఎన్నికైన వామపక్షవాది గాబ్రియెల్ బోరిక్ మహిళలకే మెజారిటీ పదవులు ఇచ్చారు. మాజీ విద్యార్థి నేతలు పలువురు ఈ పదవులు పొందినవారిలో ఉన్నారు. కొవిడ్ మహమ్మారిని సమర్థవంతంగా ఎదుర్కొనడం, సమాజంలోని ప్రతి ఒక్క వర్గాన్ని కలుపుకుని వెళ్లడంతో పాటు ఆర్థిక వృద్ధిని పెంపొందించేలా చర్యలు, కొత్త రాజ్యాంగాన్ని ఆమోదించడం ప్రస్తుతం క్యాబినెట్‌కు ఉన్న ప్రాధాన్యత అని బోరిక్ చెప్పారు.

### కెనడాలో జాతీయ అత్యవసర పరిస్థితి

**జ**నవరి చివరి వారంలో కెనడా ప్రభుత్వం కొవిడ్ వ్యాక్సిన్ తప్పనిసరి చేయడానికి వ్యతిరేకంగా నిరసనలు ప్రారంభమయ్యాయి. 'ఫ్రీడమ్ కాన్వాయ్' నిరసనలతో కెనడా–అమెరికా సరిహద్దును దిగ్బంధిస్తున్న ఆందోళనకారులపై ఫెడరల్ అధికారాలను ఉపయోగించాలని బైడెన్ ప్రభుత్వం ట్రూడో ప్రభుత్వాన్ని కోరింది. ట్రక్కులను చేర్చి సరిహద్దులను అడ్డుకోవడంతో ఇరువైపుల ఉన్న ఆటో ప్లాంట్లు మూసి వేయాల్సి వచ్చింది. వ్యాపారులకు సరకులు అందలేదు. కెనడా, అమెరికాలను కలిపే అంబాసిడర్ వారధిపై ట్రక్కులు నిలిపి వారాల పాటు నిరసనలు కొనసాగించారు. దీనిపై దేశ ప్రధాని ట్రూడో స్పందిస్తూ ఫిబ్రవరి 14 నుంచి మునుపెన్నడు ఉపయోగించని అత్యవసర పరిస్థితిని ప్రకటించారు. దీనిపై కూడ తీవ్ర నిరసనలు వ్యక్తమవుతున్నాయి.

### బుర్కినా ఫాసోలో సైనిక తిరుగుబాటు

**బు**ర్కినా ఫాసో పశ్చిమ ఆఫ్రికాలో భూపరివేష్టిత దేశం. పశ్చిమ ఆఫ్రికాలో సుస్థిరత ఉన్న దేశాలలో ఇది ఒకటి. 2015 నుంచి రోచ్ మార్క్ క్రిష్టియన్ కబోరే దేశ అధ్యక్షుడుగా ఉన్నారు. కబోరే ప్రభుత్వాన్ని అసమర్థ, అవినీతికర ప్రభుత్వంగా ప్రజలు, మిలిటరీ భావిస్తోన్నారు. జిహాదిస్టుల కార్యకలాపాలు, కరోనా, ఆర్థిక సంక్షోభం వెరసి ప్రజల్లో అసమ్మతి పెరిగిపోయింది. క్షేత్ర స్థాయిలో ప్రభుత్వం పట్టు కోల్పోయింది. వీధుల్లోకి జనం వచ్చిన కొద్ది రోజులకే జనవరి 23న దేశ అధ్యక్షుడు కబోరే సైనిక శిబిరంలో నిర్బంధించబడినట్లు వార్త వెలువడింది. కబోరేను దేశ అధ్యక్షునిగా తొలగించినట్లు మిలిటరీ జనవరి 24న టెలివిజన్‌లో ప్రకటించింది. ఆ తర్వాత పార్లమెంటు ప్రభుత్వం, రాజ్యాంగం రద్దు అయినట్లు మిలిటరీ నేత పాల్ హెన్రీ సండోగో దమీబా ప్రకటించారు. తనను తాను దేశాధినేతగా ప్రకటించుకున్నాడు.

### చిక్కుల్లో బ్రిటన్ ప్రధాని బోరిస్ జాన్సన్

**బ్రి**టన్ ప్రధాని బోరిస్ జాన్సన్ వివాదంలో ఇరుక్కున్నారు. దేశంలో లాక్‌డౌన్ అమలులో ఉన్న సమయంలో ప్రధాని నివాసం ఉన్న డౌనింగ్ స్ట్రీట్లో జరిగిన ఓ పార్టీ వ్యవహారానికి సంబంధించిన కేసులో పోలీసులు ఆయనకు పలు ప్రశ్నలతో కూడిన లేఖను పంపించారు. లాక్‌డౌన్ అమలులో ఉన్న సమయంలో డౌనింగ్ స్ట్రీట్ నెంబర్ 10లో మందు పార్టీలు జరిగినట్టు పోలీసులు నిర్ధారించారు. ఈ పార్టీలకు అధికార పార్టీకి చెందినవారు వెళ్ళినట్టు పోలీసులు గుర్తించారు. దీంతో ప్రధాని దంపతులతో పాటు దాదాపు 50 మందికి పోలీసులు పలు ప్రశ్నలను సంధిస్తూ లేఖలు పంపారు. వీ




## సింగరేణి కార్మికోద్యమ నవల

# సైరన్

**అల్లం రాజయ్య**

**మలుపు బుక్స్ ప్రచురణ**

ప్రతులకు: **మలుపు బుక్స్**

3-6-677/2, ఫ్లాట్ నెం. 302, ఎం.ఎస్.కె. టవర్స్, స్ట్రీట్ నెం. 11

హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500029

పేజీలు: 392

వెల: రు. 295

Advt.

# అస్తిత్వ అన్వేషణ...

**స్వీయకథ**

**డా. ఎం. వనమాల**

**పాలమూరు అధ్యయన వేదిక ప్రచురణలు**

ప్రతులకు: **డా. జి. విజయ్**

ప్లాట్ నెం. 263, ఇ.నెం. 8-1-284/00/263

ఉస్మానియా యూనివర్సిటీ కాలనీ, షేక్‌పేట్,

హైదరాబాద్ - 500008, ఫోన్ : 9440775454

పేజీలు: 208

వెల: రు. 150




Advt.




# రాజకీయ చదరంగంలో కరువు సీమ

**కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరు జిల్లాల**

**సాగు, తాగునీటి సమస్యలపై సమగ్ర వ్యాసాలు**

**రాయలసీమ విద్యావంతుల వేదిక ప్రచురణ**

ప్రతులకు: **అరుణ్**

ఇ.నెం. 87/106, శ్రీలక్ష్మి నగర్, బి క్యాంప్, కర్నూల్ - 518002

ఫోన్ : 944402 94462, ప్రజాశక్తి, విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో

పేజీలు: 120

వెల: రు. 60

Advt.

# ఈ వేళప్పుడు

**కవిత్వం (2012 - 2021)**

**అరసవిల్లి కృష్ణ**

**విరసం ప్రచురణ**

ప్రతులకు: **అరసవిల్లి కృష్ణ**

6-1-16-7/ఎ, పెద్దిరాజు వీధి, ఫ్రెజర్‌పేట,

విజయవాడ - 520 009, ఫోన్ : 9247253884,

అన్ని ప్రముఖ పుస్తకాల షాపులలో లభించును

పేజీలు : 176

వెల: రు. 120




Advt.

